## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భారతీయ సంస్కృతి

రచయిత

నిష్ఠల సుబ్రహ్మణ్యం

"భారతస్య ప్రతిష్ఠే ద్వే సంస్కృతం సంస్కృతిస్తథా'


ప్రచురణ:

శ్రీ పాపయారాధ్య

ధర్మ సంవర్ధనీ పరిషత్

పొన్నూరు

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

# తొలిపలుకు

భారతీయ సంస్కృతి విస్తృతమైనదీ, గంభీరమైనది. అట్టి భారతీయ సంస్కృతి ద్వారా ఎవరైనా ధార్మిక జీవనం గడిపి భగవంతుని చేరుకోవచ్చు. అయితే ఈ భారతీయ సంస్కృతి మహోన్నతంగా వెలసిన కాలంలో గురుకులాల ద్వారా ప్రణాళికా బద్ధంగా బోధింపబడేది. భారతీయ సంస్కృతి విశ్వసంస్కృతి. ఇది అందరిదీ, ఈ సంస్కృతిని అందరికీ బోధించి, వారిచే ఆచరింపజేసి సౌమనస్య సౌభ్రాత్రాలతో విశ్వశాంతిని కల్గించడం ప్రస్తుతం మనపని. అందుకే మహాకవి, యోగివర్యులైన శ్రీ పాపయారాధ్యుల వారి పేర పొన్నూరులో 'ధర్మ సంవర్ధనీ పరిషత్తు' స్థాపించబడింది. ఈ పరిషత్తు ప్రణాళికా బద్ధంగా భారతీయ సంస్కృతిని వెలువరిస్తుంది. ఆధునిక కాలంలో ప్రశ్నలు-సమాధానాల రూపంలో సంస్కృతిని బోధించడం పరిషదాశయం. ఈసంస్థ ఈ పుస్తకాన్ని మొదటి పాఠ్యాంశంగా నిర్ణయించి ముఖ్యంగా కార్యకర్తల చేత, ఇంకా ఆసక్తిగలవారిచేత కంఠస్థం చేయించి, పరీక్షలు నిర్వహించి యోగ్యులకు అర్హతాపత్రాలనివ్వాలని సంకల్పించింది ప్రతి భారతీయుడు దీన్ని కంఠస్థం చెయ్యాలని సంస్థ ఆకాంక్షిస్తుంది. కంఠస్థం చేసినవారు ఈ సంస్థతో సంప్రదించి పరీక్షలలో పాల్గొనవచ్చును.

ఇట్టి పుస్తకాన్ని ప్రచురించడానికి ఆర్థిక సహాయాన్నందించి సహకరించిన మిత్రులు, సహృదయులైన శ్రీ జాస్తి సాంబశివరావు M. Sc, Ph. d. గారికి, శ్రీ కొంజేటి జయప్రకాశరావుగారికి ధర్మ సంవర్ధనీ పరిషత్తు హార్దికాభినందనలనందజేస్తుంది. వీరు అమెరికాలో డాక్టర్లుగా స్థిరపడిగూడ భారతీయ సంస్కృతిని విశ్వసంస్కృతిని చేయాలని సంకల్పించడం ఆనందకరమైన విషయం. వీరికి జగదంబ ఆయురారోగ్యైశ్వర్యాదులను ప్రసాదించాలని సంస్థ ఆకాంక్షిస్తున్నది.

1) భారతమౌనిపుంగవులు భానుసహస్రరుచిప్రకాశులై
వారిత చిత్రవిక్రియులవారిత దివ్యసహస్రశక్తులై
కారణజన్ములై పలుక గాసటబీసటగా దలంపకన్
ధారణసేయ వ్రాయగనె ద్రవ్యము నిచ్చిరి మిత్రు
లుత్తముల్.

2) వైద్యవిజ్ఞానమున మానవాళి కెల్ల
శాంతి గూర్చుచు నాంతరశమము నొసగ
భారతర్షుల వాక్సుధాభాండ దిత్స
పొత్తమును వ్రాయ ప్రేరేచె భువినినన్ను

3) కొండేటి వంశ్యం చ జయప్రకాశమ్
సాంబం శివం జాస్తి కులప్రసూతమ్
శ్రీరామచంద్రః పరిపాతు నిత్యమ్
శ్రీజానకీ చంద్రికయా సమేతః.

ఇందులోని కొన్ని ముఖ్యాంశాలను వెలువరించిన ఆయా గ్రంథ కర్తలయిన పండితులకు, ప్రూఫ్‌రీడింగ్ చేసిన చి॥ శ్రీ వుయ్యూరు లక్ష్మీనరసింహారావు M. A. Ph. d. గారికి, సకాలంలో ముద్రించి అందించిన ఆదిత్య ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

ఉదారులు సహకరిస్తే తరువాత భాగాలుగూడ వెలుగులోకి వస్తాయి. భారతీయ, భారతీయేతర సోదరులందరు దీనివలన ప్రయోజనం పొందగలరని ఆకాంక్షిస్తూ !

మీ రచయిత

# భారతీయధర్మము - సంస్కృతి

(ప రి చ య ము)

## (ప్రశ్నోత్తరములు) - వేదములు

1) ధర్మమునకు మూలగ్రంథమేది?

వేదములు ధర్మబోధనలో మూల గ్రంథములు.

2) ధర్మనిర్ణయమున ఇంకను ప్రమాణములేవి?

వేదములేగాక, ఆ వేదార్థమును చక్కగా గుర్తించిన ఋషులచే రచింపబడిన స్మృతులన్నియును, ఇంకను వారి ప్రవర్తనయు ధర్మవిషయమున ప్రమాణములు.

3) ధర్మమనగానేమి?

ప్రపంచమునేది కాపాడుచున్నదో, ఏది యథార్థజ్ఞానమో అదియే ధర్మము, శుభములనొనగూర్చు యజ్ఞాదులయందు ప్రవర్తించుట, మాంసభక్షణ పరద్రవ్యహరణాది పాపములలో ప్రవర్తింపకుండుట ధర్మమనబడును.

4) వేదమునకు పర్యాయపదములేవి?

శ్రుతులు, ఆమ్నాయములు, నిగమములు

5) శ్రుతులకు, స్మృతులకు గల భేదమేమి?

శ్రుతులనగా వేదములు. స్మృతులనగా ధర్మశాస్త్రములు.

6) శ్రుతులకు, స్మృతులకు ఆయా నామములెట్లు కలిగినవి?

ఋషులు తపస్సమాధిలో నున్నపుడు వేదమంత్రములు వారికి వినబడినవి. కావున అవి శ్రుతులైనవి. వేదార్థమును స్మరించి ఋషులు వాని కనుగుణముగా ధర్మశాస్త్రములను రచించిరి. కావున అవి స్మృతులైనవి.

7) శ్రుతిస్మృతి ధర్మాచరణమువలన ఫలమేమి?

శ్రుతిస్మృతులయందు చెప్పబడిన ధర్మము నాచరించుటవలన ఈ లోకమందు కీర్తియు, పరలోకమున నుత్తమస్థితి కలుగును

8) వేదములెన్ని? అవియేవి?

వేదములు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము అని వేదవిభాగము గలదు.

9) వేదములను రచించినదెవరు?

వేదముల నెవ్వడును రచింపలేదు.

10) వేదము లెట్లేర్పడినవి?

సృష్ట్యాదియందు భగవంతుని నిశ్వాసరూపముగా వేదాలేర్పడినవి.

11) వేదమను శబ్దమున కర్థమేమి?

'విదజ్ఞానే' అనే ధాతువునుండి వేదమను పద మేర్పడినది. వేదమనగా జ్ఞానమని యర్థము. ప్రత్యక్ష ప్రమాణములు, అనుమాన ప్రమాణములద్వారా గుర్తింపలేని యర్థమును దేని ద్వారా తెలియగల్గుదుమో దానికే వేదమని పేరు.

12) వేదములందు చెప్పబడిన ప్రధాన క్రియ యేది ?
వేదమందు యజ్ఞములు ప్రధానముగా చెప్పబడినవి.

13) యజ్ఞమందు ప్రధాన నిర్వాహకు లెవరు ?
యజ్ఞమునందు హోత, అధ్వర్యువు, ఉద్గాత, బ్రహ్మయను నల్గురు ప్రధాన నిర్వాహకులుగ వ్యవహరింతురు.

14) వారెట్లేర్పడుదురు ?
ఋగ్వేదమును చక్కగా నేర్చినవాడు హోత. యజుర్వేదమును తెలిసినవాడు అధ్వర్యువు. సామవేద రహస్యము తెలిసిన వాడు ఉద్గాత. అధర్వణవేద క్రియావేత్త బ్రహ్మగ నుందురు.

15) వేదము వలన ఎట్టి ఫలము చేకూరును ?
వేదమంత్ర ప్రయోగము వలన వర్షము కురియుట, కామిల మొదలగు రోగములు తగ్గుట మొదలగునవి ఈ లోకమునందు కలుగు ప్రయోజనములు స్వర్గము లభించుట, మోక్షము కలుగుట ఆధ్యాత్మిక ప్రయోజనములు.

16) మోక్షము వలన ప్రయోజనమేమి ?
పుట్టుట, ముసలితనము, రోగములు, మరణము, దుఃఖములు ప్రతి జన్మయందు కలుగుచుండును. ఇవియన్నియు నశించి శాశ్వతమైన యానందము మోక్షమువలన మాత్రమే కలుగును. కావున మోక్షమును పొందుటయే మానవుని ముఖ్య కర్తవ్యము.

17) మోక్షేచ్ఛ యెట్లు ఏర్పడును ?
ధర్మమును బహుకాలము ఆచరించుటవలన ఆధ్యాత్మికభావము బలపడి మోక్షేచ్ఛ కలిగి మానవుడు ముక్తికై యత్నించును.

18) వేదముల యందు ధర్మములెట్లు చెప్పబడినవి ?
వేదములయందు వర్ణధర్మములు, ఆశ్రమ ధర్మములని విభజించి ధర్మములు చెప్పబడినవి.

19) వర్ణములు, ఆశ్రమముల యందలి విభాగములను తెలుపుము ?
మానవులు నాలుగు వర్ణములుగ విభజింపబడినారు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అని నాల్గువర్ణములు గలవు. బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్న్యాసాశ్రమము అని నాల్గువిధములైన యాశ్రమములు గలవు. ప్రతి వర్ణమునకు, ప్రతి ఆశ్రమమునకు వేఱువేఱు ధర్మములు గలవు.

20) మోక్షమెట్లు కలుగును ?
ఏ వర్ణము వారు ఆ వర్ణ ధర్మములను, ఏ ఆశ్రమమువారు ఆ యాశ్రమ విధులను చక్కగాగుర్తించి యాచరించుటవలన పరిశుద్ధమైన మనస్సు, ఆధ్యాత్మిక భావములు కలిగి, బలపడి క్రమక్రమముగా ఆధ్యాత్మికానుభూతులు కలిగి మోక్షము కలుగును. వర్ణాశ్రమ ధర్మపాలనము వలననే మోక్షము కలుగును.

21) వేదపఠనమున గమనార్హమగు ముఖ్యాంశమేది ?
వేదపారాయణమున, స్వరము ముఖ్యమైనది. స్వరము లేక చదివిన వేదము ఫలము నొసంగజాలదు.

22) స్వరములెన్ని ? అవియేవి ? వాని లక్షణములేవి ?
స్వరములు ఉదాత్తము, అనుదాత్తము, స్వరితమని మూడు విధములు. ఉచ్చారణమందు నూర్ధ్వగతియందుచ్చరించుట ఉదా

త్తము అవరోహణమునందుచ్చరించుట అనుదాత్తము. ఒకే స్థలమున కొంత యారోహగతియందు మఱికొంత అవరోహ గతియందు నుచ్చరించుట స్వరితము.

23) స్వరము లేనిచో నష్టమేమో యుదాహరణ పూర్వకముగా తెలుప్పుము.

వేదమునందు ప్రధానమైనది స్వరము. ఒకే పదమునకు రెండర్థములున్నప్పుడు ఒక్కొక్క స్వరముతో నుచ్చరించినప్పుడు ఒక్కొక్క అర్థము వచ్చును. అర్థమునుబట్టి వెంటనే ఫలము కలుగుచుండును. పూర్వము వృత్రాసురుడు ఇంద్రుని సంహరింపదలచి యజ్ఞమునుచేసి కృత్యను సృష్టించెను. ఇంద్రుని సంహరింపుమను భావముతో ఒక వాక్యమును పలికెను. కాని యాతడు ఒక స్వరమునకు మఱియొక స్వరము నుచ్చరించెను. వెంటనే ఆ వాక్యమునకు ఇంద్రునియొక్క శత్రువును సంహరింపుమనెడి యర్థము వచ్చినది. వెంటనే కృత్య వృత్రాసురునే సంహరించినది. కావున స్వరముతో చక్కగా చదివినప్పుడే సరియైన యర్థము వచ్చి క్రియ సఫలమగును. లేనిచో అనేక నష్టములు చేకూరును.

24) స్వరములెట్లు నేర్వవలయును ?

స్వరములను పుస్తకములను చూచి చదువుటకు వీలులేదు. అవి యెట్లుచ్చరింపబడవలయునో గురువుగారి ద్వారా కొంతకాలము అభ్యసింపవలయును. కావున గురుకులమున కేగవలయును.

25) వేదములకు దేవతలెవరు ?

ఋగ్వేదమునకు అగ్ని. యజుర్వేదమునకు వాయుదేవుడు.

సామవేదమునకు సూర్యుడు, అథర్వవేదమునకు చంద్రుడు దేవతలు.

26) మంత్రజపము ప్రారంభమున అవశ్యముగా తెలియదగినవేవి ?

ప్రతి మంత్రమును జపించుటకు ప్రారంభమున ఆ మంత్రము యొక్క ఋషిని, దేవతను, ఛందస్సును తప్పక తెలిసికొని స్మరింపవలెను.

27) వానిని తెలియకున్న నష్టమేమి ?

మంత్రముల ఋషి, ఛందస్సు, దేవతలను తెలిసికొనకున్నను, స్మరింపకున్నను జపించువాడు, చేయించువాడు చలనములేని పదార్థమగుటయో, చీకటితో కూడిన గుంటలో పడుటయో జరుగును. మహాపాపము సంక్రమించును.

28) వేద సంప్రదాయములను గూర్చి వ్రాయుము ?

వేదసంప్రదాయములు రెండు విధములుగ నుండును. 1) బ్రహ్మ సంప్రదాయము, 2) సూర్య సంప్రదాయము. వ్యాసుడు తన శిష్యులైన పైల, వైశంపాయన, జైమిని సుమంతులకు బోధించినది బ్రహ్మసంప్రదాయము. యాజ్ఞవల్క్యుడు సూర్యుని నుండి నేర్చిన పద్ధతి సూర్యసంప్రదాయము.

29) వేదములను విభజించిన వారెవరు ?

సృష్ట్యాదియందు వేదములన్నియు ఒకే రాశిగ నుండెను. వానిని విడదీసి నాల్గువేదములుగ కూర్చినవాడు వ్యాసభగవానుడు. కావుననే అతడు వేదవ్యాసుడయినాడు.

30) వేదమాత చేయుచున్న ఉపదేశములలో నొకదానిని పేర్కొనుము?
బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులందరు సుఖశాంతులతో నుండవలయునని, ప్రతివ్యక్తి అందరిలోను ఇష్టమైనవాడుగా కావలయునని, నలువైపుల నుండి మంగళకరమైన సంకల్పములే మనందరికి కలుగవలయునని, మాతృ పితృగురుదేవుల వలన జన్మ ధన్యము చేసికొనవలయునని కరుణాపూర్ణయగు వేదమాత దివ్యోపదేశము చేయుచున్నది.

## ఛందశ్శాస్త్రము

31) వేదార్థ జ్ఞానమెట్లు కలుగును ?
వేదార్థజ్ఞానము కలుగుటకు కేవల వేదాధ్యయనము సరిపోదు. వేదార్థములను, వేద రహస్యములను తెలిసికొనవలెనన్నచో ఆరు శాస్త్రములను క్షుణ్ణముగా గురుముఖతః చదువవలయును. ఈ ఆరు శాస్త్రములకే షడంగములని పేరు. ఈ ఆరు విద్యల యందు క్షుణ్ణమైన పాండిత్యము గలవాడు మాత్రమే వేదార్థ జ్ఞానమును పొందగల్గును.

32) షడంగము లేవి?
శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనునవి షడంగములు.

33) షడంగములకు వేద పురుషునకుగల సంబంధమేమి ?
పురుషునకు అవయవములున్నట్లే వేద పురుషునకుగూడ అవయవములుండును. ఈ ఆరు శాస్త్రములును వేద పురుషునకు

ఆఱు అవయవములగుచున్నవి. అవి యెట్లనగా శిక్ష వేద పురుషునకు ముక్కువంటిది. ఇట్లే, వ్యాకరణ శాస్త్రము ముఖము వంటిది ఛందస్సు పాదములు. నిరుక్తము కర్ణము. జ్యోతిషము కన్ను. కల్పము బాహువులు.

34) ఛందశ్శాస్త్రమనగా నేమి ?

ఆంధ్రభాషయందు ఉత్పలమాల, చంపకమాల యను వృత్తములున్నట్లే సంస్కృత భాషయందును వృత్తములుండును. అనుష్టుప్, ఆర్య మొదలగు అనేక భేదములు సంస్కృతమునందు గలవు. మంత్రములను చెప్పెడి పద్ధతికే ఛందస్సనిపేరు.

35) ఛందశ్శాస్త్రమునకు మూలపురుషుడెవ్వడు? ఆతని గ్రంథమేది?

పింగళినాగుడను మహర్షి ఛందశ్శాస్త్రమునకు మూల పురుషుడు. ఇందు ఎనిమిది అధ్యాయములు గలవు. ఈ గ్రంథమంతయు సూత్రములలో నుండును.

36) పింగళినాగుడు ఈ శాస్త్రమునెట్లు నిర్మించెను ?

అనేక విధములైన తపస్సులనుచేసి వేదముల సారాంశమును గ్రహించి వేదమాతయను గ్రహమువలన ఛందశ్శాస్త్రమును రచించెను.

7) ఈ మూలగ్రంథమునందెన్ని సూత్రములు గలవు?

పింగళనాగుని ఛందశ్శాస్త్రమునందు నాల్గు వందల సూత్రములు గలవు.

38) పింగళనాగుని సూత్రములెట్లుండును?
వ్యాఖ్యానము చదువనిచో సూత్రములను అర్ధము చేసికొనుట చాలా కష్టము.

39) ఈతని సూత్రములకు వ్యాఖ్యానము లెన్నిగలవు? అందు ప్రసిద్ధమైనదేది?
ఈ గ్రంథమునకు నాల్గు వ్యాఖ్యలు ప్రసిద్ధములు, అందు హలాయుధుని మృతసంజీవని గొప్పది.

# కల్పసూత్రములు

40) కల్పసూత్రములనగా నేమి?
వేదమందలి యే మంత్రము ఏ కార్యమందుపయోగపడునో యెట్లుపయోగించవలయునో తెలుపునది కల్పసూత్రము. ఏ మంత్రము ఏ యజ్ఞమందుండునో ఈ కల్ప సూత్రములు తెలుపుచుండును.

41) కల్పసూత్రములను రచించినవారిలో ప్రసిద్ధులైన ఋషులెవ్వరు?
ఆశ్వలాయనుడు, బౌధాయనుడు, ఆపస్తంబుడు మొదలగు ఋషులు ప్రసిద్ధులు.

42) కల్పసూత్రములయందలి భేదమును వివరించునది.
కల్పసూత్రములు శ్రౌత సూత్రములు, స్మార్త సూత్రములని రెండు విధములు, స్మార్తసూత్రములు మఱల గృహ్యసూత్ర

ములు, ధర్మసూత్రములని రెండుగా విభజింపబడినవి. శుల్బ సూత్రములను కల్పసూత్రములే. అవి శ్రౌతసూత్రములందు చేరియుండును.

43) శ్రౌతసూత్రములలో ప్రతిపాదింపబడు విషయమేది ?
అగ్నిహోత్రము, దర్శపూర్ణమాస యాగములు, అనేక విధములైన సోమయాగములు చెప్పబడియున్నది.

44) గృహ్యసూత్రముల యందుండు విషయమేది ?
భారతీయులకు నిత్యము జరుపబడు షోడశసంస్కారముల పద్ధతులన్నియు గృహ్యసూత్రముల యందు నిరూపింపబడినది.

45) ధర్మసూత్రముల యందేమి గలదు ?
ప్రజలు సుఖశాంతులతో జీవించుటకై నిత్యము ఆచరింపదగిన విధులు, ధర్మవిషయములు అన్నియు ధర్మసూత్రముల యందు ఋషులచే చక్కగా తెలియజేయబడినవి.

46) కల్పసూత్రిములలో ప్రసిద్ధములయిన కల్పసూత్రములను తెలుపుము
అశ్వలాయన కల్పసూత్రము, శాంఖాయన కల్పసూత్రము, కాత్యాయన సూత్రము, పారస్కర గృహ్యసూత్రము కాత్యాయన శుల్బసూత్రము.

47) ఇంకను ఇతర వేదశాఖలకు కల్పసూత్రములను రచించిన ప్రసిద్ధ మునులెవ్వరో పేర్కొనుము.
బౌధాయనుడు, ఆపస్తంబుడు, లాట్యాయనుడు, ద్రాహ్యాయణుడు, జైమిని, గోభిలుడు, ఖదిరుడు, వైతానుడు, కౌశికుడు.

## వేదాంగములు

# జ్యోతిశ్శాస్త్రము

48) జ్యోతిషమనగానేమో క్లుప్తముగా తెలుపుము.

జ్యోతిషులకు సంబంధించినదియు, కాలమును తెలుపునది యగు శాస్త్రమే జ్యోతిశ్శాస్త్రము.

49) జ్యోతిశ్శాస్త్రము వేదమునకు ఎట్లుపకరించునో తెలుపుము.

కాలమునందు కొన్ని క్షణములు మంగళకరమైనవి యుండును. అట్టి మంగళకరములైన ముహూర్తము లెవ్వియో గుర్తించి ఆ సమయముల యందు యాగములను చేసినచో అట్టి యాగములు వెంటనే సత్ఫలితములనొసంగును. అట్టి సుముహూర్తములను కనిపెట్టుట జ్యోతిశ్శాస్త్రమువలన మాత్రమే సాధ్యపడును. కావున జ్యోతిశ్శాస్త్రము వేదమునకుపయోగపడుచు వేదాంగమైనది.

50) వేదాంగజ్యోతిషమును నిర్మించిన ఋషియెవ్వరు?

వేదాంగముగా జ్యోతిశ్శాస్త్రమును నిర్మించిన మహాముని లగధుడు.

51) జ్యోతిశ్శాస్త్రము నందుగల ప్రధాన భాగములేవి?

సిద్ధాంతము, సంహిత, హోరయనుమూడును జ్యోతిశ్శాస్త్రము నందు ప్రధాన విభాగములు.

52) జ్యోతిశ్శాస్త్రము నందు గల నవగ్రహములను పేర్కొనుము?
రవి, చంద్రుడు, కుజుడు, రాహువు, గురువు, శని, బుధుడు, కేతువు, శుక్రుడు జ్యోతిశ్శాస్త్రము నందలి గ్రహములు.

53) జ్యోతిశ్శాస్త్రమును ప్రచారముచేసిన ఋషులెందరు? వారెవరు?
సూర్యుడు, బ్రహ్మ, వ్యాసుడు, వశిష్ఠుడు, అత్రి, పరాశరుడు, కశ్యపుడు, నారదుడు, గర్గుడు, మరీచి, మనువు, అంగిరసుడు, లోమశుడు పులిశుడు, చ్యవనుడు, యవనుడు, భృగువు, శౌనకుడు అను పదునెనిమిది మంది జ్యోతిశాస్త్రమును ప్రచారము చేసిన సిద్ధాంతకర్తలు. వీరిలో సూర్యుడు, బ్రహ్మ దేవతలు, మిగిలినవారు మహర్షులు,

## నిరుక్తము

54) నిరుక్తమనగానేమి?
ఇతర గ్రంథ సాహాయ్యమక్కరలేకనే పదములను నిర్వచించుచూ అర్థములను తెలియజేయునదియే నిరుక్తమనబడుచున్నది.

55) బ్రాహ్మణ గ్రంథములకు, నిరుక్తమునకుగల భేదమేమి?
వేద మంత్రముల యందుండు పదములకు తాత్పర్యమును తెలియజేయు గ్రంథములే బ్రాహ్మణములనబడుచున్నవి, బ్రాహ్మణ గ్రంథముల వలనను తాత్పర్యము పరిపూర్ణముగా తెలియదు. నిరుక్తమందలి నిర్వచన పద్ధతుల ద్వారా వేదపదముల తాత్పర్యము విశదముగా తెలియును.

56) నిరుక్తమును రచించినదెవరు? అందలి అధ్యాయములెన్ని?
యాస్కుడను మహాముని నిరుక్తమును రచించెను. పదములు నిఘంటురూపముగ నుండును. వాని వ్యాఖ్యానమును యాస్కుడు చక్కగా తెలిపెను. ఈ గ్రంథమునందు ఐదు అధ్యాయములున్నవి.

57) యాస్కమహర్షి వేదవ్యాఖ్యానములయందు ప్రామాణికులుగా తలచిన ఋషులెవ్వరు ?
యాస్కముని శాకల్యని, గార్గ్యని ప్రామాణికులుగా భావించెను. శాకల్యుడు ఋగ్వేదమునకు పదకారుడు. గార్గ్యుడు సామవేదీయ సంహితకు పదకారుడు. వీరిరువురు గొప్ప ఋషులు.

58) నిరుక్తమందలి కాండములెన్ని? అవియేవి?
నిరుక్తమునందు మూడు కాండములు గలవు. మొదటిది నైఘంటుకకాండ, రెండవది నైగమకాండ, మూడవది దేవతా కాండ.

59) యాస్కమునికంటె ముందుగా రచింపబడిన నిరుక్తగ్రంథము లెన్ని? వానిని రచించిన ఋషులెవ్వరో పేర్కొనుము?
యాస్కముని తన నిరుక్తమునందు ప్రాచీనులైన పదుమ్గురు ఋషులను నిరుక్తగ్రంథకర్తలుగా పేర్కొనినాడు.
1. ఔపమన్యవుడు 2. ఔదుంబరాయణుడు 3. వార్ష్యాయణి
4. గార్గ్యుడు 5. ఆగ్రాయణుడు 6. శాకపూణి 7. ఔర్ణనాభుడు
8. తైటికి 9. గాలవుడు 10. స్థౌలాష్ఠీవి 11. క్రౌష్టుకి

12. కాశకృత్స్నుడు 13. కౌత్సవ్యుడు 14. యాస్కుడు. వీరిలో పదునాల్గవ నిరుక్తకారుడు యాస్కుడు.

60) యాస్కమహర్షి నిరుక్తమునెట్లు రచింపగల్గెను ?
యాస్కముని శంకరుని యజ్ఞములచే మెప్పించి యాతని యనుగ్రహము వలన నిరుక్తజ్ఞానమును పొంది రచింపగల్గెను.

## శిక్ష

61) శిక్షయనగా నేమో తెలుపుము.
వేదమంత్రముల యందలి అచ్చులు, హల్లులు ఎట్లుచ్చరింపవలయునో స్పష్టముగా తెలుపు గ్రంథమునకే శిక్షయని పేరు.

62) శిక్షాగ్రంధము యొక్క ప్రయోజనము ఏ గ్రంథమందు తెలుపబడినది ?
తైత్తిరీయోపనిషత్తునందు శిక్షాగ్రంథము యొక్క స్వరూపము, ప్రయోజనములు తెలుపబడినవి.

63) శిక్షాగ్రంథములయందే యే విషయములు నిరూపింపబడును ?
వర్ణములు, స్వరములు, మాత్రలు, బలము, సామ, సంతానము అను విశేష విషయములన్నియు శిక్షాగ్రంథములయందు స్పష్టముగా నిరూపింపబడును.

64) పూర్వకాలమున మహర్షులచే రచింపబడిన శిక్షాగ్రంథములు ఎన్ని లభించుచున్నవి ?
ప్రస్తుతము ముప్పది శిక్షాగ్రంథములు లభించుచున్నవి.

65) శిక్షాగ్రంథములు రచించిన వారిలో కొందరు ఋషులను పేర్కొనుము.

యాజ్ఞవల్క్యుడు, వశిష్ఠుడు, కాత్యాయనుడు, పరాశరుడు, నారదుడు, శౌనకుడు, గౌతముడు, పాణిని మొదలైన ఋషులు శిక్షాగ్రంథములను రచించిరి.

66) శిక్షా గ్రంథములలో దేనికి మిక్కిలి ప్రాముఖ్యము కలిగినది ?

పాణిని మహర్షి రచించిన శిక్షాగ్రంథమునకే లోకమున నెక్కువ ప్రాముఖ్యము లభించినది.

67) శిక్షాగ్రంథములయందు భేదమున్నదో లేదో తెలుపుము.

వేదములనుబట్టి శిక్షాగ్రంథములలో భేదమేర్పడుచున్నది. అనగా ఒక్కొక్క వేదమునకు ఒక్కొక్క విధమైన శిక్షలుండును. శుక్ల యజుర్వేదమునకు యాజ్ఞవల్క్యుని శిక్షాగ్రంథమనుబంధముగా నుండును. సామవేదమునకనుకూలముగా నారదమహర్షి వ్రాసిన శిక్షాగ్రంథముపయోగపడును. ఇట్లు వేద భేదమునుబట్టి శిక్షాగ్రంథముల యందును భేదమేర్పడినదని తెలియవలెను.

## వ్యాకరణము

68) వ్యాకరణ శాస్త్రమనగా నేమి ?

భాషయందు ప్రకృతి ప్రత్యయములను నిరూపించుచు పదములను సంస్కరించి వ్యాఖ్యానము చేయు శాస్త్రమే వ్యాకరణ శాస్త్రమనబడుచున్నది.

69) వ్యాకరణ శాస్త్రము యొక్క ప్రయోజనములలో కొన్నిటిని తెలుపుసది.

1. వ్యాకరణము భాషకు దీపము వంటిది. వ్యాకరణము లేనిచో భాషయుండదు. శబ్దజ్యోతి లేనిచో ప్రపంచము అంధకారమయమై యుండెడిది.

2. సంస్కృత భాషయందున్న వేదములను తెలిసికొనుటకు భాషాజ్ఞానము అందుకు వ్యాకరణము అత్యవసరము.

3) వ్యాకరణ నియమముల ననుసరించి యజ్ఞములు చేయువారు మంత్రములను చెప్పవలయును. కావున వ్యాకరణము అవసరము.

70) సంస్కృత భాషయందు వ్యాకరణము లెన్నిగలవు ?

సంస్కృత భాషయందు తొమ్మిది వ్యాకరణములు గలవు.

71) నవవ్యాకరణములను తెలుపుము.

ఐంద్రము, చాంద్రము, కాశకృత్స్నము, కౌమారము, శాకటాయనము, సారస్వతము, ఆపిశలము, శాకలము, పాణినీయము అనునవి సంస్కృత భాషయందున్న నవవ్యాకరణములు.

72) నవవ్యాకరణముల యందును ప్రసిద్ధమైనదేది ?

పాణినిముని రచించిన వ్యాకరణము నవవ్యాకణముల యందు ప్రసిద్ధమైనది.

73) పాణిని రచించిన వ్యాకరణము పేరేమి ? అందెన్ని అధ్యాయములున్నవి ? ఆ గ్రంథమెట్లుండును ?

పాణిని రచించిన వ్యాకరణమునకు అష్టాధ్యాయి యనిపేరు. ఇందెనిమిది యధ్యాయములు గలవు. ఈ గ్రంథమంతయు సూత్రరూపమున రచింపబడినది.

74) పాణిని అష్టాధ్యాయి నెట్లు రచింపగల్గెను ? అందెన్ని సూత్రములున్నవి ?

తపస్సుచే ఈశ్వరుని మెప్పించి యాతని యనుగ్రహము వలన అష్టాధ్యాయిని రచింపగల్గెను. అందు సుమారు 4000 సూత్రము లున్నవి.

75) పాణిని తరువాత వ్యాకరణ శాస్త్రమును వృద్ధిపొందించిన ఋషులెవ్వరు ?

పాణిని సూత్రములను వ్రాయగా వరరుచిముని సూత్రముల కనుబంధముగా వార్తికములను రచించెను. తరువాత ఆదిశేషుడే పతంజలి మునిగా అవతరించి పాణిని సూ తములకు వ్యాకరణ మహాభాష్యమును రచించెను.

## ఉపాంగములు

76) ఉపాంగములనగానేమి?

వేదమందలి విజ్ఞానమును నిరూపించుచు, మోక్షప్రాప్తికి మార్గములను చూపు శాస్త్రములకే ఉపాంగములనిపేరు. వీనినే దర్శనములనియు వ్యవహరింతురు.

77) దర్శనములందలి భేదములను తెలుపనది.

దర్శనములు స్థూలముగా రెండు విధములు. వైదిక దర్శనములు, అవైదిక దర్శనములు. వేదమును ప్రమాణముగా గ్రహించినవి వైదికములు, వేద విరుద్ధమైనవి అవైదికములు. వేద విరుద్ధ దర్శనములు-చార్వాకదర్శనము, జైనదర్శనము, బౌద్ధదర్శనము మొ॥ వేదమునంగీకరించిన దర్శనములారు. ఇవియే యుపాంగములు. 1. న్యాయదర్శనము 2. వైశేషికదర్శనము 3. సాంఖ్యదర్శనము 4) యోగదర్శనము 5) పూర్వమీమాంసా దర్శనము 6. వేదాంతదర్శనము (ఉత్తర మీమాంసా దర్శనము)

78) చార్వాకదర్శనమేమి తెలుపును ? దర్శనములలో దాని స్థితి యెట్టిది ?

అగ్నిహోత్రాదికర్మములు, జన్మము, మోక్షము వీని నంగీకరింపదు. భగవంతుడు లేడనును. అవైదిక దర్శనములలో చార్వాకముకంటె జైనము. జైనముకంటె బౌద్ధ దర్శనము గొప్పది.

79) చార్వాకదర్శనమునకు మూలపురుషుడెవడు ?

బృహస్పతియే చార్వాకదర్శనమునకు మూలపురుషుడు.

80) జైనదర్శనమునకు మూలపురుషుడెవడు ? ఈ మతమునకుగల మఱియొక నామమేది ?

జినుడను మహాపురుషుడు జైన దర్శనమునకు మూలపురుషుడు ఈ మతమునకే అర్హతమతమని పేరు.

81) జైనాచార్యు లెందరు ? వారిలో వర్థమానుని గూర్చి తెలుపుము.
ఇరువదియిద్దఱు జైనాచార్యులు గతించినపిమ్మట పార్శ్వనాథుడు, ఆ తరువాత వర్ధమానుడు జైనాచార్యులయిరి. వర్ధమానుడు, వైశాలీరాజకుమారుడు.

82) జైనమతము నందలి కొందరు ప్రామాణికులను తెలుపుము.
వర్ధమానుడు, ఉమాసాత్వికాచార్యుడు, హేమచంద్రసూరి.

83) బౌద్ధ దర్శన స్థాపకుదెవడు ?
బుద్ధ భగవానుడే బౌద్ధ దర్శనము స్థాపించెను.

84) బౌద్ధులలోని ప్రధాన భేదములనుపన్యసించునది.
వైభాషికులు, సౌత్రాంతికులు. యోగాచారులు, మాధ్యమికులు అని బౌద్ధులు ప్రధానముగా నాలుగు రకములుగనుందురు. మఱల హీనయానము, మహాయానమని బౌద్ధులలో రెండుశాఖలుగలవు. వైభాషికులు హీన సంప్రదాయమును, మిగిలినవారు మహాయాన సంప్రదాయమును పాటింతురు.

85) బౌద్ధమతమునందలి రత్నములెవ్వి ?
శ్రామము, సమాధి, ప్రజ్ఞ అని బౌద్ధమతమునందు మూడు రత్నములు గలవు.

## వైదిక దర్శనములు (ఉపాంగములు)

# న్యాయ దర్శనము

86) న్యాయశాస్త్రమునకు మూలపురుషుడు. అతని రచననుగూర్చి తెలుపుము.

గౌతమమహర్షి న్యాయశాస్త్రమునకు మూలపురుషుడు. ఈతడు న్యాయసూత్రములను రచించెను. ఇందు 528 సూత్రములు గలవు.

87) న్యాయశాస్త్రమునందలి విషయమును, కొందఱు ప్రసిద్ధులను పేర్కొనుము.

న్యాయశాస్త్రమునందు వాదవిషయములు, భౌతిక పదార్థజ్ఞానముండును. దీనికే తర్కశాస్త్రమని పేరు. ఉద్యోతకరుడు, విశ్వనాథభట్టు, ఉదయనుడు, జగదీశుడు మొదలైనవారు ప్రసిద్ధులు. భాష్యకర్త వాత్స్యాయనమహర్షి.

## వైశేషిక దర్శనము

88) వైశేషిక దర్శనమునకు మూలపురుషుడెవ్వడు ? అతని గొప్పదనమేట్టిది ?

కణాదుడను మహర్షి వైశేషిక దర్శనమునకు మూలపురుషుడు. భౌతిక విజ్ఞానమున పరమాణువును కనిపెట్టిన ఋషి ఋతడే.

89) ఈ దర్శనమునందు భాష్యకర్త ఎవరు ? ప్రసిద్ధులను కొందరిని పేర్కొనుము.

ప్రశస్తపాదుడు వైశేషిక భాష్య రచయిత. వ్యోమ శివాచార్యుడు, శ్రీధరుడు శ్రీవత్సుడు మొదలైనవారు ప్రసిద్ధులు.

## సాంఖ్య దర్శనము

90) సాంఖ్యదర్శ ప్రవక్తయెవరు ? అతని గ్రంథమున సూత్రములెన్ని ?

కపిలమహర్షి సాంఖ్యదర్శనప్రవక్త. కపిల సూత్రమనెడి యీతని గ్రంథమున 520 సూత్రములుగలవు.

91) ఈ దర్శనమందు ప్రసిద్ధరచనలేవి ?
ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికలు, గౌడపాద విజ్ఞాన భిక్షువుల భాష్యములు తత్త్వకౌముది.

## యోగదర్శనము

92) యోగదర్శనమూలకర్త గుఱించి ప్రసంగింపుము.
పతంజలియను ముని యోగదర్శనము నందు సూత్రములను రచించెను. అదియే మొదటి గ్రంథము. హిరణ్యగర్భుడే సృష్ట్యాది యందు యోగదర్శనమునకు మూలపురుషుడు.

93) యోగదర్శనమున ప్రమాణ గంథములేవి ?
భోజరాజుని భాష్యము, అనంతాచార్యుని చంద్రిక. ఆత్మారామ యోగి వ్రాసిన హఠయోగప్రదీపిక ముఖ్యములు.

## పూర్వమీమాంస లేక కర్మమీమాంస

94) పూర్వమీమాంసా శాస్త్రమునకు మూలభూతుడైన ఋషి యెవరు ? ఆ గ్రంధ మెట్టిది ?
జైమిని మహర్షి పూర్వమీమాంసా శాస్త్రమునకు మూలపురుషుడు పంద్రెండు అధ్యాయములతో పూర్వమీమాంసా శాస్త్రమును నిర్మించెను. ఇది కర్మకాండను బోధించును.

95) మీమాంసా శాస్త్రమందలి ప్రధానమైన ప్రమాణ గ్రంధములేవి ?
కుమారిలభట్టు వ్రాసిన తంత్రవార్తికము, శబరస్వామి వ్రాసిన భాష్యము గొప్ప ప్రామాణిక గ్రంధములు.

## వేదాంత దర్శనము

96) ఉత్తరమీమాంసా చరిత్రమును క్లుప్తముగా తెలుపుము.
బాదరాయణుని (వ్యాసుడు) బ్రహ్మసూత్రము లీ దర్శనమునకు మూలము. ఉపవర్షుడు వృత్తి గ్రంధమును రచించెను. జగద్గురు శంకర భగవత్పాదాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు మొదలైన వారెందరో బ్రహ్మసూత్రభాష్యములను రచించిరి.

97) ప్రస్థానత్రయమును, ముఖ్య సంప్రదాయములను తెలుపుము.
బ్రహ్మసూత్రమును, భగవద్గీత, ఉపనిషత్తులను ప్రస్థానత్రయ మందురు. అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము, నింబార్క సంప్రదాయము, వల్లభమతము, చైతన్య సంప్రదాయము, శక్తి సంప్రదాయము మొదలైనవి ముఖ్యములు.

98) భారతీయ వాఙ్మయమునందలి యితరమతములేవి ?
వీరశైవము, శైవము, వీరవైష్ణవము, రసేశ్వరమతము, పాశుపతము ప్రత్యభిజ్ఞామతము మొదలైనవి ముఖ్యమతములు.

## ఉపవేదములు

99) ఉపవేదములెన్ని ? అవియేవి ?

ఉపవేదములు నాలుగు. అవి 1. ఆయుర్వేదము 2. ధనుర్వేదము 3. శిల్పవేదము 4 గాంధర్వవేదము.

100) భారతీయుల యితర శాస్త్రములెవ్వి ? వాని మూలపురుషులెవరు?

అర్ధశాస్త్రము - దీనికి కౌటిల్యుడు ( చాణక్యుడు ) మూలము. 2. నాట్యశాస్త్రము దీనికి భరతమహర్షి మూలము. 3. కామశాస్త్రము - వాత్స్యాయనముని మూలము. 4. సాహిత్యశాస్త్రము - భరతమునియే మూలము. వాస్తుశాస్త్రాదులు జ్యోతిశ్శాస్త్రమునందు చేరును 5. సంగీతశాస్త్రము - నారదాదులు మూలము.

101) భారతీయ వాఙ్మయమున కళలెన్ని ?

భారతీయ వాఙ్మయమున 64 కళలు గలవు.

102) ఉపకళలెన్ని ?

భారతీయుల ఉపకళలు 108 గలవు.

103) పురాణము లెన్ని ? అవియేవి ?

పురాణములు పదునెనిమిది. అవి ఈ క్రింది విధముగానున్నవి. 1. మత్స్య పురాణము 2. మార్కండేయ పురాణము 3. భాగవతము 4. భవిష్య పురాణము 5. బ్రహ్మాండ పురాణము 6. బ్రహ్మవైవర్త పురాణము 7) బ్రహ్మ పురాణము 8. వరాహ పురాణము 9) వామన పురాణము 10) విష్ణుపురాణము 11. వాయు పురాణము 12. అగ్ని పురాణము 13. నారసింహ పురాణము 14. పద్మ పురాణము 15. లింగ పురాణము 16. గరుడ పురాణము 17. కూర్మ పురాణము 18. స్కాంద పురాణము.

104) ఉప పురాణములెన్ని ?

ఉప పురాణములు పదునెనిమిది మాత్రమేగాక ముప్పదినాల్గు వఱకు కన్పట్టుచున్నవి.

105) భారతీయ వాఙ్మయమున్గైన యితిహాసము లేవి ? వానిని రచించిన ఋషుల మాహాత్మ్యమును క్లుప్తముగా తెలుపునది.

శ్రీమద్రామాయణము, శ్రీమన్మహాభారతము ప్రసిద్ధమైన యితిహాసములు, శ్రీ మద్రామాయణకర్త వాల్మీకి, మహాభారతకర్త వ్యాసుడు. వాల్మీకి యాదికవి. వ్యాసుడు వేదములను విభజించి, పురాణములను విడగొట్టి కూర్చిన ఘనుడు.

106) సంస్కృత భాషయెట్టిది? అందు ప్రసిద్ధ కవులను కొందరిని తెలుపుము.

సంస్కృత భాష దేవభాష. కాళిదాసు, భాసుడు, భట్టబాణుడు, మురారి, మయూరుడు, భవభూతి, శ్రీహర్షుడు, మాఘుడు, భారవి, పాపయారాధ్యులు అనువారు కొందఱు ప్రసిద్ధకవులు.

107) శ్రీ పాపయారాధ్యులవారినిగూర్చి సంక్షిప్తముగా పరిచయము చేయుము.

శ్రీ ములుగు పాపయారాధ్యులవారి పూర్వులు వరంగల్లు సమీపము నందలి ములుగు గ్రామము నుండి అమరావతికి విచ్చేసిరి. శ్రీ పాపయారాధ్యులవారు శ్రీ రాజా వాసిరెడ్డి, వెంకటాద్రి నాయుడు వంశ్యులకు కులగురువుగా, ఆస్థానపండితులుగనుండి వజ్రమణి బిరుదమును పొందుటయేగాక సంస్కృతాంధ్రముల యందు శతాధికగ్రంథములను రచించిరి, పంచకావ్యములకంటె

ప్రౌఢమైన కల్యాణచంపూ కావ్యమే పాపయారాధ్యులవారి శక్తికి నిదర్శనము. వీరి స్తవమును విని శ్రీ జగదంబ ప్రత్యక్షమై మోక్షము నొసగినది.

108) శ్రీ పాపయారాధ్యులవారిపేర వెలసిన సంస్థలు వాని కార్యక్రమములను వివరింపుసది.

అమరావతిలో శ్రీ పాపయారాధ్య సాహితీ కేంద్రమును శ్రీశ్రీశ్రీ త్రిపురానందనాథులు స్థాపించిరి పాపయారాధ్యుల వారి సంస్కృతాంధ్ర గ్రంథములను ముద్రించుట. సాహితీ కార్యక్రమములను నిర్వహించుట వారి యాశయములు. శ్రీ పాపయారాధ్యులవారి పేరనొక సాహితీ పత్రికనుగూడ నిర్వహించిరి

పొన్నూరులో శ్రీ పాపయారాధ్య ధర్మ సంవర్ధనీ పరిషత్ అమరావతిలోని సంస్థకు అనుబంధ సంస్థ. శ్రీ నిష్టల సుబ్రహ్మణ్యం స్థాపించిరి. వేదపరిచయము. షడంగపరిచయము పూజాకార్యములు, శంకర విజయ పురాణప్రవచనము. సంస్కృత పరీక్షలకు విద్యార్థులకు శిక్షణనిచ్చుట. ఈ సంస్థ నిర్వహించిన కార్యక్రమములు "శ్రీ మహాశక్తి పూజా విధానము", భారతీయ సంస్కృతి - 1" అనునవి ఈ సంస్థ వెలువరించిన పుస్తకములు.

— o —

# భారతీయ సంస్కృతీ మహత్త్వము

1) భారతీయ యోగమునందలి ప్రాణాయామము ఆధునికులచే రోగ నివారణకై ఎట్లుపయోగింపబడుచున్నదో తెలుపుము.

చైనాలోని షెన్‌యాంగ్ నగరంలో రోగులచే ప్రాణాయామం చేయించి చికిత్స చేస్తున్నారు. సుమారు 2000 సం॥ నుండి ఈ చికిత్స సాగుతుంది. రక్తపోటు. గుండెజబ్బు మొదలగు అన్ని రోగములకు80 శాతం సత్ఫలితాలు లభిస్తున్నాయి.

2) భారతీయ సంస్కృతి అన్ని దేశములయందు వ్యాపించినదని నిరూపించుము.

చైనాలోని తుర్కిస్తాన్‌లో గణేశ విగ్రహం దొరికింది. తాష్కెంట్‌లో గణపతి విగ్రహం. మెక్సికోలోని ప్రాచీన శిధిలాలయాలు. ఈ ఆలయాలలో గల విష్ణు, ఇంద్ర, గణపతి ఆంజనేయుల విగ్రహాలు కంబోడియాలోని పరంచినం అనే చోట ఇంకా జావా, సుమిత్రా, బోర్నియోలలోని శిధిలాలయాలు భారతీయ సంస్కృతి ప్రపంచం అంతా వ్యాపించిందని తెలియజేస్తున్నాయి.

3) 'ఆత్మ' గలదని ఆధునికు లెట్లు నిరూపించిరి?

ఆత్మ ఉన్నదని అది కంటికి కనుపించని శక్తితో నిర్మింపబడి యుండునని జోసెఫ్‌క్లరీయన్ అనే రష్యను సైంటిష్టు ఫొటోగ్రఫీ వలన నిరూపించెను. యోగులు తెలిపిన సూక్ష్మ శరీరాన్ని ప్లాస్మా అని పిలచి, ఇది ఆధ్యాత్మిక తరంగాలతో నిర్మింపబడి

యుంటుందని, రోగ చిహ్నాలను దీనిలో చూడవచ్చునని నిరూపించెను.

4) భూమి తిరుగుచున్నదను విషయము భారతీయ వాఙ్మయము నందు గలదా ?

కలదు. సూర్యునకు ఉదయించుట, అస్తమించుట అనునవి లేవని, భూమి తిరుగుచుండుటచే ఉదయాస్తమయములు ఏర్పడుచున్నవని ఐతరేయ బ్రాహ్మణంలోను, దేవీభాగవతంలోను వుంది.

5) భారతీయులు పండుగలయందు సముద్రస్నానములు చేయుదురు అది సమంజసమా ?

సముద్రపునీటిలో అయోడిన్ గలదు. అది శరీరమున కవసరము కావున సముద్రస్నానము చేయుటమంచిదే.

6) పరమాత్మ (భగవంతుడు) ను గూర్చి తెలుపుము.

అనంత ప్రపంచములు పరమాత్మయందే యున్నవి. ఆ పరమాత్మ వేయి సూర్యులకాంతితో ప్రకాశించుచుండును. దాని శక్తి అనంతము. అటంబాంబును కనిపెట్టిన రాబర్టు హోపెన్‌హీమర్ అను సైంటిష్టు 1945- 7- 16 నాడు Alamogordo our base లో భగవద్గీతయందలి శ్లోకమును తెలిపి అనంత విశ్వములను నడిపే పరమాత్మశక్తి గలదని యభిప్రాయపడెను

7) కలియుగమెప్పుడు ప్రారంభమైనదో తెలుపుము.

క్రీ. పూ మూడువేల నూటరెండు ( 3102 ) సంవత్సరముల రెండు ( 2 ) నెలల 20 రోజుల 2 గంటల 27 నిముషముల 30 సెకండ్లకు కలియుగ మారంభమైనదని గణితముద్వారా తెలిపిరి. ఈ లెక్కలను ఫ్రెంచి దేశమందలి ఖగోళ శాస్త్ర వేత్త అయిన 'లాకేలీ' ప్రశంసించెను.

8) ఈ ప్రపంచమేర్పడి ఎంతకాలమైనదో తెలుపుము.

ఏల్ పట్టణమందలి 'ఆలోయిస్ కోవరెక్' అను శాస్త్రవేత్త ప్రపంచసృష్టి జరిగి 195 మిలియనుల సంవత్సరములు అయిన వనెను. ఆటమిక్ సైన్సు ప్రకారము 200 కోట్ల సంవత్సరముల క్రిందట సృష్టి జరిగినది. ఎన్‌సైక్లోపేడియా ఆఫ్ బ్రిటానికా (Encyclopedia of Britanica) యందు భూమి వయస్సు 200 మిలియన్లని గలదు. భారతీయులు గణితము వలన 195 కోట్ల 58 లక్షల, 85 వేల సంవత్సరముల క్రిందట సృష్టి జరిగినదని తెలిపిరి.

9) వ్యాస వాల్మీకుల సందేశమేమి?

వాల్మీకి, వ్యాసుడు గొప్ప ఋషులు. ఉదారచరితానాం తు వసుధైక కుటుంబకమ్' అని వారి సందేశము. ప్రపంచ మందలి మానవులందరినీ ప్రేమింపవలయునని, ప్రపంచ శాంతికై పాటుబడవలయునని ప్రపంచమందలి మానవులందరు ఒకే కుటుంబమందలి సభ్యులని, బంధువులని బోధించిరి.

# మీరూ సంస్కృతం నేర్చుకోండి - 1

## సంస్కృతభాషా ప్రాశస్త్యము

## సంస్కృతం అంటే ఏమిటి ?

భారతీయ భాషలన్నింటినో సుసంపన్నముగా నొనర్చినదీభాష. దీనికే గైర్వాణియని మరియొకపేరు. గీర్వాణులనగా దేవతలు. వారి భాష గావున నిది గైర్వాణి అయినది. ఎవరిమాట అమోఘముగా వని చేయునో వారు దేవతలు. వారిభాష గావుననే ఇది దేవభాష. ఇట్టి ఘనత ప్రపంచమందలి భాషలలో సంస్కృతమునకు దక్కినది. సంస్కృతము దేవవాక్కుయని ఋషులు చెప్పిరి. భారతదేశమునకు సంస్కృత భాష, సంస్కృతి ప్రతిష్ఠను ఆపాదించుచున్నవని తెలియుచున్నది

సంస్కృతభాషను సంస్కరింపబడిన భాషయని యందురు అనగా ఇండోజర్మానిక్ భాషనుండి విడివడిన భాష మూలప్రాకృత మనియు అది సంస్కరింపబడి సంస్కృతమైనదనియు కొందరందురు. ఇట్టి సంస్కృతము నుండియే స్త్రీలకు సులభముగ నుండు శౌరసేని, పైశాచి, మాగధి మొదలగు ప్రాకృత భాషలేర్పడినవి. కందువ ప్రాకృతము సంస్కృతమునకు మూలమనుట పొసగదని సంస్కృతమే ప్రథమ గ్రంథమగు ఋగ్వేదమున గోచరించుచున్నదని చెప్పుదురు. సంస్కృతము పలుకుట కశక్యమై అపభ్రంశమై ప్రాకృతమైనదని వాక్యపదీయము చెప్పుచున్నది. భరతముని గూడ నిట్లే చెప్పెను.

సంస్కృత భాషలో వేదాలు, పదునెనిమిది పురాణాలు శాస్త్రములు, వేదాంగాలు దర్శనములు, కావ్యములు, నాటకములు మొదలగు

అనేక విషయముల గ్రంథములెన్నియో గలవు. ప్రపంచమందలి మొట్టమొదటి గ్రంథములు వేదములు అవి సంస్కృతభాషలోనే ఉన్నాయి.

సంస్కృత భాషలో ఒక పదమునకు వచ్చు అర్థము వేరొక పదముచే చెప్పుట కవకాశములేదు. ఏ పదము అర్థము ఆ పదమందే. ఇట్టి అర్థభేదములను పాటింపకయే ప్రతి పదార్థమును చెప్పుచుందుము సంస్కృతమునందలి పదములకు ఇతర భాషలలో అర్థమును వివరించుకొనవలయును. అంతేగాని ఆ భాషతో పదాల్ని చెబితే ఈ అర్థం రాదు. ఉదాహరణకు పత్నీ అన్నాం అనుకుందాం. దీని అర్థాన్ని ఆంగ్లంలోగాని, తెలుగులోగాని వివరించుకోవచ్చు. పురుషుడు చేసే ధార్మిక కార్యక్రమాలలో తనవంతు నెరవేరుస్తూ సాఫల్యాన్ని కూర్చే జీవితభాగస్వామిని అని అర్థం ఈఅర్థం వివరిస్తే వస్తుంది కాని Wife Better half పెండ్లాము, ఆలు అంటే రాదుకదా, ఇది విశేషము,

ఇతర భాషల్లో చిన్న చిన్న భేదాలతో ఎన్ని పదాలు సుమారు ఒకే అర్థంలో ప్రయోగింపబడుతాయో అన్ని రకాల పదాలు సంస్కృతంలో ఉన్నాయి, ఉదాహరణకు లోభి అనే సుమారు అర్థంలో Peevish అంటారు, దీనికి పిశునః Miser అంటే కృపణః అనవచ్చు Avaracious అంటే గృధ్నుః, అంటారు, Niggardly fellow అంటే మితంపచః అంటారు, ఇలా ఇతర భాషలతో సరితూగే పద జాలం వుంది, అంతేగాక ఏ భాషలో పదాలకైనా అంతువుంటుంది. ప్రతి భాషకి ఇన్ని పదాలని భాషావేత్తలు లెక్కగట్టియుంచారు. కాని సంస్కృతానికి ఎవరూ లెక్కగట్టలేదు, ఇందుకే యిది దేవభాష,

Physics. Chemistry మొదలగు విషయాలను ఆంగ్లంలో నుండి తెలుగు మొదలగు దేశభాషలలోకి అనువదించేటప్పుడు తప్పని సరిగా సంస్కృత పదాలను వాడాలి, అవి లేకుండా అనువాదం జరుగదు. ఉదాహరణకు సజలసల్ఫ్యూరి కామ్లము, హిమీకరణ మిశ్రమము మొదలైనవి తీసుకొనవచ్చు. టెలివిజన్. మొదలైన సాధనాల లోని భాగాలకు గూడా పారిభాషిక పదాలను కూర్చుకొనే శక్తి యీ భాషకుంది.

## సంస్కృతం చరిత్ర ఏమిటి ?

క్రీస్తుశకం 1వ శతాబ్దంలో బర్మాదేశంలో సంస్కృతం ప్రచారంలో ఉంది. అనే విషయం సంస్కృత గ్రంథసూచిక వలన తెలుస్తూంది. సంస్కృతం ప్రచారంలో ఉండబట్టే శాసనాలు ఈ భాషలో వ్రాయబడినవి. నాల్గవ శతాబ్దంనాటి సంస్కృతశాసనం పెజాబన్ వద్ద గల మంగ్‌సిటీప్ వద్ద దొరికింది. ఆక్స్‌ఫర్డ్‌వారు వెలువరించిన నిఘంటువు ఇండోయూరోపియన్ భాషలలో సంస్కృతం బాగా ప్రాచీనమైందని చెబుతూంది. క్రీ॥ పూ॥ 700 లకు ముందు సంస్కృతంలోనే అన్ని వ్యవహారాలు జరిగాయి. చంపా నగరంవద్ద జరిగిన త్రవ్వకాలలో గూడ అనాటి వ్యవహారభాష అయిన సంస్కృతంలోని వంద శాసనాలు బయటపడ్డాయి. అశోకుని కాలం వరకు గూడా సంస్కృతంలో కొన్ని పదాలులేవు. కొన్ని పదాలుమారి పాళీభాషపై వాడుకభాష అయినది.

క్రీ. శ. 1, 2 శతాబ్దాలలో సంస్కృతమే రాజభాష. గుప్తుల కాలం నుండి 300 సంవత్సరాలవరకు సంస్కృతమే వ్యవహారభాష. ఇది వ్యవహారంలో ఉన్నదని మాక్సుముల్లర్. గజనీమహమ్మద్‌తో ఇండియాకు వచ్చిన ప్రఖ్యాత ఖగోళ శాస్త్రజ్ఞుడైన ఆల్ బెరూని ఇండియాలో సంస్కృతంలో వ్యవహారాలు సాగేవని సాక్ష్యం ఇస్తున్నారు. కాశ్మీర్ నుండి సంస్కృతం, భూటాన్, చైనా మొదలగు ప్రాంతాలకు వ్యాపించినదని రాజతరంగిణీగ్రంథం చెబుతూంది. చీనా యాత్రికుడైన ఇత్సింగ్ కూడా ఈ విషయాన్ని అంగీకరించెను. శివాజీ కాలంలో సంస్కృతవ్యవహారాలకై రాజ్య వ్యవహారకోశాన్ని రఘునాధుడు రచించెను.

మొగలు చక్రవర్తులుగూడ సంస్కృతాన్ని ఆదరించి పెంపొందించారు. సంస్కృత శ్లోకాలలోనే వారి చరిత్రలు వ్రాయించుకున్నారు. షాజహానుకు సంస్కృతంతెలుసు. అందుకే పండితరాజ బిరుదాన్నిచ్చి జగన్నాథుడిని సత్కరించారు. రవీంద్రనాథటాగూరు సంస్కృతంలోని శాకుంతలాది గ్రంథాలచే ప్రభావితుడై రచనలుచేసి నోబెల్ బహుమతిని పొందగలిగాడు. సంస్కృతంలోని చారిత్రక గ్రంథాలవలననే ఆనాటి రాజకీయస్థితులు తెలుస్తున్నాయి.

క్రీ. శ. 1976 వ సంవత్సరంలో Sir William Jones అను పండితుడు సంస్కృత భాషా సౌందర్యంచూచి లాటిను. గ్రీకుభాషలకంటె సంస్కృతంలోనే గొప్ప సౌందర్యం ఉందని చెప్పాడు. భాషా శాస్త్ర పండితులైన Burrow, Tucker, Von Schalegal, Max Muller మొదలైన ఎందరో ఇతర దేశస్థులు సంస్కృతంలో చాలా గొప్ప కృషి చేశారు.

క్రీ. పూ. 6 వ శతాబ్దంలోని యాస్కముని నిరుక్తమనే గ్రంథాన్ని రచించాడు. ఇతడు సంస్కృతంలోని ఒక్కొక్క పదాన్ని ఒక్కొక్క ప్రాంతంలో ఎలా వాడుతున్నారో వివరించాడు. ఈ సాక్ష్యంవలనగూడా సంస్కృతం వ్యవహారంలో ఉన్నట్లు తెలుస్తూంది. పాణినిముని తన వ్యాకరణంలో దూరంగా ఉండేవారిని పిలిచేటప్పుడు ప్లుతస్వరం పలకాలని చెబుతున్నాడు. సంస్కృతం వ్యవహారభాషే అనడానికి యిదికూడా కారణమే. దండాదండి (కర్రలతో తన్నుకొంటూన్నారు.) ఉదరపూరం భుంక్తే (పొట్టనిండా తింటున్నాడు.) మొదలైన వన్నీ వ్యవహారాన్ని సూచిస్తున్నాయి.

పాణిని తరువాత వచ్చిన వరరుచి, పతంజలి గైర్వాణిలో లోకంలో వాడబడే క్రొత్త పదాలనుగూడా చేర్చుకుంటూ, సాధిస్తూ వచ్చారు. ఇందువలన భాష పెరుగుతూ వస్తూందని తెలుస్తుంది. భగవంతుడైన పతంజలిముని ఒకానొక పండితునికి, పండితులేవానికి గూడా గైర్వాణి అర్థమవుతూ ఉండేదని తెలుస్తూంది. భోజరాజు, విక్రమాదిత్యుల కాలంలో గైర్వాణి తెలుగులాగా సాగింది.

తెలుగు మళయాళం మొదలైన భాషల్లో మాండలిక భేదాలున్నాయి. శ్రీకాకుళం, విశాఖజిల్లాలలో మేడి అని పిలువబడేది. రాయలసీమలో మేడితోకయని, తెలంగాణాలో పాలెయని ఇతర కోస్తాలలో మేడియని పిలువబడుతూంది. ఇలాగే ఆనపకాయ, అనింగెకాయ సొరకాయల భేదాలు. ఇలాంటి మాండలిక భేదాలు గైర్వాణిలోలేవు. ఎవరు మాట్లాడినా ఒకేభాష అవడంవలన అందరికీ అర్థమవుతుంది.

# సంస్కృతం అందరికీ వస్తుందా ?

కొంతమంది ఇలా ప్రశ్నించవచ్చు నిరాక్షేపంగా ఎవరికైనా జాతి మత కుల వివాదాలకు దూరంగా నేర్చుకుంటే సులభంగానే వస్తుంది, అక్బర్, షాజహాన్ ఇంకా అనేకమంది ముస్లిములకు గైర్వాణి తెలుసు. గైర్వాణిలో పండితులై గ్రంధాలను రచించిన ముస్లిములు ఎందరో ఉన్నారు. అన్ని దేశాల్లోను గైర్వాణి తెలిసిన వారున్నారు.

ఔరంగాజేబు తరువాత వచ్చిన అబ్దుల్లాచరితమ్ అనే కావ్యాన్ని లక్ష్మీపతియనే కవి వ్రాసాడు. అక్బర్, శ్రీహరి యనే విద్వాంసుడిని ఆస్థానంలో నియమించుకున్నాడు. జగన్నాధుడు ఆసఫ్‌ఖాన్‌ను వర్ణించాడు. మణుహ, తంబీర, ఆపోక్లిసు మొదలైన అన్యభాషాపదాలు గైర్వాణిలోకి చేరడంవలన గైర్వాణి రచయితలకు, ఇతర భాషా వేత్తలకు గల సన్నిహిత సంబంధం అవగతమవుతూంది ముస్లిములు క్రిష్టియన్లు, హిందువులు అందరికి ఈ భాష వస్తుంది. ఇది నా భాష యని ప్రతి వ్యక్తి చెప్పుకోవాలనేది నా కోరిక.

# సంస్కృతం స్త్రీలకు వస్తుందా ?

ఇది చాలా సామాన్యమైన ప్రశ్న. వేదకాలంలో గార్గి, మైత్రేయి మొ॥ స్త్రీ ఋషులు గలరు. గంగాదేవి అనే కవయిత్రి మధురావిజయం అనే గొప్పకావ్యాన్ని వ్రాసింది. దీనికి మా గురుదేవులైన బ్రహ్మశ్రీ పోతూకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గొప్ప వ్యాఖ్యానాన్ని వ్రాసారు.

ఇంకా విజ్జిక, సుభద్ర, ఫల్గుహస్తిని, రామభద్రాంబ, మోరికా ఇందులేఖా, మారులా, వికట నితంబా, లఖిమా, వైజయన్తి, త్రివేణి, క్షమ మొదలైన ఎందరో స్త్రీ కవయిత్రులు మధురమనోజ్ఞంగా సూక్తులు, కావ్యాలు, వ్రాసారు. ఈ రోజున గైర్వాణి తెలిసిన అనేక మంది స్త్రీలు భాషా వేత్తలుగాను, రచయిత్రులుగా గోచరిస్తున్నారు.

# ఇతర భాషలకు, సంస్కృతానికిగల తేడా ఏమిటి?

గైర్వాణిలో సుమారు 2000 ధాతువులున్నాయి. ధాతువులకంటె క్రియలు (Verbs) గైర్వాణిలో ప్రతి పదానికి వ్యుత్పత్త్యర్థం ఉండడం గొప్ప విశేషం. పృధివీ అంటే పరమాణువుల ఘర్షణతో ఘనీభవించినది అని అర్థం. వృక్షః చేధింపబడేది అని అర్థం, ఇలా ప్రతిచోట వ్యుత్పత్త్యర్థం (Etymological sense) గోచరిస్తుంది. సంస్కృతంలో వాల్మీకి, వ్యాస, కాళిదాసాది మహాకవులు అంత ర్జాతీయ ఖ్యాతి నార్జించారు. సంస్కృతంలోని పాణిని వ్యాకరణం సుమారు 5,000 సూత్రాలతో వ్రాయబడింది. ఇంత పెద్ద వ్యాకరణం ఏ భాషకీ లేదేమో ?

# సంస్కృతంలో అన్ని విషయాలుఉన్నాయా ?

సంస్కృతంలో ప్రపంచ విజ్ఞానాన్నందించే వేదాలున్నాయి. అనేక విషయాలను తెలిపే పురాణాలు 18 ఉన్నాయి. ఇలాగే ఇంకా అనేక ఉప పురాణాలున్నాయి, కథాసరిత్సాగరం, బృహత్కథ, పంచ

తంత్రం మొదలైన కథలనేకాలున్నాయి. రసానందాన్నందించే మధుర కావ్యాలున్నాయి, వినోదాన్నిచ్చే శాకుంతల, ఉత్తర రామచరితాది నాటకాలున్నాయి ఏకాంకికలున్నాయి. ఏకపాత్రాభినయాలున్నాయి. చారిత్రక గ్రంథాలున్నాయి. కల్హణుని రాజతరంగిణి కాశ్మీరరాజుల చరిత్రలను వివరిస్తుంది. చరక, సుశ్రుత, వైద్యావతంసం మొదలగు అనేక గ్రంథాలు వైద్యవిషయాలను తెలియజేస్తున్నాయి. వీటిలో వివిధ రోగాలను తగ్గించే ఎన్నో మందుల తయారీలు చెప్పబడ్డాయి బృహజ్జాతకం, పారశరసంహిత, మొ॥ గ్రంథాలు జ్యోతిశ్శాస్త్రాన్ని బోధిస్తున్నాయి. ఆర్యభటీయం, స్ఫుటసిద్ధాంతం, లీలావతి గ్రంథాలు గణితాన్ని (Algebra) తెలియజేస్తున్నాయి. బృహత్సంహిత, మొదలను గ్రంథాలు భూగర్భ విషయాలను (Geology) తెలియజేస్తున్నాయి. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు మొ॥ గ్రంథాలు వేదాంత విషయాలను తెలుపుతాయి. ఆయుధాల తయారీలను రాజనీతిని (Politics) తెలిపే పుస్తకాలున్నాయి. భౌతిక క్రియా విషయాలను తెలిపే వైశేషికాదులు. రతి సర్వస్వాది కామశాస్త్ర గ్రంథాలు (Romance) పాకదర్పణాది పాకశాస్త్ర గ్రంథాలు (Cooking) వాస్తు గ్రంథాలు, వృక్షాలను పెంచే పద్ధతులు ఇలాంటివి ఎన్నెన్నో ఉన్నాయి.

సంస్కృతంలో కేవలం ఆధ్యాత్మిక విషయాలు మాత్రమే ఉంటాయనుకోవడం పొరపాటు.

— o —

# సంస్కృతంలో యితర విన్నూతన్న విషయాలున్నాయా ?

సంస్కృతంలో కేవలం పై విషయాలేగాక చిత్రలేఖనం, సంగీతం, నృత్యం, పొడుపుకథలు సరసోక్తులు మొదలైనవి గూడా ఎన్నో ఉన్నాయి. ఈ క్రింది శ్లోకంలో నిత్యజీవితంలో ఉపయోగపడే విషయాలెలా చెప్పబడ్డాయో చూడండి -

"ఘృతం తైలేన తచ్చోష్ణజలైరుద్గేన కజ్జలమ్
వాసయే దంబరస్థం తు మలం క్షారేణ సోష్మణా"

నేతి మరకలను నూనెతోను, నూనెమరకలను వేడినీళ్ళతోను, కాటుక మరకలను పాలతోను. ముఱికిని ఉప్పునీటితోను పోగొట్టాలి. బట్టలపై మరకలను తొలగించే పద్ధతి యిందులో చూపబడింది.

ఇంకా తాంబూలం తయారుచేసే పద్ధతి, కోళ్ళ పందెములు, సమస్యలు, ఛలోక్తులు ఇంకా ఎన్నెన్నో !

# సంస్కృతంలోని పాటలు

సంస్కృతంలో అనాది నుండి సంగీత బద్ధమైన పాటలెన్నో కానవస్తున్నాయి. జయదేవుని అష్టపదులు, కాళిదాసుని గీతాలు, అన్నమాచార్య, త్యాగరాజ శ్యామాశాస్త్రిల గీతాలేగాక అధునాతనంగా గూడా గేయాలు వస్తున్నాయి. అవి సంస్కృతం పాటలని చెబితేగాని తెలియనంతగా సంస్కృత గీతాలు తెలుగులో కలిసిపోయి ఆంధ్రుల అభిమానాన్ని చూఱగొన్నాయి.

# సంస్కృతంలోని ప్రౌఢత్వ పాండిత్యాలు

కవులు యమకాలు కోకొల్లలుగా వాడారు, పూర్వార్థంలాగా, ఉత్తరార్థం వ్రాయడం, నాలుగుపాదాలు ఒకలాగే వ్రాయడం, ఇంకా వెనుకనుంచి చదివినా శ్లోకం వచ్చే విధంగా వ్రాయడం, ఏకాక్షర, ద్వ్యక్షర శ్లోకాలు, రెండు మూడర్థాలు శ్లేషకావ్యాలు, ఐదురకాల శ్లేషలు నూరు అర్థాలొచ్చే శ్లేషలుకూడా ఉన్నాయి. నేను వ్రాసిన "శక్తినుతి" గ్రంథంలో రెండక్షరాల శ్లోకమును చూడవచ్చు. అనంతమైన ఈ సంస్కృతంలో జీవితాలు గడిపినా సంపాదించవలచిన పాండిత్య మిగులుతూనే ఉంటుంది ఎవరి ఓపికకొద్దీ వాళ్ళు పరుగెత్తవచ్చు. పాండిత్యం సంపాదించవచ్చు. సర్కస్‌ఫీట్లు చెయ్యవచ్చు. ఈ భాష గాంభీర్యానికిగాని. పదాలకుగాని పెన్నిధి.

# సంస్కృతాన్ని పెద్దలు ప్రసంసించారా?

ప్రశంసించారని ఖచ్చితంగా చెప్పవచ్చు. ప్రాచీనులందరూ మెచ్చుకొన్నారు. నవీనులలో డాక్టరు రాధాకృష్ణ, రాజేంద్రప్రసాద్, నెహ్రూ, గాంధి. టాగూర్. గేటే, వివేకానందుడు, వినోబాభావే, సర్ మీర్జా ఇస్మాయిల్. గోవిందమీనన్, అబూకలాం ఆజాద్. మొరార్జీ, నందా, గోపాలరెడ్డి, పట్టాభి, రాహుల్‌సాంకృత్యాయిన్, జయప్రకాశ్ నారాయణ, జైల్‌సింగ్, ఇందిరాగాంధీ, మొదలైన వారెందరో ప్రశం సించారు. సంస్కృత కమీషనువారి నివేదికలో దీన్ని రాజభాష చేయ డంతో గల ఔచిత్యం వివరింప బడింది. అవన్నీ ఇక్కడ కూర్చడం సాధ్యంగాదు.

# ప్రస్తుతం సంస్కృత పరిస్థితి ఎలావుంది ?

లండన్‌లోని ప్రతి హైస్కూలులోను సంస్కృతం తప్పనిసరిగా చదవాల్సిన పరిస్థితివుంది 900 మంది విద్యార్థులున్నారు. ఈ స్కూలు కెన్సింగ్టన్ సమీపంలో ఉంది ఖాట్మండులో సంస్కృతవిశ్వవిద్యాలయం పెట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. సంస్కృతంలో పిల్లల పత్రికయిన 'చందమామ' కూడా వస్తూంది. సుమారి 11 సంవత్సరాల నుండి సంస్కృతంలో వార్తలు రేడియోలలో వస్తున్నాయి. లండనులో వేదగణితం, కౌముదీ బోధింపబడుతున్నాయి. "శంకరాచార్య" అనే సినిమా పూర్తిగా సంస్కృతంలో తీయబడింది. బొంబాయిలో హౌస్‌ఫుల్ కలెక్షన్లతో నడచింది. జర్మనీ రేడియోలలో సంస్కృత కార్యక్రమాలెన్నో వస్తున్నాయి.

పపంచ సంస్కృత విద్వాంసుల సభలు TOPINO (Italy). Paris, Weimar (GDR), కాశీ నగరాలలో జరిగాయి. ఈ సంవత్సరము 20 దేశాల నుండి వచ్చిన 600 మంది ప్రతినిధులతో ఫిలాడెల్ఫియా (Philadelphia) దేశంలోని Pennsylvania పెన్సిల్వానియా విశ్వవిద్యాలయము లో జరిగింది కొద్దిరోజుల క్రితం సంస్కృతంలో షార్ట్‌హాండ్ పద్ధతికూడా విజయవంతంగా కనుగొనబడింది. సంస్కృతాక్షరాలతో కంప్యూటరు సిస్టంగూడా తయారవుతూంది. విశ్వసంస్కృత ప్రతిష్ఠానం, పాండిచ్చేరివారు అన్నిచోట్లా సంస్కృత సంభాషణా శిబిరాలకు నిర్వహిస్తున్నారు. ఢిల్లీలో సంస్కృత భవనాన్ని 50 లక్షలతో నిర్మించడానికి శంఖుస్థాపన జరిగింది.

బేసిక్ విధానంలో క్రియారహిత విధానం గొప్పది. సంస్కృతంలో ఙ, ద, ధి, వాహ మొ॥ ప్రత్యయాలు ఉపసర్గ విధానాలు భాషను సులభంగా మాట్లాడడానికి ఎంతగానో ఉపయోగపడుతాయి. బేసిక్ విధానం సంస్కృతంలో క్రొత్తగాదు. సంస్కృతంలోని ప్రతి పదానికి వ్యుత్పత్తి ఉండడంవలన "అర్థంలేని చదువు వ్యర్థం" అనేది ఈ భాషకే ఎక్కువగా అన్వయిస్తుంది.

ఈ భాషలో అమరకోశంవంటి నిఘంటువులు శ్లోకాలలో ఉండడంవలన పర్యాయపదాలు నోటికి త్వరగావస్తాయి. ఇవి ఈ భాషలోని వైశిష్ట్యం. ఈ భాషను నేనిలా కీర్తిస్తాను.

'రారాజతామియం వాణీ సంస్కృతాచ పురాతనీ
జ్ఞానం విజ్ఞాన మపినో దేయాత్ పద్మాసన ప్రియా.



# తొలిపలుకులు

భారతీయ సోదరులారా !

అనాదికాలంనుండి దేశవిదేశాలలోని సమస్తమానవాళికి ఆధ్యాత్మికాను భూ లను అందిస్తున్న పవిత్రభూమి యీ భారతదేశం. ఆ పరంధాముడు రామకృష్ణాద్యవ రములనెత్తి ఈ దేశాన్ని పవిత్రం చేసాడు. ఆ దేవునిచేరే అన్నిమార్గాలు భారతీయ సంస్కృతిలో నిక్షిప్తమై ఉన్నాయి. అందుకే యిది విశ్వసంస్కృతి.

ఈ భారతీయ సంస్కృతిని క్రమబద్ధంగా తెలియజేయాలనే సంకల్పం 'భారతీయ సంస్కృతి' అనే పేరుతో చిన్నపుస్తకం వెలువరించాను. ఇది మొద భాగం.

కొన్ని దశాబ్దాలక్రితం శ్రీ ఉమామహేశ్వర పండితులవారు దేశంలో ధ ప్రచారంచేస్తూ అనేక గ్రంథాలు రచించారు. వాటన్నింటినీ పరిశోధించి అందుకో విషయాలను, వాటిపై నాసమీక్షలను రచించాను. ఆ గ్రంథాలలో ప్రస్తుతా కొంచెం దూరంగా ఉండే విషయాలను విడచి సారాంశాలను, వాటిపై నా సమీక్ష కలిపి 'సంస్కృతి ప్రభాకరము' అనే గ్రంథాన్ని రచించాను రచయితలు కొన్ని విషయాలలో భేదించడం సహజం. రచయిత్రి ఏకంతో ఉన్నది. ఇదే భారతీ సంస్కృతి ప్రణాళికలో రెండవ భాగం.

వివిధ విషయాలపై ధ ప్రగతి, భారతి, రామకృష్ణప్రభ మొదలగు పత్రికలలో నా రచింపబడిన స్వతంత్ర వ్యాసాలను ఇందులో కూర్చడం జరిగింది. ఇది భారతీ సంస్కృతి మూడవభాగం. ఈ గ్రంథంలో రెండు, మూడు భాగాలున్నాయి.

ఇక ఈ గ్రంథాన్ని ముద్రించి పుస్తకరూపంలో అందరికీ అందించాల సంకల్పానికి నాందిపలికి ముద్రణా కార్యక్రమంలో తమవంతు సహకారాన్ని అందించి ఎంతో ప్రోత్సహించిన సహృదయులైన

1) శ్రీ మార్గవి వెంకట రామారావు (M.com)C.I గారికి—

2) శ్రీ బొడ్డు వెంకటరావు, (L. I. C. Development Offier BaPatla గారికి—

3) పావయారాధ్య ధర్మసంవర్ధనీ పరిషత్ సభ్యులకు

4) విరాళాల నొసగిన ధర్మాభిమానులకు—

5) మొదటినుండి పరిషత్తుకై కృషిచేస్తూ ప్రూఫ్‌రీడింగ్‌లో అత్యంత శ్రద్ధ వహించిన శ్రీ తుమ్మ్యారు లక్ష్మీనరసింహారావు M. A., Phd., గారికి—
(డైరెక్టరు, విద్వాన్ కాలేజి. గుంటూరు)

6) అందంగా సకాలంలో ముద్రించియిచ్చిన శ్రీ లక్ష్మీగణపతి ప్రెస్, సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి—

ఆ జగదంబ ఆయురారోగ్యైశ్వర్యాలను ప్రసాదించాలని కోరుతూ—

మీ

**రచయిత**

# సుమాంజలి

1) ఛాత్ర బృందములు విజ్ఞాన సౌధము నెక్క
నిశ్రేణిగా నీవు నిలచియుండి
సంస్కృతాంధ్రాలను చక్కగా బోధించు
పండితప్రవరులై ప్రతిభచూపి
జ్యోతిషవిద్యను ఖ్యాతిగా మథియించి
క్రాంతదర్శిగను సంక్రాంతి చిమ్మి
సన్యాసిశర్మ యశస్థాపన పతాక
ఈ స్వర్ణపురిలోన ఎగురవేసి
పాపయారాధ్య పరిషత్తు స్థాపకునిగ
అమరభాషను క్షేమతో నందరికిని
బోధచేసిన యట్టి ఓ సాధుమూర్తి
అందుకొనుడయ్య శతకోటి వందనాలు

2) దేశికవర్య మీ కవితతీరుల తెన్నుల విప్పిచెప్ప వా
గీశునకైన గాదనిన నెట్లగు నాకును శిష్యకోటికిన్
మీ శుభనామ కీర్తనము మేము కవీంద్ర సభాసలంబులన్
దేశపునాల్గుదిక్కులను తృప్తిగజేయ ననుగ్రహింపుడీ.

3) ఏ భట్టబాణుడో మీ భావనగ మారి
అందాల కావ్యాలనల్లుచుండె
ఏ కాళిదాసుడో మీ కలముగ మారి
ప్రౌఢ కవిత్వంబు పలుకుచుండె
ఏ ఋషివర్యుడో మీరుగా నిటనుండి
విద్యాతపస్సుచే వెలయుచుండె
ఏ దివ్యశక్తియో యెదలోన కొలువుండి
విజ్ఞానమూర్తిగా వెలుగుచుండె
అట్లుగాకున్న విద్యలోనంత దీప్తి
యెట్లువచ్చును జ్ఞానమ్ము నెట్టులబ్బు
దేశికోత్తమ సుకవీ ! సుధీనిధాన
ప్రణతులర్పింతు మీ కిదే భక్తితోడ

కోయి కోటేశ్వరరావు
M A (Tel)ph.D.

# 1. దేవతా తత్త్వము

"దైవరాజ్యము-సూర్యభగవాన్" అను గ్రంథములో మన పురాణములలో వర్ణింపబడిన తార, అహల్య, ద్రౌపది, తార, మండోదరి అనువారు మహాపతివ్రతలని చెప్పబడినది. కుంతీ సూర్యుల విషయంలో అపవిత్రత ఏమీలేదు. దేవతలు సూర్యమండలమునందుందురు.[1] రక్తమాంసాదులతో కూడిన శరీరములు దేవతలకుండవు. మనోమయ సూక్ష్మతత్త్వము నుండి దేవతలు జన్మింతురు.[2] మనువు నుంచి పుట్టినవారగుటచే మనము మానవులమైతిమి. జంతువులు మానవులశక్తిని గుర్తించలేనట్లే, మానవులు దేవతలశక్తిని గుర్తించలేరు. కామాగ్నిచే దేవతల శిశ్నము దహింపబడదు.[3] స్వర్గమందలి అప్సరసలకు, పురుషులకు కామముండదు. బ్రహ్మచర్యమును పాటించువారు దేవతలను సంతోషపెట్టెదరు.[4]

వసువులు వసన్తర్తు సంబంధము గలిగి రంగుగుడ్డలను ధరించెదరు. రుద్రులు గ్రీష్మ సంబంధం పొంది తెల్లని గుడ్డలు ధరింతురు. ద్వాదశాదిత్యులు వర్షధర్మము కలిగి చిత్రవర్ణవస్త్రముల ధరింతురు. ఋభువులు శరత్సంబంధంపొంది బంగారురంగుగుడ్డలను, మఱికొందరు హేమంతసంబంధము కలిగి కవచములను శిఖను ధరింతురు.[5]

సర్వదేవస్వరూపుడైన సూర్యుడు ప్రత్యక్షదైవము. కుంతి పుణ్యాత్మురాలు. అందుకే సూర్యుడు కనుపించినాడు. కేవలము వేదాధ్యయనముచేయక, షడంగములతో వేదమును నేర్చుకొనవలయును.

1. "దేవగృహావై నక్షత్రాణి" —యజు. 3 అష్టకము. 5 ప్రపాఠకము
2. "యేదేవామనోజాతాః" —వేదః
3. "అనస్థాఃపూతాః పవనేన శుద్ధాః శుచయః శుచిమపియన్తి లోకమ్
నైషాం శిశ్నం ప్రదహాతి జాతవేదాః స్వర్గేలోకే బహుస్త్రైణమేషామ్"
—అథర్వ
4. "గంధర్వాఏవమన్వాయన్ త్రయస్త్రింశత్త్రిశతా
షట్సహస్రాన్ దేవాన్ తపసాపిపర్తి" —అథర్వ
5. "అతితామ్రాణి వాసాంసి.... ... ...అసశ్చత" —వేదః

**రహస్యార్థములు :**

రాక్షసులు దుర్యోధనుడు మొ॥వారుగ జన్మించిరి.[6] దేవతలు పాండవుల
పుట్టిరి. ఇంద్రుడు పాండవులు. శచీదేవి ద్రౌపది. ద్రౌపదికి ఐదురు భర్తలన
దోషముగాదు. ఈ విషయం భాతరంలోని పంచేంద్రోపాఖ్యానంలో ఉంది. ఆ
యము మొ॥ నాలుగు మూలలయందు క్రిందిభాగమున నరకములు గలవు.

దేవతలైన పాండవుల శ్రేయస్సుకై కృష్ణుడు, దుర్యోధనాదుల పతనా
సూర్యుడు కర్ణుడుగను అవతరించిరి. దైవసంకల్పమునకే రేతస్సని పేరు. దే
లోకంపైన పితృలోకము, ఆపైన ఋషిమండలము గలవు. మనోఽధిష్ఠానదేవుడై
సూర్యుడు కుంతియందు మానసికశక్తిని ప్రసరింపజేసెను. సూర్యుడే కర్ణుడయ్యె

**సమీక్ష :**

పాంచభౌతికశరీరములు మానవులకేగాని దేవతలకుండదన్న పండిత
వాక్యము ప్రమాణసిద్ధమే. కావుననే మహాభారతమునందు 'నభూతసంఘ సంస్థా
దేహోఽస్యపరమాత్మనః' అని దేవునకు భౌతికశరీరముండదని చెప్పబడిన
అసలు దేవుడనగా 'దివుక్రీడావిజిగీషామదస్వప్నకాంతిగతిషు' అను ధాతువును
నిష్పన్నమైనది. దేవశబ్దము గనుక ప్రకాశించువాడు, తేజస్స్వరూపుడని అర్థ
పంచభూతములతో కూడినది స్థూలదేహము. జీవుడు స్వప్నమునందు సూక్ష్మ
రమునందుండునని భాగవతియందు గలదు. మానవుల సుఖదుఃఖములకు మూలమై
కారణములు కారణశరీరమందుండును. ఇట్లు స్థూల, సూక్ష్మ, కారణశరీరమ
జీవులకుండును. మనుసంతానమగుటచే మనము మానవులము, మనుష్యులము
పిలువబడుచున్నాము. 'మనోర్భవాః మానవాః' అని వ్యుత్పత్తి. ఇట్లే 'మనోర్జా
వఞతౌషుక్చ' అని షుక్ప్రత్యయము రాగా మనుధాతువునుండి 'మనుష్యాః' 
రూపముగూడ నేర్పడును.

వరుణలోకమున జలశరీరము, ఆదిత్యలోకమున అగ్నిశరీరము, వా
లోకమున వాయుశరీరముండును. న్యాయకుసుమాంజలియందును పైవిషయ
గలదు.

దేవతారథములు తామ్రవర్ణములేగాక ఇతరవర్ణములతోను ప్రకాశించు
బృహస్పతిరథము స్వర్ణమయము. బుధునిరథము తేజస్సు, నీటితోను నిర్మింప

6. "కలేరంశస్తు సంజజ్ఞే భువి దుర్యోధనోనృపః" —భారత

యుండును. శుక్రునిరథము భూమియొక్క ధర్మములతోనుండును. పురాణనిరూపిత మైన ఈవిషయము నవగ్రహస్తుతియందు నేనిట్లు వర్ణించితిని.

"అస్వప్నానామ్ గురోఃపాతు స్వష్టాపదవినిర్మితః
స్వప్నేసకద్దృష్టమాత్రః రక్షితా స్యందనో జనాన్"
"పిశఙ్గైరష్టభిశ్చాశ్వైః వారితేజోమయోరథః
పాతు సౌందర్యసారస్య భక్తాన్నశ్చ సుమేధసః"
"దశభిర్వివిధైర్వర్ణైః అశ్వైర్యుక్తః క్షితేర్గుణైః
సితస్య స్యందనఃపాతు స్మృతమాత్రస్తుసర్వదా"

సూర్యుడే జగమునకు ప్రాణము, జగదాధారుడు. ఈ విషయమునే 'సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ' అను వేదమంత్రము తెలియజేయుచున్నది. మహాత్ములను నిందించుట పాపహేతువు. కావుననే 'అలోకసామాన్యమచిన్త్యహేతుకమ్ ద్విషన్తి మందాశ్చరితం మహాత్మనః' అనినాడు కాళిదాసు. దేవతలను నిందించుట యింకను పాపమే.

అరణ్యపర్వమునందు కుంతి దుర్వాసుని సేవించిన విధమిట్లున్నది.

"అతడును తద్భావమరయంగ మది గోరి
రూపించి యిటుపోయిరేపవత్తు
ననిపోయి నడికిరేయర్థితో జనుదెంచు
రేయివచ్చెదనని రేపువచ్చు
నేప్రొద్దు వచ్చిన నింతియప్పుడభక్ష్య
భోజ్యముల్ గ్రొత్తపొల్పుగ నొనర్చు
నెయ్యది గోరిన నిచ్చకు రాబెట్టు
నలయదు మదినైన నలుగదెపుడు

ననుదినంబు భోజుడాత్మజ బిల్చి త
ద్వర్తనంబు నడుగవనజముఖియు
దానుగొల్చు తెఱగుఁదాపసవరుని చం
ధమును జెప్పుచుండుఁదండ్రియలర"     -అర. 7 ఆ. 323ప.

గాయత్రియందలి సవితృపదము సూర్యునే సూచించుచున్నది. 'నః న్యరకో నీచై ర్గమనమ్' అని నిరుక్తమందు గలదు. కావున నరకమనగా అధో యని యర్థము. సాంఖ్యకారికలయందును తామసులు నరకమును పొందుదురనిం నరకమనగా అధోగతియని గలదు.

"గమనమధస్తాద్భవత్యధర్మేణ" —సాంఖ్య.కారి.

భగవానుడు సజ్జనులకు మంచిబుద్ధిని, దుర్జనులకు చెడుభావమును కలిగిం స్వర్గమును నరకమును ప్రసాదించును. 'ఏషహ్యేవసాధుకర్మకారయతి యమున్ని షతే, ఏషహ్యేవాసాధుకర్మకారయతియమధోనినీషతే' అను వేదమంత్రః పైయర్థమునే బోధించుచున్నది. శ్రీకృష్ణపరమాత్మయు,

"తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభమాసురీష్వేవ యోనిషు" అనినాడు.

కర్ణమునందు నాదము వినిపించునను విషయము

"సిద్ధాసనస్థితో యోగీ ముద్రాం సంధాయ వైష్ణవీమ్
శృణుయాద్దక్షిణే కర్ణే నాదమంతర్గతం సదా" అని

ఋగ్వేదీయనాదబిందూపనిషత్తునందు గలదు. 'విషయా వినివర్తన్తే నిరాహారస దేహినః' అని గీతలో ఆహారము గ్రహింపనివ్యక్తికి, విషయవాంఛ యుండవ చెప్పబడినది. ఇది మానవుల విషయము. అసలు ఆహారప్రసక్తియేలేని దేవత విషయమున రాగద్వేషాదులనారోపించెడి యవకాశమే లేదు. లేతస్సనగా దై సంకల్పమే. మనుష్యానందముకంటె దేవతానందము గొప్పదనుట నిజము.తైత్తి యోపనిషత్తునందీయర్థమున్నది. గమనింతపుడు.

"యువాస్యాత్సాధుయువాఽధ్యాయకః ఆశిష్ఠో ద్రఢిష్ఠోబలిష్ఠః తస్యే యం పృథివీ సర్వా విత్తస్య పూర్ణాస్యాత్ సఏకోమానుష ఆనందః యే తే శతం మానుషా ఆనందాః స ఏకో మనుష్యగంధర్వాణా మానందః............సఏకో దేవానామానందః" అను. 8.

వరుణాదిత్యాదిలోకములయందు జలమయ వహ్నిమయ దేహములుండ ననుటకు ప్రమాణము.

"శీతస్పర్శవత్య ఆపః......శరీరం వరుణలోకే"- తర్కసంగ్రహము,

శరీరమునందే యన్ని తీర్థములు గలవనుట సమంజసము. శరీరమందలి తీర్థములను కాశీఖండమెట్లు ప్రతిపాదించుచున్నదో చూడుడు—

"ఎల్లవియు బాహ్యతీర్థంబు లిందువదన
యరయ బాహ్యంబులయ్యు నాభ్యంతరములు
కాశికాతీర్థమాదిగాఁగలవు కొన్ని
వాని వినిపింతు పరిపాటి వనిత వినుము" —కాశీఖం. 2-116

సూర్యభగవానుని దేవతలుసైతము నమస్కరింతురు. ఈ విషయమునే వరాహమిహిరుడెట్లు వర్ణించెనో చూడుడు.

"యస్యోదయాస్తసమయే సురముకుటనిఘృష్టచరణకమలోఽపి
కురుతేఽంజలిం త్రినేత్రః స జయతి ధామ్నాం నిధిస్సూర్యః"
—లఘుజాతకము. 1వశ్లో.

# 2. ద్రౌపది

ద్రౌపదికి భర్త ఒక్కడేయనునది అంతర్గతభావము. ఒకే ఇంద్రుడైదుగుర మారుటచే, ద్రౌపదికి ఏక భర్తృత్వమాంతరంగిక సత్యము. వ్యావహారికమ ఐదుగురు భర్తలుండుట సమంజసమే యనునభిప్రాయముతో పెద్దలు చెప్పియుండి పంచేంద్రులు పంచపాండవులనువాక్యమున, పంచసంఖ్యాకత్వము వ్యావహా మయ్యెను, ఇంద్రత్వమాంతరంగిక సత్యమేయని వారి అభిప్రాయము. వ్యావహా ముగా ఐదుగురు భర్తలనుట సత్యము. పరమసత్యాన్వేషణమున భర్తయొక్క యనక తప్పెట్లు ?

ఒకప్పుడు దేవేంద్రుడు త్రిశిరుడను రక్కసుని వధింపగా, బ్రహ్మహ దోషమయి, తత్ప్రభావమున ఇంద్రుని తేజస్సు యమునియందు ప్రవేశించె ఇంద్రుడు వృత్రుని సంహరించినపుడు ఆదోషము వలన ఇంద్రశక్తి వాయువు చేరినది. అహల్యాసమాగమ దోషము వలన, ఇంద్రశక్తి అశ్వినీదేవతలయం ప్రవేశించినది. తరువాత ఒకప్పుడు భూభారహరణమునకై ఆయాదేవతాంశ ఉద్భవించునపుడు, ఇంద్రుని తేజస్సు యమధర్మరాజునుండి కుంతిని చేర యుధిష్ఠిరుడు, వాయుదేవుని నుండి కుంతిని చేరగా భీముడు, ఇంద్రశక్తి అశ్ దేవతలనుండి కుంతిని చేరగా నకులసహదేవులు, సహజమైన ఇంద్రశ అర్జునుడు జన్మించిరి. శచీదేవియే ద్రౌపది. యోగులనేక శరీరములను ధరి గలరు. ఇదియంతయు మార్కండేయపురాణమునందు గలదు.

“బ్రహ్మహత్యాభిభూతస్య పరాహానిరజాయత
తదాధర్మం వివేశాథ శాక్రం తేజోఽపచారతః
బ్రహ్మహత్యాభిభూతస్య బలం వాయుమథాఽఽవిశత్
గౌతమస్యాకృతిర్రూపం అహల్యాం చ యథా వృషా
ధర్షయామాస దేవేంద్రః తదారూపమహీయత
విహాయ దుష్టం దేవేంద్రం నాసత్యావగమత్తు తత్
తేజోభాగైస్తతో దేవాః అవతేరుర్దివో మహీమ్
ప్రజానాముపకారార్థం భూభారహరణాయ చ
యదింద్రదేహజం తేజః స్వన్ముమోచ స్వయం వృషః

కుంత్యాం జాతో మహాతేజాః తతో రాజా యుధిష్ఠిరః
బలం ముమోచ పవనః తత్ర భీమో వ్యజాయత
ఉత్పన్నౌ యమళౌ మాద్ర్యాం శక్రరూపౌ మహాద్యుతీ
శక్రస్య వీర్యతశ్చైవ జజ్ఞే పార్థో ధనంజయః
ధర్మః పృథ్వ్యనిలో భీమో జలం పార్థోఽనలః స్మృతః
నకులో రూపతశ్చాగ్నే స్సహదేవో నభస్స్మృతః
పంచధా భగవానిత్థమవతీర్ణశ్శతక్రతుః
పౌలోమీ యా తు సంభూతా సాత్వియం ద్రుపదాత్మజా
పంచానాం మహిషీ చైషాఽభూదింద్రాంశావతారిణామ్
శక్రస్యైకస్య సాపత్నీ కృష్ణా నాన్యస్య కస్యచిత్
యోగీశ్వరాశ్శరీరాణి కుర్వన్తి బహులాన్యపి
పంచానామేకపత్నీత్వమిత్యేవం కథితం తవ"

ఇట పాండవులు పంచభూతములని చెప్పుటయుక్తముగాదని శ్రీవారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యభిప్రాయము. వారి మతమున పై శ్లోకములు ప్రక్షిప్తములు. వఝ్ఝల చిన సీతారామశాస్త్రిగారి కర్ణచరిత్రమునందును పై పంచభూతత్వ ప్రతిపాదనమున్నది. కాని వారణాసి వారు త్రోసిపుచ్చిరి.

'పంచమేపతయస్సన్తి మహ్యాం షష్ఠోఽపిరోచతే' అను ద్రౌపదీ వాక్యము ప్రక్షిప్తము గావున దాని నాధారముగా గొని పంచపాండవులకు పంచభూతత్వమును పండితులవారు చెప్పుట యసమంజసమని శ్రీ వారణాసివారి యభిప్రాయము.

ఇట వారి యభిప్రాయములను గూర్చి యిట్లు నిర్ణయింతుము. పాండవులు పంచభూతములను మార్కండేయపురాణ వాక్యము ప్రమాణమేయని మామతము. మార్కండేయపురాణ ప్రతిపాదితమగు పంచభూతాత్మకత్వమును ధ్వనింపజేయుటకే 'పంచమేపతయస్సన్తి' అన్నమాటను ద్రౌపదచే అనిపించినాడు వ్యాసుడు. ఆర్షవాక్యు బహ్వర్థసూచకము. 'మహ్యాం షష్ఠోఽపిరోచతే' యన్నది మాత్రము అప్రామాణికము. ఒకే శ్లోకమున ప్రామాణికత్వాప్రామాణికత్వములు రెండును ఎట్లు పొసగును? అని ఆక్షేపింపరాదు. అపంక్తి వ్రాయసకాండ్ర ప్రమాదపతితము. కావున పండితులవారు వేదాంతార్థమును నుడువుట యుక్తమే.

పంచపాండవులు ఇంద్రాంశలని తామంగీకరించినపుడు, ద్రౌపదికి ఏకభర్తృకత్వము అర్థాదాంతరంగికముగా సిద్ధించుచునేయున్నది. సంస్కృతాంధ్ర భారతములలో నొకచోట విస్మయశబ్దము, అందుకు బదులుగా నాంధ్రమున దుఃఖపదమెట్లు వచ్చినవోయన్న ప్రశ్నను ఆంధ్రభారతకర్తల నడుగవలయును.

ఇంకను ఇంద్రుడైదుగా మహేశునిచే చీల్చబడినారనుట యుక్తవగాదనినారు. ఇంద్రులైదుగురు స్వతంత్రులే అయినను ఇంద్రశక్తి ఒక్కటియనుట అయుక్తముగాదు. జటిల భర్తలైన సప్తర్షులు ఏకరూపులుగాకున్నను పదిమంది ప్రచేతసులు భర్తలుగా గల వార్క్షి యున్నను పాండవుల విషయము ఏకేంద్రత్వము సిద్ధించుట నిర్బాధమే. పంచవ్యక్తులు ఇంద్రత్వ ధర్మావచ్ఛిన్నులు గారా? ఇంతకును కల్పభేదమును బట్టి రెండు గాథలను వారంగీకరించియేయుండిరి శివుడు ద్రౌపదిని గూర్చి ఐదుగురు భర్తలుందురని చెప్పుట వ్యావహారికపరిభాషననుసరించియేగాని పారమార్థికత్వమునుబట్టిగాదు. 'మహ్యం షష్ఠోఽపిరోచతే' యన్ని శ్లోకభాగము ప్రక్షిప్తమే యని మామతము. షష్ఠశబ్దమునకు కర్ణుడన్న వ్యాఖ్య ప్రామాదికమే. జీవేశ్వరైక్యబోధకమనుట లెస్స.

కావుననే పంచపాండవులు పంచప్రాణములకు, ద్రౌపది బుద్ధికి సంకేతమని నాయభిప్రాయము శ్రీకృష్ణుడు పరమాత్మ. కామక్రోధాదులు బుద్ధిని పీడింప, పంచప్రాణములు నిశ్చేష్టములై యుండ, ప్రాణలయముగాలేక పోయినపుడు, పరమాత్మను బుద్ధి పిలుచుట పరమార్థము. కావుననే హరి రసాయనమను కావ్యమున నిట్లు వర్ణించితిని.

"శరీరే విరటావాసే పంచప్రాణైశ్చపాండవైః
ద్రౌపద్యాప్రజ్ఞయా యుక్తాశ్చర న్త్యజ్ఞాతవత్సరమ్..............

గ్యారభ్య,

"న్యస్తాత్మాన స్త్వయి పరకలావైభవే పాండుపుత్రాః
భక్తిశ్రద్ధాశమదమసదాచార వైరాగ్యయుక్తాః
జ్ఞానాంభోధౌ పునరపి పునర్మగ్నమగ్నా నిరీహాః
త్యక్తశ్రీకా అహహ! మమతాబంధహీనా విముక్తాః"

(155 to 161)

———

# 3. కర్ణుడు

సూర్యుడు కుంతికి కన్యాత్వవరమిచ్చి తన యంశమున పుత్రుడు కలుగునని చెప్పి దివికినేగెను. పిమ్మట క్రమముగా కుంతి గర్భమును దాల్చి కర్ణుని గనెను. కర్ణగర్భము సద్యోగర్భముగాదనుట సత్యము. నన్నయ భట్టు జననమైనదని చెప్పుట, కుంతికి కలిగిన యోగనిద్రలోని విషయమని మామతము. ఎఱ్ఱాప్రెగడ వాస్తవజగమున క్రమగర్భమునే చెప్పెను. ఇట్లే నీలకంఠవ్యాఖ్య. 'శుక్లేదశోత్తరే పక్షే' అన్న మూలమునకు చైత్రాది లెక్కింప మాఘశుక్ల ప్రతిపత్తునాడే కర్ణ జనన మనిన నీలకంఠవ్యాఖ్య పరమప్రామాణికము. కావుననే 'సా బాంధవభయాద్బాలా గర్భం తం వినిగూహతి' అన్నమూలము పొసగును. కావున ఈ విషయమున సద్యోజననమును చెప్పిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి భారతము సత్యదూరము. ఇట శ్రీవఝ్ఝు సూర్యనారాయణగారు చెప్పిన మాటలు ప్రామాణికములని మా యభిప్రాయము.

"ఇది యెల్లనుగలలోఁగ, న్నదిగావున
 నిజముగాఁగ నన్నయ వ్రాసెన్
 మొదలనదిగనియు బుట్టిన, యది
 పుట్టని యట్టు లెఱ్ఱనామాత్యుడనెన్" —113 ప.

"మూలమున లేని ప్రతిపత్తు నీలకంఠ,
 కోవిదుండేల గొని తెచ్చెగుంతినినుడు
 కూడిన దినంబనగనదికుముదమిత్రు,
 నుదయదినమౌట గ్రహియించె నుపమగూడి"

శ్రీమదాంధ్ర భారతసంశయ విచ్ఛేదము–129ప.

కర్ణవిషయమున నిషేకజన్మ సూర్యగమన దినము. జన్మమాఘప్రతిపత్తు.

జీవునకు మూడు శరీరములుండును. 'పితృశరీరం మాతృశరీరమ్ స్వశరీర మిత్యావసథత్రయమ్' అని ఐతరేయారణ్యకమునందు గలదు. 'తతఃకాలేన' అన్న మూలమునకు 'క్రమంబున' అను ఎఱ్ఱాప్రెగడ యనువాదము సమంజసమన్న

శ్రీవారణాసి వారి వాదముతో అంగీకరింతుము- వారు 'తత్త్వకథనపరిశిష్టము' :
పై యభిప్రాయమును వెలిబుచ్చిరి.

కర్ణచరితమున శ్రీమరుపూరు కోదండరామిరెడ్డిగారు కర్ణపాత్రవిషయ
భిన్నాభిప్రాయములను వెలువరించియున్నారు.

**ఖండనము :**

పండితులవారు సూర్యుడే కర్ణుడిగా అవతరించెనని చెప్పుట అసమంజ
పూర్వం సహస్రకవచుడనే రాక్షసుడుండేవాడు. అతనికి వేయి కవచాలు కుండ
ఉండేవి. అవి సూర్యుని వరం వలన అతనికి వచ్చాయి. అతనికి వరంకూడ
వేయి సంవత్సరాలు తపస్సుచేసినవాడే అతని ఒక కవచాన్ని చీల్చగలడు.
వేయి కవచాలు చీల్చబడిన తరువాత, వేయి కుండలాలు ఛేదింపబడ్డాకగాని
మరణించడు. బదరికాశ్రమంలో తపస్సు చేస్తున్న నరనారాయణులు ఈ రాక్ష
చంపడానికి పూనుకున్నారు. వేయి సంవత్సరాలు యుద్ధం చేస్తే తప్ప ఒక కవ
రెండు కుండలాలు తెగవు. కృష్ణుడు యుద్ధం చేసే వేయిసంవత్సరాలు అర్జు
తపస్సుచేసేవాడు. అర్జునుడు యుద్ధానికి పూనుకోగానే కృష్ణుడు తపస్సుకు కూ
వాడు. వేయి సంవత్సరాలు పూర్తికాగానే అర్జునుడు కవచం ఛేదించి తప
కూర్చునేవాడు. వెంటనే కృష్ణుడు యుద్ధానికి కూర్చునేవాడు. ఇలా ఒకరి త
ఒకరుగా యుద్ధం చేసి 999 కవచాలను 999 కుండలాలు జత్తలను పడగొ
చివరివంతు అర్జునుడిది. అర్జునుడు యుద్ధానికి రాగానే సహస్రకవచుడు భ
పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాడు. అతడు కాలక్రమేణ సూర్యోపాస
మరణించి సూర్యలోకం చేరాడు. సూర్యుడు కుంతికి అతడినే పుత్రుడిగా
దించాడు. చివరివంతు అర్జునుడిదేగనుక యుద్ధంలో అర్జునుడే కర్ణుడిని చం
ఇదీకథ. బ్రహ్మహత్యాదోషం గల బ్రహ్మ సృష్టించిన వాడే సహస్రకవ
పాపం వలన పుట్టినవాడు ఇవే స్కాంద, పద్మపురాణాలలో, అగ్నిపురాణం
వ్యాసుడిచే చెప్పబడెను.[1] పద్మపురాణంలో బ్రహ్మస్వేదం నుండి పుట్ట
సహస్రకవచి అని, పాపుడు మ్లేచ్ఛుడని కలదు.[2] కాగా సూర్యుడే కర్ణుడిగా

1. పద్మపురాణము, స్కాందము, అగ్నిపురాణాలు.
2. "స్వేదాత్సపుపుశోజజ్ఞే సపచుప్సమహేషుధిః, సహస్రకవచీ"
"పాపో మ్లేచ్ఛరూపో భయానకః" —పద్మపురాణమ్, 14

దని 'దైవరాజ్యము-సూర్యభగవాన్' అనే గ్రంథంలో శ్రీ ప్రభాకర ఉమామహేశ్వరుల వారు చెప్పినది దోషమే. కర్ణుడిగా ఆ సహస్రకవచినే సూర్యుడు కుంతికి ప్రసాదించాడని పద్మపురాణంలో ఉంది.

ఇకపోతే మిగిలిన అంశములు యథార్థములే. సూర్యుడు మనస్సుకు అధిష్ఠాన దైవం అని చెప్పడం పొరబాటు. మనస్సుకు చంద్రుడధిపతి. కంటినుండి (విరాట్ పురుషుని) సూర్యుడు అవతరించాడు.[3] జ్యోతిషం ప్రకారం కూడ చంద్రుడే మనస్సుకు అధిపతి. సూర్యుడు కాలపురుషునికి ఆత్మ.[4]

ద్రౌపదికి ఐదుగురు భర్తలుండుట యుక్తముగానఆగాథయందు మాత్రమే చెల్లినది. ఏకవ్యక్తి పంచాత్మతులుగ మారెడి యోగశక్తిని పొందని సామాన్య మానవులేతెగలోనో యుండుటగాంచి ఏతత్పరిణామమేయది యని వాకొనరాదు. దైవగాథయట్లున్నందున అందు దోషములేదు. దైవశక్తిలేని మానవులలో నిట్టి సంఘటన దోషావహమని సర్వమతగ్రంథములు ఘోషించుచునేయున్నవి. వీరు పంచేంద్రోపాఖ్యానము నుదాహరించి, పాండవులు యమాదులయంశమున బుట్టుట యేమైనదని ప్రశ్నించినారు. ఏమైనదో ఈ వ్యాఖ్యానమునందే నిరూపింపబడినది.

నన్నయగారి సద్యోగర్భవిషయమున నెట్టి సమన్వయమో తెలుపబడినది. దైవము వరమిచ్చినను గర్భము ఇతరులకు గోప్యమగుట యెట్లనినారు. ధర్మాభిమానులకు పాండవులపైననే గాక భీష్మద్రోణకృపాశ్వత్థామ కర్ణాదులపైనను అభిమానముండును.

బౌద్ధ కథలలో ద్రౌపదిపాత్రను వేదధర్మధిక్కారములతో వక్రీకరించినారు. సృష్టికి మూలభూతమైన దాంపత్యధర్మమును, గృహస్థాశ్రమ ధర్మమును గంగలో కలిపి రాముని సోదరి సీత యని సృష్టించిన బౌద్ధ కథలలో ఏమి రామణీయకమో తెలియరాకున్నది. గృహస్థాశ్రమమును వీడి అందరిని సన్న్యాసులనుగమ్మని చెప్పిన బౌద్ధ ధర్మమునందలి సీత గాథను ప్రశంసించుటలో ఔచిత్యముగానరాదు. బౌద్ధ కథలలో అట్లున్నది గదా? అవి ప్రామాణికమని వాదింపరాదు. కొందరి వాదములకు, వారు స్మరించిన పెద్దల భావములకు భేదముండును.

3. "చంద్రమామనసోజాతః చక్షోస్సూర్యో అజాయత" —పురుషసూక్తమ్.
4. "ఆత్మార్కశ్చంద్రమాశ్చిత్తమ్" —లఘుజాతకమ్.

# 4. మనమెవరం? మనమతమేది?

(అ) మన ప్రాచీన గ్రంథాలలో హిందూపదం ఉంది అని ఉమామహే శ్వర పండితుల అభిప్రాయం. హీనమైన దానిని దూషించువాడు హిం ).[1] హిడిగతౌ అనే ధాతువునుండి హిందూపదం పుట్టింది.[2] ఋగ్వేదం ఒక మంత్రంలో ముందు పాదంలో హిం, అని చివరి పాదంలో 'దు అని ఉంది. అవి కలిపితే హిందు అవుతుంది. మేరుతంత్రం, అద్భుతకో లో హిందువంటే విష్ణువనే అర్థం ఉంది. రము క్రీడాయాం అనే క్రియనుండి 'మ శబ్దం ఏర్పడినట్లే హిడి నుండి హిందుపదం వచ్చింది. పర్షియన్ లో హిందుపదాన్ని హంద్ అంటారు హంద్ అంటే గౌరవము.

(ఆ) హిందూమతం పుట్టి 195 కోట్ల 58 లక్షల 85 వేల 90 సంవత్సరా ది శ్రీరాముడు కోటి సంవత్సరాల క్రిందటి వాడు. భారతం జరిగి 500 ం॥ అయింది.

(ఇ) మన జన్మభూమి :- దేవికానదీతీరంలో హిందువులు పుట్టారు.[3]

(ఈ) మనకర్తవ్యము :- సంవత్సరానికి ఒకసారి, రోజుకు 7 ఘడియల చ న సూర్యప్రార్థన చేయవలెను. ఇది సూర్యయజ్ఞము.

(ఉ) మనం ఎలా పుట్టాము ?

అనేక వేల జంటలు పూర్వం ఒకేసారి సృష్టింపబడ్డాయి.[4] వారు ం నుండి క్రమంగా భూమిపైకి వచ్చి స్థిరపడ్డారు. ఆకలిదప్పికలులేక 4000 ం॥ ఆయుర్దాయంతో కృతయుగంలో జీవించారు. స్త్రీలకు ఋతుధర్మం గాని, వ

---

1. "హీనం దూషయతి ఇతి హిందుః —మేరుత మ్

2. "హిడి గతౌ ఇత్యస్మాత్ హిందుః" —వాచస్ప మ్

3. "అథగచ్ఛేత రాజేంద్ర దేవికాం లోకవిశ్రుతామ్
ప్రసూతిర్యత్ర విప్రాణాం శ్రూయతే భరతర్షభ"
—భార. అర. తీర్థ. 7 to 1

4. "మిథునానాం సహస్రంచ ముఖాత్సమభవన్మనే" —శివపుర ణ

ధర్మంగాని లేవు. అప్పుడు సంకల్పం వలననే సంతానం కలిగేది. త్రేతాయుగంలో ఆకలిదప్పికలుండేవి. దృష్టి వలన సంతానం కలిగేది. తేనె వారికి ఆహారం. ద్వాపరంలో స్పర్శవలన సంతానం కలిగేది. పండ్లు తినేవారు. కలియుగంలో మైథునం వలన మాత్రమే సంతానం కలుగుతూంది. ధాన్యం మొ॥ ఆహారం. ధర్మాలు యుగాలను బట్టి ఉంటాయి.[5]

సమీక్ష

ఖండనము :

## సనాతన భారతీయమతము

మనది సనాతన భారతీయ మతము. మనం హిందువులం అనుకోవడంకంటే భారతీయులం అనడం చాలా సమంజసం. హిందూపదం ప్రామాణికమని శ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారు చెప్పడం అసమంజసం. ఐకమత్యానికి అలా ఆరోజులలో చెప్పారుగాని అది అప్రామాణికం. ఐకమత్యాన్ని ఇతర కారణాల వలన బోధించాలిగాని ఇలా కాదు.

ఈ వాదాన్ని సమర్థించినవారు మన భారతీయ పండితులలో కొందరు ఉన్నంతమాత్రాన ఇది యుక్తం గాదు. ఖండించిన భారతీయ పండితులూ ఉన్నారు. వారి అభిప్రాయమే సమంజసం. స్వర్గీయ దేశభక్త శ్రీ బాలగంగాధరతిలక్ వంటి వారు కూడ వేదాలు వ్రాయబడినవని, వాటికి కాలనిర్ణయం చేసినంత మాత్రాన వేదాలు పౌరుషేయాలవుతాయా? చెప్పండి.

పాఠకులారా !

హిందూపదం ప్రాచీన గ్రంథాలలో ఉన్నదనడం సమంజసంకాదు. వ్యాకరణ తర్కాది శాస్త్రాలలోగాని, స్మృతులలోగాని, పురాణాలలోగాని, కావ్యాలలోగాని ఎక్కడా ఈ పదం కనుపించదు. హీనమైనదానిని దూషిస్తాడనే వ్యుత్పత్తిబాగులేదు. దూషించడం, ఆ అర్థంతో జాతి వాచకపదం వాడడం అంత సమంజసంకాదు. సమభావంతో చూడడం సహృదయుల లక్షణం. లోకవ్యవహారం గాని ఇంకేదైనా

5. "సంకల్పాత్ దర్శనాత్ పూర్వేషామభవన్ ప్రజాః
నచైషాం మైథునో ధర్మో బభూవ భరతర్షభ" — భారతమ్

అధ్యాత్మికాభివృద్ధికి ప్రతిబంధకమైనా దాన్ని ప్రతిబంధకంగా గుర్తించి ఉపేక్షి
తప్ప దూషించడు ఏసాధకుడు. శబ్దాన్ని బట్టి ధాతువును వెదకడం అక్కడక
గోచరిస్తుంది. అది సమంజసం కాదు. హిడి ధాతువునుండి ఏర్పడితే దక
రావడం వ్యాకరణవిరుద్ధం. పౌరాణిక వ్యుత్పత్తికి ధాతువు నిర్దేశించాల్సిన పని
అయినా ఇది పౌరాణిక వ్యుత్పత్తిగాదు. పదం పురాణాలలో, ఇతరత్రా ఉ
గాదు. రెండు భిన్నభిన్న స్థలాలలో ఉన్న అక్షరాలను కూర్చుకోవడం హా
స్పదం. అలా అయితే ఏరెండు అక్షరాలనైనా ఏమంత్రంలో నుండి అయినా
సౌకర్యం కోసం కూర్చుకోవచ్చు. అన్ని క్రొత్తపదాలు వాఙ్మయంలో ఉన
అవుతాయి. ఒకటి, రెండు నిఘంటువులలోకి ఈ పదం ప్రతిక్షిప్తమై చేర్చబడి
కొందరు పెద్దలు ఇది సంస్కృతపదమని, మనం హిందువులమని అంగీకరించ
వేరేవిషయం. ఇది సంస్కృతంలో పదమే అయితే వేరే అధునాతనులు
లక్షణం చేయనవసరం లేదుకదా.

స్వాతంత్ర్యవీరుడైన వీరసావర్కార్ ఇలా నిర్వచించాడు చూడండి—

"ఆసింధుసింధుపర్యంతా యస్య భారతభూమికా
పితృభూః పుణ్యభూశ్చైవ స వై హిందురితి స్మృతః"

నిజంగా ఈ పదం సంస్కృతంలోనే ఉంటే ప్రయోగాలు ఉండాలి. ఇదిన
కనుకనే దీన్ని సాధించడానికి, దీనికి లక్షణాలు కూర్చడానికి ఆధునికులు
పడ్డారు. అధునాతనులు ఎవరికి వారు లక్షణాలు చేయాలా ?

మొత్తం మీద ఇది సంస్కృతపదం కాదని, సింధునదికి ఇవతలభాగ
ఉన్నవారిని పాశ్చాత్యులు సింధు, హిందు అని ఉచ్చరించడం వలన హిందూః
వచ్చిందని భావించవచ్చు. హిందూపదం సంస్కృతపదమేనని వాదించే
ఉమామహేశ్వర పండితుల వారు ఆంధ్రవివేకానందులుగా ప్రసిద్ధ
కాగా శ్రీ వివేకానందుడు హిందూపదాన్ని పాశ్చాత్యుల వలన న
మించినదిగా భావించారు. సింధునదికి ఇవతలవారిని హిందువులని అన్నా

6. "In old times, it simply meant people who lived on other side of the Indus.".

—The complete works of Swami Vivekanan
Vol. III, 368 Pg

Hinduism అనేది వేదాంతానికి ఆధునికమైనపేరని తెలిపారు.[7] కావున ఆంధ్రవివేకానందులనబడే ఉమామహేశ్వరపండితులవారివాదానికి, మూల వివేకానందులవారి అభిప్రాయానికి గల విరోధము స్పష్టముగా తెలియుచున్నది. కావున వివేకానందుడు సెలవిచ్చినట్లు ఇది పాశ్చాత్యుల ఉచ్చారణవలన వచ్చిన పదమేనని భావించడం సమంజసం.

వీరసావర్కార్ స్వాతంత్ర్యసమరయోధుడు. ఆనాడు దేశంలో ఏకత్వం సాధించడానికి హిందూపదం ద్వారా అందరినీ కలపాలని భావించారు. కాని స్వాతంత్ర్యసిద్ధి కలిగింది. వీరు హిందూత్వం అనే గ్రంథం వ్రాసారు. 'ఆసింధు-' అనే హిందూ లక్షణాన్ని స్వయంగా వ్రాసి దానికి వ్యాఖ్యానంగా పైగ్రంథం వ్రాసారు. సావర్కార్ యొక్క ప్రతిభ హిందూత్వం అనే గ్రంథాన్ని వ్రాసిందని శ్రీ శ్రద్ధానందమహోదయులు గూడ తెలిపారు. వారు స్వాతంత్ర్యం పొందాలనే లక్ష్యంతోనే హిందూపదం వాడి లక్షణం వ్రాసారు. ఈ విషయాన్ని వారేస్వయంగా తెలిపారు.[8] హిందూశబ్దానికి మూలమైన సింధునది అంతా భారతదేశంలో లేదని వాపోయారు.

'గంగే చ యమునే చై -' అనే శ్లోకంలో సింధునది ఉన్నదికదా! అది దేశంలో లేదే అని వారి విచారం. సింధు లేకుండా హిందూపదం వాడబడితే అర్థం లేకుండా శబ్దం వాడినట్లవుతుంది. అని వాపోయినట్లు వారి చరిత్రలో గలదు. దేశ విభాగంలో రాజకీయంగా చీలితే దానికి మనమేమీ చేయలేము. బాధపడనవసరం లేదు. సనాతన, భారతీయపదాలు సమంజసాలు.

అయితే ఈ పదం సంస్కృతంలోనిదని ఎందుకు ప్రతిపాదించారో ఆలోచించాలి. ఆనాడు స్వాతంత్ర్యం లేక పారతంత్ర్యంలో దేశం మ్రగ్గుతూంది. ఈ దేశంలోని వారంతా ఒకటేనని, వీరందరికీ ఐకమత్యాన్ని, దేశాభిమానాన్ని కలిగిం

7. "Hinduism is the modern name of Vedanta"
—The Man Making message of Vivekananda. Page 19th

8. "రాష్ట్రస్వతంత్రతా ధ్యేయం యథా సాధ్యం చ సాధనమ్
అభ్యుత్థానాయ హిందూనాం పక్షోఽయం సంప్రవర్తితః"
—వినాయకవీరగాథా, Page 52

చాల్సిన అవసరం ఉంది. ఆ బాధ్యతను స్వాతంత్ర్యవీరులు స్వీకరించారు. జాతీయాభిమానాన్ని కల్గించడానికి,స్వాతంత్ర్యం సంపాదించాలనే కోరికను కలి డానికి, దేశంలో సంకుచితత్వాన్ని పోగొట్టి మనమంతా ఒకటేనని బోధించ పాశ్చాత్యులు చెప్పిన ఆ పదం సంస్కృతమని ప్రమాణాలను, లక్షణాలు కూర జరిగింది. ఆ కాలం గతించింది. సత్యం గుర్తించడం అవసరం. హిందూ విడనాడి దివ్యభాషలోని పదాన్ని చేపట్టడం మంచిది.

ఈ దేశంలోని వారంతా హిందువులయితే ఇక్కడ స్థిరనివాసం ఏర్ చేసుకున్న ఇతరులకుగూడ ఈ పేరు వర్తిస్తుంది. ముస్లిములను, ఇతరులను హిందువులని వ్యవహరిస్తామా? ఇతర స్థలాలనుండి ఇక్కడకువచ్చి స్థిరని ఏర్పాటు చేసుకుని, ఈ దేశాభిమానాన్ని, ఈ జాతీయతను సంతరించుకున్న గూడ భారతీయులని (భారతదేశంలో ఉన్నారు గనుక), అనాదిగా వేదశాస్త్రప సంప్రదాయాలతో ఇక్కడనే జీవిస్తున్నవారిని సనాతన భారతీయులని వ్య రించడం సమంజసం అని నా అభిప్రాయం.

భరతుడుపాలించిన దేశం గనుక ఇది భారతదేశం. ఇక్కడివారు భ యులు. భాయాం=కాంతియందు అనగా విజ్ఞానమునందు, రతాః = ఎల్లః జీవించేవారు. అనేగొప్ప అర్థం ఇందులో ఇమిడియుంది. భరతుడు పాలి ఈదేశం భారతదేశం. మనం భారతీయులం. మనమంతా (ముస్లిములు, క్రిష్టి మొ॥ వారితో సహా) భారతీయులం. మనమంతా ఒక్కటే.

నాయీ వాదానికి బలంగా శ్రీవాణీ శ్రీనివాసశాస్త్రిగారి గ్రంథం నిలుస్తు ఇత్సింగ్ ఈ దేశాన్ని ఆర్యదేశం అంటారని, 1872లో నిరుక్తవ్యాఖ్యాత దీత్ హిందూశబ్దం అప్రామాణికమని తేల్చాడని, ఆర్యసమాజం కూడ భా ష్టాన్నే ఒప్పుకుంది అని తెలిపారు. ఇంకా భరత, భారతశబ్దాలు మన గ్రంథా న్నాయి.

అవి- "యదంగత్వాత్ భరతాః సంతరేయుః" —ఋ. (3-3-33-

"ఉత్తిష్ఠత మాస్వప్త అగ్నిమిచ్ఛధ్వం భారతాః" (తై.య:అ.1పు.27అ

భారతంలో చాలా చోట్ల ఉంది. మార్కండేయపురాణం స్పష్టంగా

భారతదేశం అని చెప్పింది.[9]

పురాణాలలో, వేదాలలో, శాస్త్రాలలో ఎక్కడా హిందుపదం ఎవరూ వాడలేదు అని తెలుసుకోండి. అందుకే గాంధీ అందరినీ అనాడుకలిపి స్వాతంత్ర్యాభి ముఖులుగా చేయడానికే హిందూపదం వాడాడు, ఈ విషయాన్ని ఈశ్వరస్వరూపం అనే గ్రంథంలో చూడవచ్చు.[10] హిందూశబ్దం ధర్మశాస్త్రాలలో ఎక్కడాలేదు. సింధుశబ్దంనుండే అపభ్రష్టమై హిందు శబ్దం వచ్చింది. యవనులు మనలను హిందువులని, భ్రష్టపదాన్ని వాడుతూ నీచార్థం చెప్పారు. వారు నీచార్థం చెప్పినా, మన భాషలో గొప్ప అర్థం ఉందని కల్పించుకుని, ఆ పదాన్నే వాడుకోవలసిన కర్మ మనకెందుకు? ఇలా భ్రష్టమైన హిందుపదాన్ని వాడుకుంటూ మన భావదాస్యాన్ని చాటుకోకూడదు. అయినా వాడుకోవాలనుకుంటే అపభ్రష్టమైన హిందుపదంకంటె సింధువులమని అమూలపదమే వాడుకోవడం మంచిది. భ్రష్టమైన పదాలపైన మనకి మోజుకూడదు. (భ్రష్టము = మూలమైన అర్థమునుండి మారినది) సింధు శబ్దంకూడ జాతిని కాని, ధర్మమునుకాని చెబుతూ మన గ్రంథాలలోలేదు. శ్రీమణిశంకరవసంత రామాత్మజ—ఉపాధ్యాయులు గూడ ఇలాగే అభిప్రాయపడ్డారు.

ఆకారికలను చూడండి :-

"హిందుశబ్దో నికృష్టార్థే యవనానాం ప్రయోజితః
తథాపి తత్రవః కీదృగనురాగః ప్రదృశ్యతే
హీనస్త్రిహితమాత్మీయం దునోతి దనువన్నిజాన్
ఏష హిందురితిఖ్యాతః నన్యూనస్త్రావతతాయినః

9. "హిమాహ్వాం దక్షిణం వర్షం భరతాయ పితా దదౌ
తస్మాత్తు భారతం వర్షం తస్యనామ్నా మహాత్మనః"
—మార్క. 48 అ. 41శ్లో.

10. హిందుత్వమిత్యభినవం పరికల్ప్య శస్త్రం సృష్ట్వాచయావనమరుంతుదముక్తటాస్త్రమ్ క్రూరైః కదర్థిత పరిక్షితఖండితస్య త్రాతాభవాన్ విజయతేఽఖిలభారతస్య
—ఈశ్వరస్వరూపమ్-10శ్లో.

సింధుశబ్దాదపభ్రష్టో హిందుశబ్దో యదీష్యతే
అపభ్రష్టాదతః శబ్దాః సింధుశబ్దః ప్రయుజ్యతామ్
కించఋషిస్సింధు శబ్దోపి నజాతి వచనః క్వచిత్
నధర్మవచనశ్చాపి క్వచిద్వేదేషు దృశ్యతే"[11]

ప్రయోగాలలో లేదు. ఒకటి, రెండు నిఘంటువులలోకి నవీనులు ఈపద్యాః ఎక్కించారు. కావున పాఠకులారా! మనమంతా భారతీయులం. మనమంతా ఒక

రామశబ్దానికి పండితులవారి నిర్వచనంగాక ఈ క్రింది నిర్వచనంగా కనుపిస్తూంది.

"రమన్తేయోగినోఽనన్తే సత్యానందే చిదాత్మని
ఇతి రామపదేనాసౌ పరం బ్రహ్మాభిలక్ష్యతే"

సత్యజ్ఞానానంద స్వరూపమైన యే పరబ్రహ్మధ్యానమునందు సమాధ్యవస్థ పొంది యానందించుచున్నారో ఆ పరబ్రహ్మమే శ్రీరాముడని భావము.

భారతయుద్ధం జరిగిందని, అసలు జరగలేదనేవాదాలు, అలాగే కాలనిర్ణ యంలో భిన్నభిన్న దృక్పథాలు వెలువడడం శోచనీయం. సంప్రదాయ గ్రంథము యందు యుద్ధప్రసక్తి, పాశ్చాత్యులవాదన, కల్హణుని రాజతరంగిణి గ్రం సిద్ధాంతము, ఐహోలా, నిధనపూర్ శాసనములు, ఖగోళ శాస్త్ర విమర్శ, ఐ అక్బర్ వాదము, భారతగ్రంథమందలి యాంతరంగిక సాక్ష్యముల వలన మన భారతయుద్ధ కాలనిర్ణయమును చేసిరి.

"యదై్వవభగవతో విష్ణోరంశోయాతో దివం ద్విజ
వసుదేవకులోద్భూత స్తదైవ కలిరాగతః" అను

విష్ణుపురాణప్రమాణము వలన తదితరప్రమాణము వలన శ్రీకృష్ణుడు స్వర్గారోహ ణము చేసిన దినమందే కలి ప్రవేశించినదని తెలియుచున్నది. కలిప్రవేశకాలము క్రీ.పూ. 3102 సంవత్సరమని నిర్ద్వంద్వముగా తెలియుటచే అంతకు పూర్వము 36 సం॥ లకు పూర్వము భారతయుద్ధము జరిగినదని, అనగా క్రీ.పూ. 3139 అని శ్రీ టి. యస్. నారాయణశాస్త్రిగారు, యమ్. కృష్ణమాచార్యులుగారు, శ్రీ యస్. జగన్నాథరావుగారు నిరూపించియుండిరి, పాశ్చాత్యులు, అలెగ్జాండరు మనదేశముపై

11. ఈశ్వరస్వరూపమ్ —343 to 348- మ.వ. ఉదాధ్యాయః

దండెత్తినపుడు పాలించినరాజు గుప్తచంద్రగుప్తుడు కాగా మౌర్యచంద్రగుప్తుడని భ్రాంతిపడినట్లు చారిత్రకులేనాడో తేల్చిరి. భోజరాజు, శాలివాహనులను కల్పిత చక్రవర్తులను చేసిన పాశ్చాత్యుల చరిత్రలను విశ్వసింపరాదు. సంప్రదాయ మార్గములే శ్రేయోదాయకములు. Blood is Thickcr tham water అన్నట్లు తమ దేశముకంటె మహోన్నతమైన సంస్కృతి గల దేశములుగాంచి అట్లాచరించిరి

ఋగ్వేదాదిగ్రంథములతో ప్రారంభమయిన భారతీయ సంస్కృతి ప్రపంచ మందలియన్ని సంస్కృతులకంటె నతి ప్రాచీనమై ఖండాంత వ్యాప్తిగాంచినది. కావుననే నేటికినీ భారతీయ శిల్పములు, దేవాలయములు ఇతరదేశములయందు సైతము కానవచ్చుచున్నవి. వేదమందలి అశ్వత్థవృక్షమే క్రీస్తుమతమందలి యాపిల్ చెట్టుగ, జీవుడే ఆదాముగ మారిరి. ఈభాష, సంప్రదాయములు ఖండాంతరముల యందు, దేశకాలానుగుణమైన మార్పులను బొందినవి. అట్టి మార్పులలో రామ శబ్దము రోమ్‌గా మారుట, కృష్ణపదము క్రీస్తుగా మారుట కొన్ని ముఖ్యమైనవి.

అస్పృశ్యతను గూర్చి శ్రీ పండితులవారి వివరణ సమంజసమే. అస్పృశ్యత లేదని పైన కొన్ని కారికలనుదాహరించియున్నారు. అవిగాక శైవాగమ కారికల యందిట్లు గోచరించుచున్నది.

> "దేవాలయే నదీతీరే తీర్థే వైవాహికే తథా
> నౌకాయాం యజ్ఞశాలాయామ్ స్పర్శదోషోనవిద్యతే
> దోషంనిశ్చిత్యమూఢాత్మా రౌరవం నరకం వ్రజేత్"

దేవాలయమునందు, నదీతీరమందు, తీర్థములయందు, వివాహాదికర్మలయందు నౌకాప్రయాణములయందు, యజ్ఞశాలలయందు అస్పృశ్యతాదోషము లేదనియు, ఉన్నదని తలచినచో నరకము వాటిల్లునని భావమైయున్నది.

'చైతన్యనందనమ్' అను సంస్కృతకావ్యమునందలి అస్పృశ్యతా నివారణ ప్రతిపాదకములైన నా శ్లోకములను గమనింపగోరెద.

# 5. జాతులు - సమరసభావము

జాతులపై దాడి అనే గ్రంథంలో వర్ణవ్యవస్థ చెప్పబడింది. పూర్వం సామాన్యునకు గూడ తన బాధ రాజుతో చెప్పుకునే అవకాశం ఉండేది. గ్రామాధిపత్యం మొదలు పార్లమెంటుదాకా ముఖ్య పదవులను బ్రాహ్మణులుగాక యితరులే చేసారు! మంత్రివర్గంలో బ్రాహ్మణులు 4, క్షత్రియులు 8, వైశ్యులు 21, శూద్రులు 3, సూతుడు[1] ఉండేనారు.[2] మౌర్యసేనాధిపతి శూద్రుడే పీష్వారాజులలో 1బ్రాహ్మణుడు, 1శూద్రుడు ఉండేవారు.[3] విదురుడు ధృతరాష్ట్రుడి మంత్రి. ఇతడు శూద్రుడు. తిమ్మరుసు, విద్యారణ్యస్వామి, తిక్కన, యుగంధరుడు, చాణుక్యుడు మంత్రులు. పురాణాది విద్యలన్ని శూద్రులకు నేర్పాలని పురాణాలలో ఉంది.[4] వసుచరిత్ర వ్రాసిన భట్టుమూర్తి గొప్పకవి. శబరి, వేమన, విదురుడు తపస్సుగలవారు. అస్పృశ్యతలేదని, పాటిస్తే నరకం వస్తుందనీ చెప్పబడింది.[5] మనలో భేదాలను 'విభజించిపాలించు' అనే పద్ధతి ద్వారా విదేశీయులే చేసారు. హరిశ్చంద్రుని కాలంలో వీరబాహువు గొప్ప ధనికుడు.

1. "The Sudras Head-men of villages are usually sensible, polite aud well-educated men" —Duboyi

2. "చతురో బ్రాహ్మణాన్ వైద్యాన్ ప్రగల్భాన్ స్నాతకాన్ శుచీన్
   ..............................................................
   ..............................................................
   త్రీంశ్చశూద్రాన్ వినీతాంశ్చ శుచీన్ కర్మణి పూర్వకే
   అష్టాభిశ్చగుణైర్యుక్తం సూతం పౌరాణికం తథా" —భార.శాంతి.

3. "The last Peeshva had at different times, two Prime-ministers, ond of them had been either an officiationg priest—the other was a Sudra"
   హిందూదేశచరిత్ర (ఎలిఫిన్‌స్టన్)

4. "పురాణన్యాయమీమాంసా శూద్రస్యాపి విధీయతే"
   —శివధర్మోత్తరపురాణమ్

5. "ఉత్సవే వాసుదేవస్య యఃస్నాతి స్పర్శశంకయా
   స్వర్గస్థాః పితర స్తస్య పతన్తి నరకే క్షణాత్",

సమీక్ష :

జాతులపై దాడి యసగా పాశ్చాత్యుల తమ పరిపాలన బలంగా ఉండాలనే యభిప్రాయంతో వర్గవిభేదాలను సృష్టించారు. ఒకానొక నైతిక ధర్మం గల వ్యక్తి భిన్నవర్గంలోనివాడైనా సహృదయులచే ఆదరింపబడుచున్నాడు. బంధువైనను నైతికమైన విలువలేని వ్యక్తి సహృదయులచే ఆదరింపబడడు. సహృదయత ఉండడం లేకపోవడం అనే అంశాలను బట్టి ఒక వ్యక్తిని ఆదరించడం, ఆదరించకపోవడం జరుగుతుంది. యుక్తాయుక్త వివేక జ్ఞానం గలవారెవరైన భిన్నవర్గీయుడైనా గుణవంతుడిని తప్పక ఆదరిస్తారు. ఒక జాతి మఱియొకజాతిపై దాడిచేసిందనడం రాజకీయమేగాని వేఱుగాదు. బలవంతుడు బలహీనుడిని పీడించడం జరుగవచ్చు. ఒక జాతి, మఱియొక జాతిని గత చరిత్రలో హింసించిందనే దృష్టాంతాభిప్రాయంతో ప్రస్తుతం ఆజాతి మనుష్యులను విమర్శించడం, హింసించడం వివేకులు చేయదగినదికాదు. ఒక జాతికి వ్యతిరేకంగా వచ్చిన త్రిపురసేని వారి యుద్ధమం మొదలైనవి శ్రేయోదాయకములు కానేరవు. గుణవంతుడెప్పుడు జాత్యభిమానంతో హింసాత్మక చర్యలలో పాల్గొనజాలడు. ఒక జాతిని జాత్యభిమానంతో హింసించడం ఈనాడూ ఉంది. అజ్ఞులున్నంతకాలం జాత్యహంకారం ఉంటుంది. ఎవరి కుల ధర్మాలు వారాచరిస్తూ, ఇతరులతో సౌజన్యంగా మెలగడం శ్రేయోదాయకం. అందుకే మనపెద్దలు 'శీలం పృచ్ఛస్వ మా కులమ్' అన్నారు. శీలాన్నిబట్టే గౌరవం గాని కేవలం కులాన్నిబట్టి కాదని భావం. అందుకే సచ్ఛీలం పెంపొందించుకోవడం చాలా అవసరం. శూద్రుడు అనే పదానికి మంచి అర్థం ఉంది. "శుచం ద్రావయతి ఇతి శూద్రః" అని శ్రీశంకరాచార్యులవారు చెప్పారు. అంటే దుఃఖాన్ని పోగొట్టేవాడు శూద్రుడని అర్థం. అన్ని అవయవాలు సమానమైనట్లే అంచరూ సమానులే. గుణాన్నిబట్టి ఎక్కువ గౌరవం యివ్వడం సమంజసం.

# 6. దేవుడున్నాడు

పశుస్వభావమును వీడి దైవమును చేరుట నరుల లక్ష్యము. నరులలోకొన్ని పశుస్వభావములుండుట జేసి, వీరినిగూడ పశువులలో చేర్చవచ్చును.[1] కామ విషయమున నియమముల పాటింపకపోవుట, స్వపరభేదములేక అన్ని పొలముల నాక్రమించుట పశులక్షణములు. కాగా కామమునకు ఒక స్త్రీని భార్యగా నియమించు కొనుట, అన్యుల భూముల నాక్రమింపక తన భూములను మాత్రమే వాడుకొనుట మనుజలక్షణములు. నరుడు తన ధర్మములను విడచి పశులక్షణములను పొందినచో నది యధర్మమై సంక్షోభమునకు కారణమగును. అట్టిసంక్షోభమును పరిహరించుటకు ధర్మమొక్కటియే సాధనము. తనలోని పశుస్వభావమును విడచి, మానవలక్షణ ములను పొందవలెను. అనేక జన్మలనుండి వచ్చిన యీ పశులక్షణములను విడువ వలయును. జంతువులయందు విధి, నిషేధ ధర్మములు కొన్నియున్నవి. కావున అధర్మాచరణము వానికి తేలిక. మానవులకే ధర్మాచరణము కష్టము. అట్టి ధర్మ మును బోధించువాడు దేవుడు అతనిని విశ్వసింపవలయును.

ప్రపంచమను కార్యమునకు, దానిని సృష్టించిన కర్తకు కార్యకారణభావము గలదు. సూక్ష్మరూపుడు, నిర్గుణుడు అయిన ఆకర్తనుండి స్థూలము సగుణమునయిన కార్యముద్భవించినది. భూమికంటె జలము, అంతకంటె క్రమముగా అగ్ని, వాయువు, ఆకాశము పెద్దవి. స్థూలమైనవి. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనునవి క్రమముగా ఒక్కొక్కగుణమును అధికముగా కలిగి యున్నవి. కావున భూమికి నీరు, నీటికి అగ్ని, అగ్నికి వాయువు, వాయువునకు ఆకాశము కర్తలు. ఆకాశమనగా శూన్యమే. దానికి రంగులేదు. భూమి జలమందు, జలము అగ్నియందు, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమునందు లయమగును. ఆకాశమును సృష్టించినవాడు పరమాత్మ.

---

1. "షేయే పంచపశవో విభక్తాః గావోఽశ్వాః పురుషా అజావయః" —వేదః

పరమాత్మను సృష్టించినవారెవరును లేరు. కావుననే ఆకాశము చివరకు పరమాత్మయగు భగవంతునియందులయమగును. నేనుఅనునదియే ఆత్మస్వరూపము. కావున భగవంతుడు ఆత్మస్వరూపుడపైననీవే. కావున దేవుడు లేడని వాదింప రాదు.

జగజ్జనని యొక్క పాతివ్రత్యమును, ఆవేదేవుని పరిశుద్ధత్వమును నిలుపుటకు గ్రహించుటకు యత్నింపవలయును. భారతీయులందరు 'వందేమాతరమ్' అను మంత్రమును జపింపవలయును. సూర్యభగవానుని తేజస్సును ధ్యానించి, జలమును విడచి, నమస్కరించుట ప్రతిభారతీయుని కర్తవ్యము.

**Ref :**

స:- ఆకాశము శూన్యప్రదేశమేయని, దానికి రంగులేదనుట యుక్తము. ఆకాశము, సముద్రపునీరు వీటికి రంగులేకున్నను రంగున్నట్లు భ్రాంతికల్గును. ఇది భ్రాంతియని సైంటిష్టులు నిరూపించియున్నారు. శ్రీశంకర భగవత్పాదాచార్యులవారును తమ వేదాంత సూత్రభాష్యమందు 'రూపగుణశూన్యస్యాపి గగనాదేః బాలాస్తలమలినత్వాద్యభ్యస్యన్తి' అని ఆకాశమునకు రంగులేదని నిరూపించిరి.

# 7. సనాతనమతము

ఆర్ష మతమెప్పుడు పుట్టినదని యెవరైనను అడుగవచ్చును. సనాతన మతముగాని, భారతదేశముగాని యేప్పడి 195 కోట్ల 85 వేల చిల్లర సంవత్సరము లైనది. ఈదేశమందలి పెద్దలవలననే, ప్రపంచమందలి సర్వజనులు శీలమును నేర్చుకొనవలయునని గలదు. సృష్టిప్రారంభము నుండి మూడు మన్వంతరముల కాలము అనగా మన్వంతరమునకు 30,67,20,000 సంవత్సరముల చొప్పున 92,01,60,000 సంవత్సరములైనవి. పిదప నాల్గవ మన్వంతరములో గజేంద్ర మోక్షణగాధ జరిగినది. కలియుగము వయస్సు 4,32,000 సం॥లు. ఇందులో 5096(1996 నాటికి)గడచినవి. కాగా 426904 సం॥ గడచిన పిమ్మట కల్కి యీ లోకములో నవతరించును. ప్రపంచముయొక్క వయస్సు 432,00,000,000 సంవత్సరములు. నేటి వఱకు 195 కోట్ల 58 లక్షల 85 వేల చిల్లర వత్సరములు గడచినవి. కాగా 236,41,14,937 సంవత్సరములపిదప జలప్రళయము వచ్చును. ఇట్టి చక్కనైన సత్యమైన లెక్కలు హిందూమతమునందు మాత్రమే గలవు. ఇట్లే దశావతారకాలములు. హిందూ చక్రవర్తుల కాలములు నిరూపింపబడినవి.

మనము భారతీయులము. వేదమందు భరతశబ్దముచే మనమందఱము సూచింపబడితిమి. వేదమున బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు శూద్రులు అని నాల్గు వర్ణములు వర్ణింపబడినవి. ఒక్కొక్క జాతికి నొక్కొక్క వర్ణముండినది. ఈరంగులు కంటికి కనుపించునవిగాక మనస్సంబంధములైనవి సూక్ష్మరూపములైన యీ రంగులు, మనస్సునందున్నవి. సత్త్వరజస్తమోగుణములు మూడును తెలుపు, ఎఱుపు, నల్లని రంగులు కలిగియున్నవి. జన్మప్రాధాన్యము, గుణప్రాధాన్యము అను రెండును ఆయాసమయములనుబట్టి వ్యవహరింపబడుచున్నవి. బాహ్యమైన రంగుల భేదములను భారతీయులు పాటింపరు. బాహ్యమైన భేదములను విదేశీయులే ప్రవేశపెట్టిరి. మనస్సులయందలి రంగులను సామాన్యులు గుర్తింపలేరు. హిందు మతములో జన్మపరంపరలు వర్ణింపబడుట యొక గొప్ప విషయము.

దేవతలు నక్షత్రమండలములయందుందురు. వారి శరీరము తేజోమయము. ఋషులకు, దేవతలకు కామములేదు. కావున వారు స్త్రీలను పొందిరని భావింప రాదు. సీత అయోనిజగా జన్మించినది. కృష్ణుడు శంఖచక్రాదులతోనే మొదట

జన్మించెను. కావున అతడు తల్లికడుపునపుట్టలేదని తెలియుచున్నది. మనదేవుడైన శ్రీకృష్ణపరమాత్మ పది సంవత్సరములలోనే అనేక మహిమలను ప్రదర్శించి యుండెను. శ్రీకృష్ణుడు పదిసంవత్సరములలోపుననే గోపికలతో క్రీడించెను. దేవదేవునిపై దోషముల నారోపింపరాదు. సూర్యమండలమున దివ్యమైన యాత్మ గలదు. అదియే సూర్యభగవానుడు. ఈతడు ప్రత్యక్షదైవము. సూర్యుడనేక దేశములకు పరిభ్రమించుచున్నందున, ఆతడెంతయో మహిమ గలవాడు. సూర్య మండలము సైతము మెల్లగా కదలుచున్నదని విజ్ఞానశాస్త్రవేత్తలనిరి.

దేవతలకు రక్తమాంసాములు లేక కామక్రోధాదులుండవు జలమయ, తేజో మయ, వాయుమయ శరీరములు వారికున్నవి. కుంతి దేవతలను పొందినదని భావింపరాదు దేవతలకు మానవ శరీరములుండవు.

అహల్య, ద్రౌపది, వాలి భార్యయగుతార, బృహస్పతి భార్యయగుతార, మందోదరి అయోనిజలు. పరమపవిత్రలు. రాధాకృష్ణులు స్వయముగనే ఆవిర్భవించి యుండిరి. వారి జన్మమట్టిది. వేములవాడ భీమకవి, క్రీస్తు, తల్లి కడుపునుండిగాక స్వయముగనే జన్మించిరి.

## ప్రశ్నలు-సమాధానములు

### (1) బృహస్పతి తన అన్నయగు ఋచీకుని భార్యతో క్రీడించెనా?

లేదు. తేజశ్శరీరముగల బృహస్పతి తేజశ్శరీరము గల మఱియొక చిన్న నక్షత్రముపై తన తేజస్సును ప్రసరింపజేసెను. దేవతల కాహారము లేకపోవుటచే వీర్యము, కామము ఉండవు.

### (2) చంద్రుడు గురుపత్నియైన తారను పొందెనా ?

లేదు. వారు తేజోమయశరీరులు. తన సంకల్పమును తారపై ప్రసరింప జేయగా, బుధుడను తేజోమయగ్రహ ముద్భవించెను.

# 8. సంధ్యావందనము

భారతీయుల జపమే సంధ్యావందనము. అట్టి సంధ్యావందనము లెన్నిర గలవు. సంధ్యావందనమందలి మంత్రముల కన్నింటికి ప్రతిపదార్థములు భా ములు పెద్దలు కూర్చిరి. మధ్యమధ్య సందర్భానుగుణముగ కర్మలయందలి విశేష ములను తెలియవలెను. భూతోచ్చాటనమంత్రమును చదువుచు జలమును నలుమూ చల్లినపుడు, భూతములా నీటిలోని సారమును గ్రహించి వెళ్ళిపోవును. గృహస్థు గాయంత్రీమంత్రముతో కలిపియే, ఓంకారమును జపింపవలయును. గృహస్థు విడిగా జపింపరాదు. జపించిన అధోగతియే కలుగును.

నీటికి దేవత వరుణుడు గాన ఆవరుణుని ప్రార్థన సంధ్యావందనమున గలదు. శారీరక, వాచిక, మానసికదోషములన్నియు ఆచమనము వలన తొలగు వేదమంత్రములను స్వరములేకుండ చదువరాదు. స్వరమును గురువుగారి ద్వా నేర్చుకొనవలయును. అట్లధ్యయనము చేయనివారు, ఆ మంత్రములకు బదులు పురాణమంత్రములను చదువవచ్చును. ఉదయమున గాయత్రి, మధ్యాహ్నమ సావిత్రి, సాయంసమయమున సరస్వతి యను నామములతో పిలువబడు దే ఒక్కటే. గాయత్రీమంత్రమునకు సూర్యుడు దేవత. గాయత్రి ఛందస్సు. వి మిత్రుడీ మంత్రమును కనుగొనెను. అగ్నియే ముఖము. బ్రహ్మ శిరస్సు, విష్ణు హృదయము, రుద్రుడు శిఖ. పంచప్రాణములు, ఉపప్రాణములతోకూడిన గాయత్రి తెల్లగ నుండును. సాంఖ్యాయనసగోత్ర. గాయత్రీమంత్రమునందు ఇరువదినాలు రము లుండును. గాయత్రికి మూడు పాదములు, ఆరు అంగములు, ఐదు శిరస్సు ఉండును.

దైవము మంత్రమునందుండును. ఆ మంత్రమును జపించి ఆశక్తిని యంత్రమునందు ధారపోసి, దానిపై దేవుని విగ్రహమును ప్రతిష్ఠించెదరు. మంత్రశక్తి పైకి లేచి, దేవతావిగ్రహమునందు చేరి దేవాలయమండపమంత వ్యాపించును. పిమ్మట ఆశక్తి శిఖరములో చేరును కావుననే దేవాలయము యొక ఖరమును దర్శింపవలయును. మనస్సు లయముజేసి దేవుని చూచినచో ఆశ ఁనలోను ప్రవేశించును. దేవునితోబాటు మానవులను ప్రేమతో ఆదరించి స యము చేయవలెనని శ్రీమద్భాగవతమునందు గలదు. మానవప్రేమను విస్మరి

నచో, దైవము పనిచేయదు. అపవిత్రులు, మైలగలవారు ప్రవేశించినచో దేవాలయమునందలి మంత్రశక్తి నశించును. నిత్యము సత్త్వగుణముగల భక్తులు పూజింపకున్నచో, దైవశక్తి తగ్గుచుండును. అట్లు శక్తి తగ్గిన దేవాలయము, సామాన్యమందిరము నొకటే యగును.

సూర్యమండలమందు దైవమును ధ్యానింపవలయును. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను విషయములను, వాని భావనలను కలిపి లయము చేయుటయే హోమము, సంధ్యావందనమున దేవతలను, మునులను నమస్కరింపవలయును.

సృష్టి ప్రారంభమై 432 కోట్ల సంవత్సరములయిన ప్రళయమువచ్చును. ఇప్పటికి 195 కోట్ల చిల్లర సంవత్సరములయినవి. ఇంకను 236 కోట్ల చిల్లర సంవత్సరములకు జలప్రళయము వచ్చును. భ్రూమధ్యమున మనస్సును లయము చేయవలయును. సరస్వతికి రండయను పేరు గలదు. కుత్సితమైన భావములతో నీ పదమును విమర్శింపరాదు. ఆర్షమతమున నిట్టి పెన్నియో గలవు.

సంధ్యావందనమందు శివకేశవులకు భేదము లేదని చెప్పబడినది. వేద మంత్రములు నిత్యము పఠింపబడుచున్నచో, దేశములకు ఈతిబాధలు రావు. అవి క్షీణించుచుండుటవలననే తుఫానులు మున్నగు ఉపద్రవములు ఏర్పడుచున్నవి. దశావతారములను దాల్చినవాడు, స్త్రీపుం భేదములులేనివాడు, కోరినంతనే రక్షించు వాడు అయిన దేవుడొక్కడే భారతీయులకుగలడు. గాయత్రిని తిరిగి సాగనంపుటతో సంధ్యావందనము పూర్తి యగును. మధ్యాహ్న సాయంకాలములయందు మంత్రము కొంచెము మారును.

భర్త భార్యపేరు నుచ్చరింపరాదు. పేరుపెట్టి పిలువరాదు. అట్లు పిలచినచో శరీరభావ ముదయించును. అట్లు పిలువనిచో ఆత్మభావనయే వారిలో బలపడి మంచి సంతానము కలుగును.

బ్రహ్మయే మనుచక్రవర్తిగా అవతరించి ధర్మశాస్త్రమును రచించెను. అతడే స్వాయంభువమనువు. కావున మనుధర్మశాస్త్రమే మన మతమునకు మూలము. దానినే మానవులాదరింపవలయును. ఈ లోకమున ?64కోట్ల సంవత్సరములయినచో బ్రహ్మకు ఒక పగలు రాత్రియగును ఒకరి యెంగిలినొకరు తినరాదని యీమనువు చెప్పెను. భార్యమాత్రము భర్తయెంగిలి తినవచ్చును. సూక్ష్మదృష్టిలేనివారే నా నికలు

యజ్ఞమునందు శ్రాద్ధమునందు మిగిలిన యన్నమును తినుటదోషముకా జగమునశింపగా మిగిలిన బ్రహ్మము ఎంగిలియే. బ్రహ్మమును ఎంగిలియనుట తప్పులేదు. దేవుడు మనపాపములను హరించునుగాన, అతడు దొంగ. జీవుల భగవానుడు వ్యభిచరించునుగాన అతడు వ్యభిచారియునగును. నిజమైన దేవ దొంగ, వ్యభిచారియగును. అట్లు కాని దేవుడు మనకక్కరలేదు. జీవునకు ఎంగి దొంగతనము, వ్యభిచారములు దోషములు. పరమాత్మవిషయమున అర్థములు వే గావున దోషము లేదు.

జీవుడు హంసయనబడును. పరమాత్మయు హంసస్వరూపుడే. హోమ చేయువాడు, అగ్నివేదిక, అతిథి, జఠరాగ్ని, అవతారములు, జలమందు పు శంఖములు, మొసళ్ళు, ఆవుపాలు, వృషభము సర్వము భగవంతుడే· ఏడుకొం మూలాధారాది చక్రములు. వీటిపైన గల దేవుడే శ్రీవేంకటేశ్వరుడు.

కర్మలనాచరించినచో అపూర్వము పుట్టును. అది ముక్తినిచ్చును. అగ్ని ఋతమనిపేరు గలదు. ఆ ఋతమునందున్నవాడు భగవంతుడే. వింధ్యాదిపర్వ ములయందు మొలచు మూలికలయందు, సూర్యుని వలన శక్తి కలుగును. కా సూర్యుడే పరమాత్మ, శరణుజొచ్చినవారల పాపముల బోగొట్టి రక్షించు భగవా శరణువేడుటతో, సాయంసంధ్యావందనము పూర్తియగును.

సంధ్యావందనమందలిరహస్య మిట్లున్నది. కనుబొమలనడిమి భాగ సంధ్య. ఇందు ప్రాణమును గూర్చి లయము చేయుటయే సంధ్యావందనము. జ్ఞా లకు మోహమను తల్లి నశించును. జ్ఞానమను పుత్రుడు కలుగును. కావున వా జాతాశౌచము, మృతాశౌచము కలుగును. ఈ రెండు సూతకములతో కూడినవార టచే, జ్ఞానులు మాత్రము సంధ్యావందనము చేయనక్కరలేదు. మిగిలిన వారంద విధిగా సంధ్యావందనమాచరింపవలయును.

సమీక్ష :

ప్రాతః కాలమునందెఱ్ఱగా కనుపించెడి యాదిత్యతేజమునకే, గాయత్రియ నామము గలదు. ఈ రక్తవర్ణకాంతికే బ్రహ్మరూపమని, బాలాదిత్యమండల మధ్య యని నామములుగలవు. మధ్యాహ్నతేజమునకే సావిత్రి శ్వేతవర్ణ యని నామముల సాయం సమయమందలి నల్లని కాంతికే కృష్ణవర్ణ, విష్ణురూప, వృద్ధయను నా ములు గలవు. గాయత్రి యను గ్రంథమున బ్రహ్మశ్రీభాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగా

తెలిపిరి. ఇట్లే ప్రార్థింపవానిని రక్షించునదియే గాయత్రి. 'గాయంతం త్రాయతే యస్మాత్ గాయత్రీ తేన కథ్యతే' అన గాయత్రీ కల్పమందలి నిరుక్తి.

గాయత్రియందలి యొక్కొక్క పాదము నొక్కొక్క విధముగా భావించి, ధ్యానించుపద్ధతులనేకములు గలవు. గాయత్రీ మంత్రమునకు భట్టోజీ దీక్షితుడు, ఖండరాజు, త్రిమతాచార్యులు ఆయాసిద్ధాంతముల కనుగుణముగా చక్కని వ్యాఖ్యానములను రచించియున్నారు. సంధ్యాదేవతను స్త్రీపురుషాభేదముతో నుపాసింపవలయునని, సంధ్యాచిహ్నమునందు నిరూపించిరి. కావుననే 'స్త్రీరూపం చింతయే ద్దేవీం పుంరూపంవా విచింతయేత్, అథవానిష్కలంధ్యాయేత్ సచ్చిదానందలక్షణమ్' అని ప్రమాణబోధ గలదు. ఆదిత్యుడే బ్రహ్మమను ధ్యానమే సాంధ్యమని స్మృతిరత్న మహోదధి గ్రంథమందు గలదు. బ్రహ్మదేవుడు మూడు వేదములనుండి సారాంశమును గ్రహించి గాయత్రిని నిర్మించినాడు.

పురాణాచమనము, స్మృత్యాచమనమని భేదములు ఆచమనము నందుగలవు. ఆచమనము. భూతోచ్చాటనము, ప్రాణాయామము, జలాభిమంత్రణము, మార్జనము, మంత్రాచమనము, ద్వితీయమార్జనము, పాపవిమోచనము. అర్ఘ్యత్రయప్రదానము, ప్రదక్షిణము, సంధ్యాధ్యానము, తర్పణము, జపము, న్యాసము, ముద్రాప్రదర్శనము, మంత్రజపము, సూర్యోపస్థానము, దిఙ్మని దేవతానమస్కారములు, హరిహరులకు భేదములేదని స్మరించుట, నారాయణవందనము, లోకహితచింతనము, తన గోత్రమును స్మరించుచూ అభివాదనము చేయుట, ఈశ్వరార్పణము అనునవి సంధ్యావందనమందలి ముఖ్యాంశములు. అవశ్యము కర్తవ్యములు.

మానవుడు ఉత్తమజన్మను పొందుటకై వేదవిహిత కర్మల నాచరింపవలయును. ప్రతిదినము సంధ్య, స్నానము, జపము, హోమము, దేవతార్చనము, ఆతిథ్యము, వైశ్వదేవము, బ్రహ్మయజ్ఞము అను ఎనిమిది కర్మలనాచరింప వలయును. నిత్యకర్మాష్టకము మున్నగు గ్రంథములు ఈ విషయములను చక్కగా వివరించుచున్నవి.

# 9. కొన్ని తెలియందగిన విషయాలు

హిందూమతము-ప్రశ్నోత్తరములు అనే గ్రంథంలో ఈ క్రింది విషయాలున్నాయి. ప్రపంచానికి భారతదేశం మధ్యభాగంలో ఉంది. అందులకే మనదేశానికి అజనాభ మనిపేరు. ఇక్కడే సృష్టిప్రారంభమైంది. మొదటి ప్రభువు స్వాయంభువ చక్రవర్తి. అతని పిమ్మట వరుసగా అగ్నీధ్రుడు - నాభి - ఋషభుడు - భరతుడు పాలించాలి. భరతుడు పాలించడం వలన భారదేశమయ్యింది.

ఒక మన్వంతరమనగా 30,67,20,000 సం॥లు గడచి ఇప్పుడు ఏడవది వైవస్వతమన్వంతరం నడచుచున్నది. ఈ ఆర్షమతంలో స్త్రీలు,శూద్రులు అందరూ మోక్షము పొందవచ్చును.

నిజమైన బ్రాహ్మణులు ధనార్జనయే ప్రధానముగా జీవించరాదు. ఇతరులు యిచ్చిన దానిని తీసుకోవాలి. బ్రాహ్మణ జన్మము నియమములను పాటించచూ కష్టపడుటకే.[1] ధర్మభ్రష్టుడైన బ్రాహ్మణునకు దానమిచ్చినచో ఇచ్చినవాడు, పుచ్చుకొన్నవాడు నరకమును పొందుదురు.[2] ధర్మముచేయని బ్రాహ్మణులను రాజు శిక్షింపవచ్చును.[3] కేవలము బ్రాహ్మణుడైన ప్రయోజనముండదు. బ్రాహ్మణులు మూడురకములు. (1) జాతిబ్రాహ్మణుడు (సామాన్యుడు) (2) గుణబ్రాహ్మణుడు (గొప్పవాడు) (3) బ్రహ్మజ్ఞానబ్రాహ్మణుడు (కోటికి ఒకడుండును - చాలా గొప్పవాడు) సన్న్యాసి ధర్మముతోనుండువాడే నిజమైన బ్రాహ్మణుడు[4] జ్ఞానముచే ఎవరైనను మోక్షము పొందవచ్చును.

1. "విను విప్రశరీరము సుఖ, మునకే బహునియమ దుఃఖములనిహముల జెం
 దను నిత్య సౌఖ్యముందరమున బొందను బుట్టె గాక బోధప్రవణా"
 —భారతము శాంతి

"అపచస్య చయద్దానం దాతుశ్చాస్య తపఃఫలమ్
 దాతా ప్రతిగ్రహీతాచ ద్వావేతౌ నిరయగామినౌ" —పరాశరస్మృతి.ఆచార

3. "అవ్రతా హ్యనధీయానాః యత్ర భైక్ష్యచరాద్విజాః
 తం గ్రామం దండయేద్రాజా చోరభక్తప్రదోహిసః" —ప్రాయ. 58 శ్లో.

4. "స సన్న్యాసీ స ముక్తః స పూజ్యః స పరమహంసః సోఽవధూతః
 స బ్రాహ్మణః"
 —నిరాలంబోపనిషత్

ఋషులు పితృదేవతలను సృష్టించిరి. వారు దేవతలను, రాక్షసులను సృష్టించిరి. ఋషుల శరీరములు తేజస్సుతో కూడినవి. వశిష్ఠుడు ప్రాణమునుండి జన్మించెను.[1] వశిష్ఠుడు ఒక జన్మలో ఊర్వశిపుత్రుడు. ఊర్వశికి తేజశ్శరీరము గలదు. ఆమెకు కామక్రోధాదులు లేవు. సంకల్పము వలననే వారట్లు పుట్టిరి. వాల్మీకిమహర్షి ప్రచేతసమహర్షి పదవకుమారుడు. శ్రీకృష్ణుడు వ్యభిచారికాడు.

కృష్ణుడు ఆత్మ. గోపికలు జీవులు. వస్త్రము తొలగించుట అనగా అజ్ఞానమును పోగొట్టుట. పితృదేవతలకు మనము శ్రాద్ధములను పెట్టి కృతజ్ఞతను సూచింపవలయును.

| | |
|---|---|
| మత్స్యావతారము జరిగి | 13,49,20,484 సం॥ అయినవి |
| కూర్మావతారము జరిగి | 12,97,00,486 ,, ,, |
| హరిశ్చంద్రుడు పుట్టి | 11,98,34,349 ,, ,, |
| సగరచక్రవర్తి పుట్టి | 10,36,17,058 ,, ,, |

గోవు పవిత్రమైన జంతువు. భారతీయులందరు గోవులను కాపాడవలయును. పితృదేవతలు సూక్ష్మశరీరము ద్వారా ఆబ్దికములయందు ఆహారమును చూతురు. మనకు శుభములను ఇచ్చెదురు.

శ్రీకృష్ణుడే పరమాత్మ, గోపికలు జీవులు. రెండుకనులనడుమ (భ్రూమధ్యము) బృందావనము. సుషుమ్నానాడియే మురళి. వేణునాదము ఓంకారమే. కావున సమైన అర్థం గుర్తించాలి. ఈ భావం సీతారామాంజనేయంలో ఉంది.[2]

1. "ప్రాణము వశిష్ఠుండు మనమున మరీచి" —భాగ. 3స్కం. 37ప.

2. "పొందుగా భ్రూమధ్య బృందావనమ్మున
ప్రత్యక్షబోధ గోపాలమూర్తి

..........................................

గానమొనరించెనసగనోంకారమలఘు
వేణునాదస్వరూపమై వెలయునంత"

—శ్రీసీతారామాంజనేయసంవాదము.

## సమీక్ష :

సంధ్యావందనము ఎవరైనా చేయవచ్చు. అందరూ ఆచరించదగిన సంధ్యా వందనాన్ని త్వరలో నేను తయారుచేసి చేయించాలని సంకల్పం. ఋషుల చరిత్రలలో గూఢార్థాలున్నాయి. అవి సంప్రదాయబద్ధంగా పరిశీలించి తెలుసుకోవాలి. వాల్మీకిగూర్చి ప్రస్తుతం వివరిస్తాను. ఎవరైన గుణాలను, జ్ఞానాన్నిపొంది బ్రాహ్మణులు కావచ్చును. ఇలాగే ఆర్యులు, గోమాతగూర్చి స్వయంగా వివరిస్తాను. ఈ ఆర్షమతమైన భారతీయతత్త్వమే ప్రపంచంలో ఎలా వ్యాపించిందీ తెలియజేస్తాను. వాల్మీకి—ఆర్యులు-గోమాత, విశ్వసంస్కృతి గూర్చి క్రమంగా చెబుతాను.

# 10. వాల్మీకి ఎవరు?

వల్మీకమనగా పుట్ట. అందుండి తపోఽనంతరమున వెలువడుటచే వాల్మీకి యయినాడని కొందరూహించుచున్నారు. వల్మీకుని కుమారుడగుటచే వాల్మీకియని మఱికొందరు భావించిరి. ఈతడు పుట్టుకచే బోయకులమునకు చెందినవాడుకాడు. బ్రాహ్మణుడయ్యును కిరాతసంపర్గ దోషముచే ధర్మపరిచ్యుతుడై బోయగామారెను. ఒకనాడు నారదుని బంధించి దొంగతనము చేయ సంకల్పించెను. అప్పుడునారదుడు నీపాపకర్మమున నీభార్యాపుత్రులు భాగస్వాములయ్యెదరాయని ప్రశ్నించుటజరిగినది. అతడంగీకరింతురని తెలిపెను. నారదుడందులకు సందేహింప, 'నారదుని అడవి యందే బంధించి' స్వగృహమునకేగి భార్యాదులనడుగ, పాపమందు భాగస్వాములగుటకు వారు తిరస్కరించిరి. అంతట నీతడు విరక్తుడై నారదునివేడి, మంత్రోపదేశమును పొంది ఋషి అయ్యెను. ఈతనికి ఋక్షుడని, భార్గవుడని పూర్వనామము లున్నట్లు విష్ణుపురాణము తెలిపినది. భృగువంశీయుడగుటచే భార్గవుడని తైత్తిరీయ మనుచున్నది. ప్రచేతసుని పుత్రుడగుటచే, నీతడు ప్రాచేతసుడయ్యెను. ఈతడే ఇరువదినాల్గవ వ్యాసుడని వాయుపురాణసంప్రదాయము. బ్రాహ్మణుడు, బ్రహ్మజ్ఞాని యని తపోఽనంతరమున విధాత సంబోధించెను. కావున ఈతడు జాతిరీత్యా నిషాదుడుకాడు. జాతిరీత్యా బ్రాహ్మణుడే. సంసర్గ దోషము వలన కోల్పోయిన బ్రాహ్మణత్వమును, తపస్సుచే తిరిగి సంపాదించుకొనుటయేగాక, ఋషిగూడ అయ్యెనని గ్రహింపవలయును.

శంఖుడను ముని ఒకానొక బోయవానికి, వైశాఖమాస ధర్మములను, హరి మాహాత్మ్యమును బోధించి రామమంత్రమును బోధించెనని, అతడు మరుజన్మమున వల్మీకుడను మునివంశమందు జన్మించి వాల్మీకియై రామగాథను రచించెనని గలదు. శంఖుడు బోయవానిని గూర్చి చెప్పిన ఈ క్రింది శ్లోకమందులకు ప్రమాణము.

"తతస్తే భవితా జన్మ వల్మీకస్య ఋషేః కులే
వాల్మీకిరితి నామ్నాచ భూమౌ ఖ్యాతిమవాప్స్యసి"

—స్కాం.వైష్ణ-వైశా. 21 అ. 56ప

పూర్వము కృణువనుముని, బాహ్యవ్యాపారములను విసర్జించి, దుస్తరమైన తపస్సు చేసెను. ఆతనిచుట్టు పుట్టలు పెరుగుటచే ఆతడు వల్మీకుడయ్యెను. ఆతని కుమారుడే శ్రీమద్రామాయణప్రణేత, ఆదికవియైన వాల్మీకి.

"వాల్మీకిరితి విఖ్యాతో భువనేషు మహాయశాః
యోవై రామకథాం దివ్యాం స్వైః ప్రబంధైర్మనోహరైః
లోకే ప్రఖ్యాపయామాస కర్మబంధనికృంతనీమ్"

—స్కాం. వైష్ణ. వైశా. 21అ. 67,68ప.

ఈ విషయమంతయు స్కాందపురాణవైష్ణవఖండమందు గలదు.

కావున వాల్మీకి జన్మతః బ్రాహ్మణుడే.

# 11. ఆర్యులు-గోమాత

ఆర్యులు లెక్కడినుండియో ఇచటకు వచ్చిరను పాశ్చాత్యచరిత్రకారుల అభిప్రాయము సమంజసముగాదు. ఆర్యులిక్కడివారే. పాశ్చాత్య చరిత్రకారులు విక్రమార్క, శాలివాహనులనే కల్పితవ్యక్తులుగా నిరూపించుట, మహాభారతము, కవుల కాలమును కుదించివేయుట మొదలగు దుష్కర్మల నాచరించి, మనచరిత్రను తారుమారుచేసిరి. అలెగ్జాండరు భారతదేశముపై దండెత్తినపుడు గుప్తచంద్రగుప్తుడు కాగా మౌర్య చంద్రగుప్తుడని పొరబడిరి. ఇట్లు చరిత్రను తారుమారు చేయవలసిన అవసరమేమనినచో, వారి మతము ప్రకారము సృష్టి జరిగి 6000 సం॥ మాత్రమే. కాని ఇది అసంబద్ధమని సైన్సు ఎన్నడో నిరూపించినది. అయినను 6000 సం॥ లోపుననే భారతీయ చరిత్రనంతను కుదించవలయునుగదా! వారు భారతదేశమున నివసించి, ఇచటి గాలిని, ఆహారమును గ్రహించి జీవించినను వారి మనస్సునందు విదేశమతమేగదా. కావుననే 'Blood is thicker than water' అని విశ్వనాథ వారనిన మాట యథార్థము.

అయినను మన భారతీయ వేదశాస్త్ర పురాణేతిహాసములను, సంప్ర దృక్పథమున అధ్యయనముచేసి, మన యథార్థచరిత్రను వెలికిదీసినవారిలో నడింపల్లి జగన్నాథరావుగారు, శ్రీ టి. యస్. నారాయణశాస్త్రిగారు, శ్రీ క వెంకటాచలంగారు, శ్రీ కె. డి. సేత్నాగారు, శ్రీ విశ్వనాథవారు ప్రముఖు సంప్రదాయ రహస్యములను తెలియుట, భారత చరిత్రయందలి యథార్థ గుర్తించుట, విదేశీయుల కల్పనలను విశ్వసింపకుండుట, దేశాభిమానమును పెంపొందించుకొనుట మన కర్తవ్యములు.

గోవు భారతీయులకు పవిత్రమైన జంతువు. గోవధ మహాపాపము, గోవులకు అఘ్న్య అని పేరుండుటచే అవి వధార్హములు కావని తెలియుచున్నది. 'అఘ్న్యే ఇతి గవాం నామ కఏతా హన్తుమర్హతి?' అని మహాభారతమున శాంతిపర్వమందు గలదు. 'గాం సీమా హింరదితం విరాజమ్' అని యజుర్వేదము గోహింసను

నిషేధించుచున్నది. విజ్ఞానము సూర్యునితో, స్వర్గము సముద్రముతోను, పోల్చ వచ్చును. ఇంద్రుడు భూమి కంటె అధికుడుగావచ్చును. కాని గోవుతో సమా మైనదిగాని అధికమైనదిగాని లేదు. ఈ భావమీ క్రింది మంత్రము నందున్నది.

"బ్రహ్మసూర్యసమం జ్యోతిః ద్యౌఃసముద్రసమం సరః
ఇంద్రః పృధివ్యై వర్షీయాన్ గోస్తు మాత్రా న విద్యతే"
—యజు. 23-4

భారతీయ సంస్కృతిలో గోవుకు విశేషస్థానం ఉంది. 'గవామంగేషు తిష్ఠ భువనాని చతుర్దశ' అనే ప్రమాణం వలన గోవులో 14 భువనాలుంటాయని తెల స్తూంది. గోమూత్రము, గోమయము, గోదధి, గోక్షీరము, గోఘృతములకు పం గవ్యములని పేరు- దేవతలందరు వీటిలో గలరని పరాశరస్మృతి తెలుపుచున్నది

# 12. విదేశాలలో ఈ సంస్కృతి

భారతీయ మతమే విశ్వవ్యాప్తమై అనేక పరిణామములనొంది ఇతరమతము లుగ మారినది. శ్వేతాశ్వతరోపనిషత్తునందలి 'ద్వాసుపర్ణా' అను మంత్రగాథ బైబిలునందలి ఆదాము ఈవు గాథగా మారినది. లిథూనియాలోని హిందూదేవాలయ ములు యాదవ, కురు, పురునామములు భారతీయములే. తేల్స్, అవాక్సిమాండర్ ప్రభృతులు జలమునుండి యాకాశమునుండి ప్రపంచము పుట్టినదను వాదములు వేదమూలకములే. ఇర్మీనియాలో క్రీ॥పూ॥ 2, 3 శతాబ్దులలో కృష్ణపూజలు గల వనుటకు చారిత్రకాధారములు గలవు. రాయర్ పండితుడు మెటీరియా మెడికా అనుగ్రంథమందలి విషయములకు మూలము భారతదేశమే యని నిరూపించెను. ఇస్లాంపుట్టుటకు పూర్వము అరేబియాలోనివారు ఈశ్వరునే పూజించిరి. కంబోడియా లోని ప్రజలు వర్ణవిభజనమును పాటించిరి. భారతీయమతమే అన్ని మతముల కంటె ప్రాచీనమని చారిత్రకులందరు ఏకగ్రీవముగా అంగీకరించినారు. కనుక ఇందలి గాథలు, తత్త్వమే యితరమతములుగా మార్పుల నొందినదనుట సత్యము. ఆంగ్లమున శశికుమారమిత్ర వ్రాసిన 'The Culthral Empire of India' అనుగ్రంథమున, దానినాశ్రయించి రత్నకవి వ్రాసిన 'భారతీయ సంస్కృతి' యందు పైవిషయము లన్నియు గలవు.

## పాశ్చాత్యుల భావము :

మనమత ధర్మములను నాశముచేయుటకే మెకాలే ఆంగ్లవిద్యను ఈ దేశమున ప్రవేశపెట్టెను. మెకాలే ప్రభువే స్వయముగా నీ భావమును వ్యక్తము చేసియున్నాడు చూడుడు—

"No Hindu who has received English Education ever remains ..... attached to his religion....... are desire to form a class of persons, Indians in blood and colour, but English in taste, in openion, in words and intellect"

పై దానిని బట్టి హిందువులు, బుద్ధులలోను, వ్యవహారములలో ఇంగ్లీ వారై యుండవలెనని అతని భావమని తెలియుచున్నదిగదా. ఇంగ్లీషువాడు కానివా తెలివితక్కువవాడిగా గుర్తింపబడుచున్నాడని కీ౹. శే. శ్రీ ప్రకాశ (బొంబా మాజీగవర్న) వాపోయిరి. 'Those... are supposed to be ignor misfits in society' —Hindustan Standard 5-12-1!

పై పత్రికయందే విదేశీయ వ్యామోహము భారతీయులకు పెరిగినదని ఁ వాపోయిరి.

"Yet at no time during the centuries of British Domi tion had European ways of life penetrated our homes as they have done today" H.S. 5-12-1967.

చరిత్ర విషయమందు కూడ పాశ్చాత్యులకు 5,6 వేల సంవత్సరములకు వి బుద్ధి ప్రసరింపలేదు. స్వయముగా ఈ విషయమును వారే తెలుపుకొనిరి. చూడుడు

"The Memory of our race extends back only to ab 3000 years from the precent date (1849 A.D), leaving indefinite space before that - during which the infancy species must have been transacted" (USHER).

# 13. కొన్నిపాత్రలు

**కృష్ణుడు** : కృష్ణుడు గోపికలతో క్రీడించినపుడు ఆతని వయస్సు 5, 6 సం॥లు. కావున పరమాత్మను నిందించుట పాపము. తూర్పు దిక్కున చంద్రునివలె కృష్ణుడు ఆవిర్భవించెనని గలదు.[1] కావున కృష్ణుడు పుట్టెనని భావింపరాదు. కృష్ణుడు పుట్టినపుడు నాల్గుభుజములతో కనుపించెనని గలదు.[2] కావున కృష్ణుడు మనుష్యుడుకాక దైవమే.

**అహల్య** : అహల్య పరిశుద్ధురాలు. ఈమె గౌతముని భార్య. 'అహ్నాలీయతే' అని వ్యుత్పత్తి. అనగా పగటియందు లయమగునది రాత్రియని అర్థము. అహల్య యనగా మానసికశక్తి యని పండితులవారు చెప్పిరి.

**గోపికలు** : గోపికలు కృష్ణుని పరబ్రహ్మగా గుర్తించిరి.[3] వేదాలలో కర్మ కాండ మంత్రాలు 80,000, జ్ఞానకాండ మంత్రములు 4000, భక్తికాండ మంత్రములు, 16,000. భక్తికాండ మంత్రదేవతలే 16,000 గోపికలుగా అవతరించి పరబ్రహ్మ అయిన కృష్ణుని సేవించినవి.

హిందూమతము-ముక్తిమతము అనుగ్రంథమునందు సూర్యమండలమునందు గల పురుషుడే మనలో ఆత్మ అని, కంటియందు గల తేజస్సే సూర్యుడని చెప్పబడినది.

విదేశీయులు ఈ దేశమునకు వచ్చి మన ధనమంతా కొల్లగొట్టి మనదేశమును పేదదేశముగా చేసిరి.

1. "ఆవిరాసీద్యథా ప్రాచ్యాం దిశీందురివ పుష్కలః" —శ్రీమద్భాగవతమ్

2. "నాల్గు భుజములు కమలనాభనయనయుగము
నొప్పు కన్నులముందటనున్నవాడు" —భాగవతము

3. "నీవు యశోదబిడ్డడవె ! నీరజనేత్ర సమస్త జంతుచే
తోవిదితాత్మవీశుడవు తొల్లి విరించి దలంచి లోక ర
క్షా విధమాచరింపుమని సన్నుతి సేయగ సత్కులంబునన్
భూవలయంబుగావ నిట్ల బుట్టితిగాదె మనోహరాకృతిన్"
—శ్రీమద్భాగవతమ్-10-1039 ప.

కృతయుగము=17,28,000సం॥లు., త్రేతాయుగము=12.96,000సం॥ ద్వాపరయుగము=8,64,000 సం॥లు, కలియుగము 4,32,000 సం॥లు. శ్వేతవరాహ కల్పంలో 7వ వైవస్వతమన్వంతరమిది. 195 కోట్ల సం॥ న సృష్టి జరుగుచున్నది.

సమీక్ష :

అహల్య : అహల్య పొరపాటుచేసినా గౌతమశాపాన్ని అనుభవి పవిత్రురాలయ్యింది. గౌతమ శాపం ప్రకారం వాయువును మాత్రం గ్రహి నిరాహారయై భస్మమందు నిద్రిస్తున్నదై శిక్ష అనుభవించి పవిత్రురాలయ్య 'దీప్తాం అగ్నిశిఖామివ' అని వర్ణించాడు వాల్మీకి. తపశ్శక్తిచేత అగ్నిశిఖ ప్రకాశించింది అహల్య. సాక్షాత్తు శ్రీరాముడే ఆమెకు పాదాభివందనం చేసాడ ఆమె ఎంతపవిత్రురాలో తెలుస్తూంది. కాలుజారడం తప్పుకాదు. దిద్దుకోవడం గొప్పదనం ఉంది. భాస్కరరామాయణంలో గూడ "అప్పుడు రామలక్ష్మ లతిపుణ్యకల్యయగు నహల్య పాదంబుల కెఱగిన' అని రాముడే నమస్కరి నట్లుంది. కావున అహల్య పతివ్రత. అహల్య జీవునకు సంకేతం. జీవుని దోషం తాత్కాలికమేగాని శాశ్వతం కాదు. ప్రాయశ్చిత్తం చేత, కఠినతపస్సు అహల్య పరమపవిత్రురాలయ్యింది. జీవునిలో జీవత్వదోషంతొలగితే శుద్ధసత్త్వ పరబ్రహ్మమే మిగులుతుంది.

ఇక్కడ సునిశితంగా ఆలోచించాలి. బ్రహ్మయొక్క మానసపుత్రిక అహల్య. గౌతముడు దేవఋషి. ఇంద్రుడు దేవరాజు. వీరెవరికీ మానవశరీర లేవు. తేజస్సే వీరి శరీరం. ఇలాంటి సందర్భంలో అహల్య ఇంద్రుల కలయ ఎలా సంభవం. ఇది క్షుద్రసంబంధం ఎంతమాత్రం కాదు. వేదంలో అహ ంద్రుల వృత్తాంతం ఉంది వేదంలోని ఈ ఘట్టమే రామాయణంలో ఉపబృంహి తైంది. పరమపవిత్రములైన వేదాలలో కేవల కామప్రధానవృత్తం ఎందుకుంటుం వేదాలలో ఇంద్రుడు పరమాత్మస్వరూపంగా వర్ణింపబడ్డాడు. అహల్య మనస్సు ఇంద్రుడు పరమాత్మయని భావించవచ్చు. గౌతముడు గురువుకు సంకేతం. అహ ఇంద్రునితో చేరింది. అంటే మనస్సు పరమాత్మలో లయమైంది. కాని గురుసాధ లేకుండా ఇది జరిగింది. అందుకే ఉపాసన బెడిసికొట్టింది. అహల్య శపింపబడ్డ గురువైన గౌతముని ఆదేశానుసారం తపస్సుచేసి పరమాత్మయైన శ్రీరాముడి

దర్శించి మోక్షం పొందింది. అందుకే అహల్య పతివ్రత. స్త్రీలకు భర్తయే గురువు అనే విషయాన్ని ఈ గాధ తెలియజేస్తున్నది. ఇది నా అభిప్రాయం.

**గోపికలు :** ఇంద్రియాలకు గోపికలు సంకేతం. వారిభర్తలు మనస్సుకు సంకేతం. ఇంద్రియాలు మనస్సులను వీడి పరమాత్మతో లయమైనపుడు మోక్షం కలుగుతుంది. గోపికలు జీవులు. గోవు అనగా ఇంద్రియము. అందుకే 'గాః పాతీతి గోపః' అని నిరుక్తి. జీవుడు పరమాత్మతో చేరడమే గోపికాక్రీడలలో నిరహస్యం. అందుకే మతాచార్యులు వేదాంతదృష్టిలో వ్యాఖ్యానాలు వ్రాసారు.

విదేశీయుల పాలనలో సంస్కృతికి దెబ్బతగిలింది. విదేశీయులపాలనలో భారతదేశమంతా దరిద్రమైనదనుమాట నిజము. ఆంగ్లేయుల పాలనలో భారతదేశ ప్రజలెట్టి దారిద్ర్యమును అనుభవించారో ఈ క్రింది వాక్యాలవలన తెలుస్తూంది. చూడండి —

"విపరీతంగా ధరలసుపెట్టి తిండిగింజలను కొనగల సామర్థ్యంలోపించడమే దీనికి ప్రధానకారణం. ప్రజలు అనుభవింపవలసిన దారిద్ర్యానికి ఇంతకంటె తార్కాణం అవసరంలేదు."[1]

దేశంలోని కటవును గూర్చి పెద్దలెలా భావించారో యింకో ప్రమాణం చూపిస్తున్నాను చూడండి—

"This period from 1876 has been called the seed time of Indian Nationalism. Lord Lytton held his famous Delhi Durbar in 1877 at a time when the people of souta. India were suffering terribly from the destruction brought about by famine."[2]

1. భారతస్వాతంత్ర్యోద్యమచరిత్ర-ద్వితీయభాగము-పుట 47.
—శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య-1976

2. The Nationalist movement in India and it's ways.
—V.D. Mahajan-1962

# 14. సృష్టికాలనిర్ణయము

కలియుగము=4,32,000, ద్వాపరయుగము 8,64,000, త్రేతాయుగము= 12,96,000, కృతయుగము 17,28,000. ఈ నాల్గింటి కలయిక వలన నేర్పడె మహాయుగము=43,20,000.

ఒక మన్వంతరము=43,20.000×71=30,67,20,000

రెండు మన్వంతరముల మధ్య నేర్పడు జలప్రళయము

సంధికాలము = 17,28,00(

14 మన్వంతరములకు 15 సంధికాలములుండును

= 1728000×15=2592000(

14 మన్వంతరముల కాలము = 30,67,20000×14⇒ 4294080000(

14 మన్వంతరములు+15 సంధికాలములు = 42200000 సం॥

ఇదియే ప్రపంచవయస్సు, ఇందుండి జరిగినకాలము 1955885060 తీసివేయగా, 236,41,14940 సం॥ వచ్చును. ఈ కాలము జరిగిన జలప్రళయము వచ్చును.

6 మన్వంతరముల కాలము = 306720000×6=1840320000

7 మన్వంతరముల వఱకు గల సంధులు 7

= 1728000×7 = 12096000

1 మహాయుగము 4320000, 27 మహాయుగములు

4320000×27 = 11,66,40,000

| | | |
|---|---|---|
| 28వ మహాయుగంలో గడచినవి = | కృత— | 1728000 |
| | త్రేతా— | 1296000 |
| | ద్వాపర— | 864000 |
| కలియుగంలో జరిగినవి | | 5060 |
| | | 3893060 |

| | |
|---|---|
| మొత్తము=27 మహాయుగకాలములు = | 116640000 |
| 28వ మహాయుగమున గడచినవి = | 3893055 |
| | సం॥ 120533055 |

| | |
|---|---|
| 6 మన్వంతరాలు | 1840320000 |
| 7వ మన్వంతరంలో 27 మహాయుగాలు | 116640000 |
| 28లో జరిగిన కాలము | 3893055 |
| 7వ మన్వంతరములో 7 సంధులు | 12096000 |
| సృష్టి జరిగిన కాలము | 1972949055 |

భూమి చల్లబడి నివాసయోగ్యమగుటకు పట్టిన కాలము 17064000

వీటిని తీసివేయగా ప్రపంచమేర్పడి సాగినకాలము 195,58,85055 సం॥లు

| | |
|---|---|
| కలియుగారంభం నుండి విక్రమార్కుని వఱకు | 3040 సం॥లు |
| విక్రముని నుండి పుష్యమిత్రుని వఱకు | 2772 ,, |
| పుష్యమిత్రుని కాలము | 100 ,, |
| ఆంధ్రుల కాలము | 330 ,, |
| అరాజకము | 50 ,, |
| కోసల రాజ్యము | 320 ,, |
| అరాజకము | 50 ,, |
| బైదరరాజ్యము | 850 ,, |
| అరాజకస్థితి | 400 ,, |
| నిషధరాజ్యము | 132 ,, |
| శూద్రరాజ్యము | 1000 ,, |
| మొత్తము | 9044 ,, |

భవిష్యత్కాలములో విశ్వస్ఫూర్తి రాజ్యమును స్థాపించును. విశ్వస్ఫూర్తి వంశీయులు 10,000 మంది సనాతన ధర్మమును పాటించుచూ రాజ్యమేలెదరు. మఱల ధర్మహాని ఏర్పడును. అపుడు విష్ణువు సౌరాష్ట్రదేశమున సోమనాధుడుగ జన్మించి ధర్మరాజ్యమును చేయును. కావున మనము ధర్మరాజ్య మేర్పడుటకు పాటుపడవలయును.

# 15. ఆర్యభూమి ఏది?

సంపూర్ణముగా తెలిసికొనక ఋషుల గాథల నాక్షేపింపరాదు. పంచభూత ములు గొప్పగా నుండుదేశమే హిందూదేశము. ఎముకలనతుకునవి, ఆకాశగమనము నిచ్చునవి, ఆకలి తీర్చునవి అగు ఓషధులెన్నియో హిమాలయములయందు గలవు. గంగానదియందలి జలము ఎంతకాలము నిలవయున్నను చెడదు. గంగా యమునల మధ్యనుండు మునులు ఆయురారోగ్యముల నుండవలయునని భారతీ యుడు ప్రార్థించును. అన్ని కాలములయందును సూర్యకాంతి చక్కగా నిక్కడ ప్రసరించును. ఆఱు ఋతువులు సంపూర్ణధర్మములతో నిక్కడనుండును. మైసూరులో వసంతము, పంజాబులో గ్రీష్మము ఒకే సమయమున నుండును. అస్సాములో వర్షర్తువు; మధ్యప్రదేశ్‌లో శరత్తు కన్పించును. హిమాలయములందు హేమంత శిశిరము లుండును.

శీతలదేశమందలి జనులు ఈ దేశమందలి హిమాలయములయందు నివసింప గల్గుదురు. అరేబియా జనులు పంజాబులో నివసింపగలరు. అందరికీ ఈ దేశము ఆశ్రయము నొసంగుచున్నది. యూరప్‌లోని ప్రజలు తెల్లగా, ఆఫ్రికాలోని నీగ్రోలు నల్లగా, చైనా జపాను మంగోలియాలోని వారు పచ్చగా ఇతరదేశముల యందలి జనులు ఎఱ్ఱగా నుందురు. భారతదేశమందు గుణములను బట్టి జాతులేర్పడి నవి. బైబిలు, ఖురాన్, జండవెస్తా మొ॥ అన్ని మతగ్రంథముల యందలి సిద్ధాంత ములు హిందూమతమునందే గలవు.

ఎల్లప్పుడు ఉండునది గావున ఈ ధర్మము సనాతనధర్మము. ప్రపంచమును ధరించునది ధర్మము. ఈ ధర్మమే ఆధారభూతమైనది. ఉపదేశామృతమును వర్షించునది గావున ధర్మము వృషమనబడును. బ్రతికియుండగనే ముక్తిని పొంద గ్గిన యార్యులకు దేవుడీ భరతఖండము నొసంగెను. సమీపమార్గమునగాని దూర మార్గమునగాని దేవుని వద్దకు వెళ్ళగలవారు ఆర్యులు. చీమలు చెట్టునెక్కురీతిగా మందాధికారులు, పక్షులు చెట్టునెక్కు రీతిగా ఉత్తములు భగవంతుని చేరుదురు. స్వాయంభువ మనువు వంశమునందు ఆఱవవాడైన భరతుడు పాలించుటచే నీ దేశము భరతఖండమైనది. నగరములు మొ॥ నాగరిక పద్ధతుల నేర్పఱచినవాడు భరతుడే. కావున నీతని పేరున భరతఖండమైనది. స్వాయంభువుడు శతరూపను,

ప్రియవ్రతుడు బర్హిష్మతిని, అగ్నీధ్రుడు పూర్వచిత్తుని, నాభిమేరును, ఋషభుడు జయంతిని, భరతుడు పంచజననిని పెండ్లాడిరి. భరతుడు 5రుగు బిడ్డలను కనెను. నేటికి 164 కోట్ల సంవత్సరముల క్రిందట భరతుడీదేశమును పాలించెను. ఈ దేశ ప్రజలు భరతులని వేదములందు గలదు.

ధర్మార్థకామములు భారతము వలన కలుగును. 18పురాణములు, 8 వ్యాకరణములను నేర్చిన వ్యాసుడు గీతను భారతమందు కూర్చెను. వేదము, దైవము, గురువులయందు భక్తి, సర్వవిజ్ఞానము భారతమువలననే కలుగును. కావున భారతధర్మములను విడనాడరాదు ఆర్యులెచ్చటి నుండియో ఇక్కడకు వచ్చిరను పాశ్చాత్యులవాదము సరియైనదికాదు. జగద్వ్యవహారమేర్పడకముందే దేవతలు ఆర్యభూమి అయిన భరతఖండమునకు వచ్చి జీవసృష్టికై యజ్ఞమును చేసిరని గలదు. వేదమందు ఆయజ్ఞమువలననే అరణ్యపశువులు, గ్రామ్య పశువులు, మానవులు మొదలగు జీవులేర్పడినవి.

హిమాలయమునందలి యొక అంజనమును కన్నులకు దిద్దినచో నేత్రరోగములు కలుగవని ఏకాగ్నికాండమందు గలదు. ఈ గ్రంథమందు హిమాలయములు వర్ణింపబడుటచే ఆర్యులజన్మభూమి భారతదేశమే యని తెలియుచున్నది. అయోధ్య, గంగాయమునాసరస్వతులు వేదమందు వర్ణింపబడినవి. వేదమాతయగు గాయత్రి సోమలతను ఆకాశమార్గమును కొనిపోవుచుండగా ఒకపర్ణము భూమిపైబడి వృక్షమైనది. దానికి పర్ణవృక్షమనిపేరు. అదియే మోదుగచెట్టు. ఓషధీదేవతలు రావి, మోదుగలయందుందురు. ఆర్యులొనర్చు యజ్ఞములకు కావలసిన రావి, మోదుగు సోమలతలు ఈ దేశమందే దొరకును. ఆదికాలమున స్వర్గమునందలి సోమము మూజవత్పర్వతమునందు అంకురించినది. ఇది హిమాలయమునకు వెనుక గలదు. శరణ్యావతియందుద్భవించిన సోమరసమును ఇంద్రుడు త్రాగుగాక యని వేదమందు గలదు. ఈ శరణ్యావతి కురుక్షేత్రమందలి సరస్సు. సరస్వతీ నదీతీరమున ఋషులు యజ్ఞములను చేసిరి. ఋషులు ఆర్యులకు మూలపురుషులు. కర్దమప్రజాపతి స్వాయంభువమనువుకు అల్లుడు. స్వాయంభువమనువు కాలమున నీ యజ్ఞము జరిగినది. ఈ స్వాయంభువమనువు నేటికి 195 కోట్ల సంవత్సరముల క్రిందటివాడు. విదేశభూముల సృష్టిజరిగి 6000 సం॥లు. విదేశముల నుండి 195 కోట్ల సంవత్సరముల క్రిందట ఆర్యులు భారతదేశమునకు వచ్చిరనుట యెట్లు పొసగును? స్వాయంభువమనువు జన్మస్థలము బ్రహ్మావర్తము. ఇది సరస్వతీ దృషద్వతీ నదుల

మధ్య గలదు. ఇది హిందూదేశమునందలిదే. హిమాలయముల నుండి జన్మించిన దేవికానదీతీరమే ఆర్యుల జన్మభూమియని భారతమందు గలదు. కావున ఆర్యుల జన్మభూమి భారతదేశమే. భూగర్భశాస్త్రమునననుసరించి ఏదేశమున భూమియందలి పొరలు తక్కువగానుండునో ఆభూమి యిటీవల ఏర్పడినదని సిద్ధాంతము. భారత దేశమందలి పొరలధికముగాగలవు. కావున నిదియే ప్రాచీనమైన ఆర్యుల జన్మ భూమి.

స్వాయంభువమనువు దేవతాస్వరూపుడు. ఈతడు 30,67,120,000 సం॥లు రాజ్యమేలెను. ఈతడు స్వయముగనే యుద్భవించెను. కర్దమప్రజాపతిచే సృష్టింప బడినవారు మనుజులు. కర్దమస్వాయంభువులు దివ్యశరీరులు.

ఆర్యులు ఉత్తరధ్రువమున జన్మించి భరతఖండమునకు వలసవచ్చిరని పాశ్చాత్యులవాదము. ఇది సరికాదు. 6 నెలలు పగలు, 6 నెలలు రాత్రిగల ప్రదే శము గలదని వేదమందు గలదు. ఆవర్ణనము ఉత్తరధ్రువమునకు సరిపోయినట్లు గలదు. కావున ఉత్తరధ్రువమే ఆర్యుల జన్మభూమియని పాశ్చాత్యుల అపోహ.

మానవులు వారు పుట్టిన ప్రాంతమందలి శీతోష్ణములను సహజముగనే అనుభవింపగలరు. నీటిలోనుండు జీవులకు నీటిలోనుండుట అసాధ్యమా ? కావున అచటి శీతోష్ణస్థితిని భరింపలేక యిచ్చటకు వచ్చిరనుట అయుక్తము. తుఫానులు మున్నగు నుపద్రవముల కారణమున వారిచ్చటకు వచ్చిరందురు. కాని అట్టి యుపద్రవములు వేదమున సూచింపబడలేదు. మంత్రములలోని భయవర్ణనము ఉత్తరధ్రువమందు జన్మించినవారిదికాదు.

6 నెలలు పగలు, 6 నెలలు రాత్రి ఒక్క ఉత్తరధ్రువమందే గాక చంద్ర మండలమందు నివసించు పితృదేవతలకు నగును. ఇది మత్స్యపురాణమందుగలదు. ఉత్తరాయణ సంబంధమగు 6 నెలలుపగలు దేవతలకగును. దక్షిణాయనము దేవత లకు రాత్రి. ఇదిస్వర్గ సంబంధవర్ణము. కావున ఆర్యుల జన్మభూమి యుత్తర ధ్రువముగాదు. స్వర్గమందవిసహజమైనచో నిక భయమేల?

ఆర్యులు యూరల్ ప్రాంతములనుండి ఇచటకు వచ్చి వేదములను రచించు టచే ఇందు భారతీయనదులే గలవందురు. అది సరికాదు. వారు విదేశములయందే వేధములనేల కనిపెట్టలేదు. అట్లయినచో విదేశముల పేర్లే యుండెడివిగదా. అది

మానవులా లేక వారి సంతతివారా రచించినది. వారి సంతతివారైనచో ఇక వేదద్రష్ట లెవరు? కావున వేదద్రష్టలైన మహర్షుల జన్మభూమి భారతదేశమే.

అట్లయినచో వేదములు విదేశములయందే అనగా ఆసియా మధ్యభాగము నందే రచింపబడినవని కొందరనవచ్చును. అది సరికాదు. ఏలయనగా వేదముల యందు యజ్ఞములు, సమిధలు, సంధ్యావందనాదులు గలవు. విదేశీయులు, సంధ్యా వందనాదులు, శిరస్స్నానములను చేసినచో వారి యారోగ్యము చెడును. యజ్ఞము లకు సమిధలకు తగిన వాతావరణము లచట లేవు. కావున ఆర్యులజన్మభూమి భారతదేశమే.

ప్రపంచము యొక్క ఆయుఃపరిమితి 432,00,00,000 సం॥లు. సృష్టి చేయ వలెనని భగవంతుడు సంకల్పించి 1,70,64,000 సం॥లు గడచినపిమ్మట గ్రహ నక్షత్రాదులనన్నింటిని సృష్టించెను. సృష్టి అంకురార్పణ జరిగి 197,29,49,060 సం॥లు. జగద్వ్యవహారము ప్రారంభమై 195,58,85,060 సం॥లు. భూగర్భశాస్త్ర రీత్యా భూమియేర్పడి 2000 మిలియన్లు అని గలదు. మిలియను అనగా 10 లక్షలు. కావున 2000×10,00000=200,00,000 సం॥లు. ఇది సుమారుగణనము. కాని భారతీయులు 195 కోట్ల చిల్లర సంవత్సరములని ఖచ్చితముగా చెప్పగల్గిరి.

**సమీక్ష :**

విదేశీయులు తమ మతప్రచారము నధికముగాచేసి ఇచ్చట కల్లోలములను సృష్టించినమాట నిజము. కాని విక్టోరియామహారాణి మాత్రము మన సంప్రదాయ ములను సైతము గౌరవించి, క్రైస్తవప్రచారవిషయమున ఉపేక్షవహించి శాంతికై కృషిచేసినట్లు కన్పించుచున్నది. ఆమహారాణి చేసిన ప్రకటనను చూడుడు—

"It is our earnest desire to stimulate the peaceful Industry of India, to promote works of public utility and improvement and to administer it's Government for the benifit of all our subjects, resident therein ..."

—Victoria Rani's advertisement, Ist Nov. 1858.

ఆంగ్లరాజ్యమున విదేశమతమైన క్రైస్తవము బాగుగా ప్రచారము నొందినది. ఈ విషయమై ఈ క్రింది విషయములను పరిశీలింపుడు—

"1805 వరకు గుంటూరు జిల్లాలో రోమన్ క్యాథలిక్కు మతము వ్యాపించి నది. వీరి అధికారం అంగీకరించని ప్రొటెస్టెంటు మతస్థులు 1805 నుండి ప్రచారం సాగించిరి. హైద్రాబాద్‌లో 1834 లోను, విశాఖలో 1845 లో సంస్థలుపెట్టారు. సుబ్బారాయుడు అను బ్రాహ్మణుని క్రైస్తవునిగజేసి బైబిలు మొ॥ పుస్తకములను అనువదింపజేసారు. 1841 లో నోబెల్‌దొర బందరులో కాలేజి పెట్టాడు. గుంటూరులో 1842 లో క్రిష్టియన్ కాలేజి వెలసింది. ఎంతోమందిని క్రైస్తవుల్ని చేసారు. 'Indian Missionary society, Dornakalలో పనిచేసింది."

—"ఉషఃకిరణాలు" శ్రీ యండమూరి సత్యనారాయణ

కలియుగంలో వ్యసనాలున్నవారు, జ్ఞానంలేనివారు అధ్యాత్మికోపన్యాసాలు చేస్తూన్న విషయం మనకు తెలిసినదేగద. పురాణాలలో కలియుగంలో వేదాంతులు నిందింపబడ్డారు. సమాజం ఎలా భ్రష్టమైందో వివరంగా నా 'నవభారతకావ్యం'లో చూడవచ్చు. ఆర్యులనగా పూజ్యులని అర్థం. 'కర్తవ్యమాచరన్ కర్మ అకర్తవ్యమ నాచరన్ తిష్ఠతి ప్రకృతాచారే యస్స ఆర్య ఇతిస్మృతః' అనే శ్లోకం ఆర్యులెలా ఉండాలో తెలియజేస్తుంది. శాస్త్రబద్ధమైన కర్మ చేస్తూ, శాస్త్రం కూడదన్న పనులు చేయకుండా తన ఆచారవ్యవహారాలతో ఎవడుంటాడో వాడే ఆర్యుడని భావం.

# 16. సూర్యమహిమ

'యోగశ్చిత్తవృత్తినిరోధః' అను యోగసూత్రమువలన యోగము మనస్సు నందలి చాంచల్యమునరికట్టి ఏకాగ్రతను ప్రసాదించునని తెలియుచున్నది. సూర్య భగవానుడు సర్వవ్యాధివినాశకుడు. సాంబుని అనారోగ్యమును పోగొట్టినవాడు సూర్యుడే. మయూరకవియనారోగ్యమును బాపినవాడు సూర్యుడే. కావుననే సూర్యవ్రతము, రథసప్తమీపూజలు సూర్యప్రీతికరములు. సూర్యమాహాత్మ్యము, ఆదిత్యహృదయము, ద్వాదశార్య మొ॥ గ్రంథములయందు, నా నవగ్రహస్తుతి యందును వర్ణింపబడినది. ఇతర మతమునందు వైజ్ఞానిక దృక్పథముగాని, బహు గ్రంథములుగాని గొప్పసూక్తులుగాని గోచరించుట లేదు. అయనను భారతీయు లందు జేరుట విచార్యము.

# 17. వర్ణములు-ఐకమత్యము

సమీక్ష :

లోకమందెల్లెడల బలవంతుడు దుర్మార్గుడైనపుడు బలహీ
అణగద్రొక్కునేగాని ఒక వర్గము మఱియొక వర్గమును వర్గదృష్టితో అ
ద్రొక్కదు. గుణవంతుడు అన్యవర్గీయుడైనను తప్పక మైత్రిచేయుదు
స్వవర్గీయుడై, బంధువైనను గుణహీనుని చేరదీయగలమా? ఏ దుర్గుణము
యితరవర్గము వానిని, ఎంత ధనమిచ్చినను మనము ద్వేషింపలేము. ఎంత
మొసంగినను గుణహీనుడైన స్వబంధువును ఆదరింపలేము. రాగద్వేషములున్న
కలహములుండును. రాగద్వేషములు లేనిచో కలహములుండవు. కావున ఘర్షణ
రాగద్వేషములే కారణములుగాని కులములు కావు. వృత్తులకు ఆధ్యాత్మికచింతన
సామరస్యమునకు ఉపయోగపడవలసిన కులములు రాజకీయపుబెత్తుగడలకు
రించుట కడుంగడు విచార్యము. రత్నములందు, దేవతలందు, సైతము కులవిభ
గలదు. కావున ఇదియొక సిద్ధాంతప్రణాళికయే అగును.

మానసికస్వభావమును బట్టి మానవులలోని భేదములను కాదనరా
సృష్ట్యాదియందు ఒక్కొక్క వర్గమునందు కొన్నికొన్ని గుణములు నిర్దిష్టమ
నుండుట వలన ఆవర్గమువారందరు. ఆ జాతిగ పరిగణింపబడిరి. గుణములన్ని
కాలప్రభావమువలన తారుమారైనవి. ప్రస్తుతము ప్రతివర్గమునందును అన్ని
ముల గుణములు గలవారు గలరు. కావున ఒకరకమైనగుణములు గలవారందరు
వర్గముగనే పరిగణించుకొనవచ్చును. జ్ఞానప్రధానుడైన బ్రాహ్మణునకు జ్ఞాన
కలుగవలెనని, బలప్రధాన క్షత్రియునకు రాజ్యపాలనాదులు, వ్యాపారప్రధానుడ
వైశ్యునకు ఆర్థికసంపద, భౌతిక సుఖాకాంక్షులైన శూద్రులకు భౌతికసుఖము
కలుగవలెనని పురాణాదులయందు గలదు. ఎవనికేది యిష్టమో వానికది కల
వలయుననుట బుద్ధిమంతుల లక్షణము. ఇతరదేశములందును బుద్ధిప్రధాను
సైన్యసంబంధులు, రాజకీయపక్షులు, ఆర్థిక ప్రధానులు, వ్యవసాయపరిశ్రమసంబం
లగు తదితరులు అను విభాగము గలదు. వృత్తులు, మానసికలక్షణములను బ
యేర్పడిన విభాగమెంతయో సమంజసము. అన్ని వర్గములయందు నీనా
వృత్తులు, గుణములు తారుమారైనను, ఒకవృత్తి, ఒక మనస్తత్త్వముకలవారంద
అన్నివర్గములలోను ఒక్కొక్క జాతియే అగుదురు. కావున ఒక వృత్తి, కొని

గుణములు కలవారందరు ఒక్కొక్క వర్గముగా గుర్తింపవలయును. ఇవి విప్రకీర్ణములయినను చాతుర్వర్ణ్యవ్యవస్థ ఎల్లప్పుడు ఉండును.

ఏ వర్గమువారు ఆ వర్గసంబంధ లక్షణములను అవగాహనముచేసికొని యాచరింపకుండుట విచారణీయము. ఈజిప్టునందును వర్ణవిభాగము గలదు.

శూద్రుడనుపదము నిందార్థకమని భావింపరాదు. 'శూద్రస్తుజన్మనాశుద్ధః' అని గలదు. అనగా శూద్రుడు జన్మతః పవిత్రుడని అర్థము. చరిత్రలో కొందరు శూద్రులు ఉత్తమ గుణములనుపొంది సచ్ఛూద్రులుగ పరిగణింపబడి గౌరవింపబడిరి. కొందరు పండితులైన శూద్రులు తాము సచ్ఛూద్రులమని వ్యవహరించుకొనిరి. శూద్రపదము గౌరవవాచకమని గుర్తించి వారట్లు చేసిరి. శూద్రుడనగా దుఃఖమును పోగొట్టువాడని శంకరులనిరి. 'త్యక్త్వా ఋషిసహస్రాణి శూద్రమేవతు యామ్యహమ్' అని భగవంతుడు పురాణములయందు నుడివెను. అనగా ఋషులను గూడ విడచి ధార్మికుడైన శూద్రునే భగవంతుడు సమీపించుట. ప్రతి వర్గమువారికి చేయదగిన, చేయదగని ధర్మములు కొన్నిగలవు. బ్రాహ్మణస్త్రీ అయినను శివకేశవులను తాకరాదు. ('బ్రాహ్మణ్యపి హరం విష్ణుం నస్పృశేత్ శ్రేయ ఇచ్ఛతీ') శూద్రులకును వారికి తగిన ఆధ్యాత్మికక్రియలు, మంత్రములు కొన్ని గలవు. ఎక్కువగా శూద్రులు ధర్మపురాణాదులను వినుటవలన, ఆచరించుటవలన మేలుకలుగును. కావుననే 'సుగతిమియాత్ శ్రవణేన శూద్రజాతిః' అని హరివంశమునందు చెప్పబడినది. 'స్త్రీభిశ్శూద్రైశ్చ సంకీర్ణైః ధార్యతే ముక్తి కాంక్షిభిః' అని యుండుటవలన మోక్షదాయకమైన మంత్రములును శూద్రులకు గలవని తెలియుచున్నది. మోక్షమందరికీ గలదు. కావున సమగ్ర సిద్ధాంతములను తెలిసికొని, అపోహలను విడనాడి సౌమనస్యపూర్ణజీవితమును గడుపుకొనవలయును.

సంధ్యావందనాలు లేక గుణహీనులైన వారికి బ్రాహ్మణులకుసైతము వేదాధికారము లేదు. మూడు తరములు యజ్ఞయాగాదులను విడచిన, దౌర్బ్రాహ్మణ్యము కలుగునని శాస్త్రములయందుగలదు. వేదాధికారమును బ్రాహ్మణులే కోల్పోవుచుండగా, ఇతరులు దానిని ఆలోచించుటయేల? గుణములను సంపాదించుకొనుటయే తక్షణకర్తవ్యము,

# 18. భారతయుద్ధకాలము

పాశ్చాత్యులు అసమగ్రపరిశీలకులై మహాభారతయుద్ధకాలమును క్రీ. పూ. 1400 నుండి 6000 సం॥వరకు నిర్ణయించిరి. ఇదిపొరబాటు. భారతేతిహాసభాస్క బిరుదాంకితులగు శ్రీ కోట వెంకటాచలం మొ॥ వారు సరియైన చరిత్రను వె దీసిరి. సంప్రదాయగ్రంథములందు యుద్ధప్రసక్తి, యుద్ధవీరుల ప్రసక్తి, పాశ్చా పండితులు, వారిననుసరించిన భారతీయుల వాదములు, రాజతరంగిణీయం యుద్ధప్రసక్తి, ఐహోలా, నిధనపూర్ శాసనములు, ఖగోళశాస్త్రములు, అక్బత్, భారతగ్రంథసాక్ష్యముల పరిశీలనపై కలియుగ ప్రారంభమునకు పూర్వ 36 సంవత్సరములనాడు అనగా క్రీ.పూ. 5128 (నేటికి)లో భారతయుద్ధము 'The Date of Maha Bharata War' గ్రంథములో శ్రీ నడింపల్లి జగన్నా రావుగారు నిర్ణయించిరి.

# 19. వివాహము-భార్యాభర్తల సంబంధము

సృష్ట్యారంభమున బ్రహ్మసృష్టిని నిర్మించుచు అన్ని జీవులను జంటలుగా సృష్టించెను. మాయాప్రభావము వలన గోవు ఏర్పడగా దైవప్రధానముగా ఎద్దు ఏర్పడినది. ఇటులనే సర్వజీవులు ఏర్పడినవి. వేదమునందు సైతము ప్రథమమున జంటలుగానే సృష్టి జరిగినట్లు గలదు. పరమేశ్వరుని సగభాగము స్త్రీగా మారినది. కావుననే భార్యకు అర్ధాంగి యను పేరుగలదు. పురుషులనుండి విడివడిన కారణముగ స్త్రీలు భర్తనే ధ్యానించి వారియందు లీనమగుదురు. ఇదియే పతివ్రతా ధర్మమందలి రహస్యము. భర్త మరణింపగ విచారించుస్త్రీలను వేదమాత ఓదార్చుచున్నది. మరణించిన వారినుద్దేశించి ఓ మనుజుడా 'నీవు చేరిన లోకమును చేరవలెనని నీ భార్యకోరుచున్నది.' అని వేదము తెలుపుచున్నది మరణించిన వెంటనే జీవుడు శవసమీపమున, గృహావరణమందు, శ్మశానమందు, అంతరిక్షమున కొంత కాలము సంచరించును. కావున వేదము మృతుని గూర్చి పల్కుచున్నది.

బాలాకాలమునుండి కన్యనావరించియున్న వరుణపాశము నుండి ఆమెభర్త విడిపించి వివాహమూలముగా బ్రహ్మలోకమున ఆమెతో కలసి సుఖించును. ఈశ్వరుడు జలసంబంధమైన మాయయందు ప్రతిబింబించి జీవుడగును. అట్టి జీవుని జలాధిదేవతయగు వరుణుడు తన పాశములతో బంధించును. ఆనాటి నుండి జీవుడు పరమాత్మకు దూరమగును. బ్రహ్మచర్యము, గురుసేవ, అగ్నిపూజలచేత పురుషుడు సామర్థ్యమును పొంది స్త్రీలను వరుణపాశమునుండి విడిపింపగల్గును. వరుణపాశము నుండి విడిపించి తనతో పుణ్యలోకమునకు చేర్చు బాధ్యత పురుషునియందే గలదని వేదమందు గలదు. మనోవాక్కాయముల ద్వారా భర్తనే సేవించిన స్త్రీ పరలోకమున భర్తను చేరును. భర్త మరణించినపిదప త్రికరణశుద్ధిగా భర్తను ధ్యానించుచు, కాషాయవస్త్రములను ధరించుచు, ఇంద్రియవిషయములయందు స్పృహలేనిదై దైవధ్యానము చేయు సాధ్వీమణి భర్తను పరలోకమున పొందును. అతిథి సపర్య గావించు భర్తకు అన్ని విధములా సహకరించిన భార్య, ఇహలోక సౌఖ్యముల నన్నింటిని భర్తతో అనుభవించి, పరలోకసౌఖ్యమును సైతము భర్తతో కలసి అనుభవించునని భారతమందు హరివంశమున గలదు. దశరథుడు మరణించిన పిదప కౌసల్య సుమిత్రకైకేయిలు త్రికరణ శుద్ధిగా ధ్యానించి స్వర్గమున దశరథుని

కలసికొనిరి. అమృతస్వరూపుడైన భర్తతో ఏకమై అరుంధతివలె స్వర్గ భర్తతో విమానమున క్రీడించునని గలదు. జలమును విడచుచు దానమొనర్పబ కన్య పరలోకమందు భర్తనుచేరి సుఖించునని సీత చెప్పినది.

వాలి మరణించినపుడు తననుగూడ బాణముతో సంహరించుమని అట్లయిన స్వర్గమున తన భర్తయగు వాలిని చేరగలనని తార రామునితో చెప్పినది.

స్త్రీలందరు సహగమనము చేయవలెనని నియమములేదు. చేయగల్గినచ చేయవచ్చును. చేయలేనివారు రెండవ వివాహము చేసికొనక పతిని ధ్యానించు జీవింపవలయును. జలపూర్వముగా దానమొసగబడిన స్త్రీలు పరలోకమం సైతము భర్త ననుసరింతురు గదా. ఈ వనవాసమునకు వలదందువా ? అని రామునితో అనినది. 'ఓ అగ్ని! నీవనాదిగా నీభార్యయైన స్వాహాదేవితో నుంటి అట్లే చిరకాలము నుండి నాభార్యగానున్న యీమెను నాకు ప్రసాదింపుము.' తెలుపు వివాహ మంత్రము గలదు. కావున అగ్నిసాక్షిగా వివాహమాడిన దంపతు పైజన్మలయందును భార్యాభర్తలగుదురని తెలియుచున్నది.

భార్య మరణింపగా ఆమె శరీరమును అగ్ని సంస్కారమొనర్చిన భ ఆమెను అగ్నికి అర్పించుటయే యగును. ఆమెను స్వీకరించిన అగ్నియే నిజమై తండ్రి. ఆ అగ్నియే ఆమెను తిరిగి ఆమె భర్తకు మరుజన్మమున అర్పించున అగ్ని సాక్షిగా వివాహము జరుగుట యిందులకే. వేదమందలి వివాహమంత్రము యందీ అర్థము గలదు.

అధ్యాత్మ రామాయణమునందొక ఘట్టము గలదు. అందు శ్రీరాము రావణుడు భిక్షురూపమున నీవద్దకు రాగలడని, నీనీడను రూపముగాచేసి ఆశ్ర ందుంచి నీవు అగ్నిలో ప్రవేశింపుమని' సీతనాజ్ఞాపించియుండెను. సీత అట్లే చేసెను. రావణుడు మాయాసీతను అపహరించెను. మాయాసీత మరల అగ్నిలో ప్రవేశింప, అగ్ని అసలుసీతను రామునకిచ్చెను. అగ్నియే మఱుజన్మలో నరులక వారివారి భార్యల నొసంగును. అను రహస్యము పైగాధయందు గలదు. స్వర్గలో మున భర్తతో విహరించిన సతీమణి తిరిగి పవిత్రవంశములో జన్మించి ఆభర్త పొందునని శివపురాణము తెలుపుచున్నది.

కశ్యపప్రజాపతికి అదితి, వినత, కద్రువలు అను ముగ్గురు భార్యలు గలరు. ఒకనాడు వారిలో అంతఃకలహములు ఏర్పడిపరస్పరము శపించుకొని భూలోకమందు

మందు జన్మించిరి. వారే కౌసల్య, సుమిత్ర, కైకేయి అయిరి. కశ్యపుడే దశరథుడు. కావున పూర్వజన్మమందలి దంపతులే మఱు జన్మమందును దంపతులగుదురని తెలియుచున్నది. చంద్రమతి శ్మశానమందు హరిశ్చంద్రుని చూచి, తనను వధింప వచ్చినాడని తెలిసి తనను వధింపుమని, పునర్జన్మయందు మనకు సమాగమము కలుగునని తెలిపినది. సుచంద్రుడు మరణింపగా అతనికి పరమశివుడు మోక్ష మొసంగదలచెను. అప్పుడు అతని భార్య, జన్మజన్మల యందు భర్తను భార్య అనుసరించునుగదా యనినది. కావున బ్రహ్మవైవర్తపురాణమునందలి ఈ గాథ వలన భార్య మఱు జన్మమందును భర్తనే అనుసరించునని తెలియుచున్నది. అష్ట వసువులలో ద్రోణుడనువాడుగలడు. అతని భార్య ధరాదేవి. వీరే మఱు జన్మమున యశోదానందులైరి.

సుతపుడు, పృశ్నిదేవి అను దంపతులు కశ్యపుడు అదితిగ, తరువాత జన్మమున వసుదేవుడు దేవకిగా జన్మించిరి. మొదటి జంటకు పృశ్నిగర్భుడుగను, రెండవ జంటకు వామనుడుగ జన్మించిన పరమాత్మయే దేవకీవసుదేవులకు శ్రీకృష్ణుడుగ జన్మించెను. ఆహుక ఆహుకి యను దంపతులే(బోయ) పైజన్మమున నలదమయంతులైరి. దక్షుని కుమార్తెయగు సతీదేవి భస్మమై మఱు జన్మమున శివునే వివాహమాడినది. తల్లిదండ్రులు పైజన్మలో మారుతారు. భర్త ప్రతిజన్మలోను అతడే అగును. ఇంద్రుడే పాండవులు. ద్రౌపది శచీదేవియే. భార్యాభర్తలకు జన్మజన్మల బంధముండును.

**సమీక్ష :**

భారతీయ వాఙ్మయమునందు స్త్రీలకున్నతస్థానమొసంగబడినది. వారికి కొన్ని నియమములు విధింపబడుట సంఘశ్రేయోభివృద్ధికేగాని వారిని హింసించుటకో, స్వార్థమునకోగాదు. ప్రతి వాక్యమునకు వెనుక కలుషిత మనస్తత్వమే యుండునని భావింపరాదు. హిందూదేశమందలి స్త్రీలు స్వతంత్రలే యనుచు Sir Thomas గారిట్లు వ్రాయుచున్నారు.

"Their state is not one of slaves to their husbands; they have as much influence in their families as, I imagine the woman have in this Country."

నిర్దోషియగు భార్య పతిచే అవమానింపబడిన 3 జన్మల వరకు ఆ పురుషుడుగను, అతడు స్త్రీగ జన్మించెదరని కాత్యాయనసంహిత యందిట్లు గలదు-

"మాన్యాచేన్మ్రియతే పూర్వం భార్యా పతివిమానితా
త్రీణి జన్మాని సా పుంస్త్వం పురుషః స్త్రీత్వమర్హతి"

కావున పురుషుడు స్త్రీని హింసింపరాదని, స్త్రీని గౌరవింపవలసినదని తెలియ చున్నది.

పతివ్రతాధర్మములేగాక విధవాధర్మములును స్కాందపురాణమందలి ధర చార ప్రకరణమునందును చెప్పబడినవి. గత భర్తృకకు కొన్ని ధర్మములు విధిం బడుట వలన భారతీయులలో సహగమనములేదని తెలియుచున్నది. కొందరు స్త్రీ వారి వారి యభీష్టముననుసరించి సహగమనమును చేయవచ్చును. సహగమ మొనర్చుటకు, మానుటకు వారికి సర్వాధికారములు గలవు. సహగమనము తప్ప సరి యెంతమాత్రముగాదు. కావుననే భట్టబాణుడను మహాకవి మరణించినవారితో మరణించుట ఉపయోగములేదని "మృతస్తు రోభయస్యాపి. జీవంస్తు జలాంజ దానాదినా బహూప కరోతి మృతస్య" అని యెంతో యో బోధించి ఉత్తర, ర మొదలగు సహగమనము చేయని స్త్రీల నెందరినో యుదాహరణముగా తెలి యున్నాడు. జీవితాంతము అగ్నిలోసమిధలనుంచిన భారతీయధార్మికుడు చివరకు తన శరీరమును గూడ సమిధగా అగ్నిలోనుంచును. ఎంత యుదాత్తభావమె చూడుడు——

# 20. సత్సంతానము

ధర్మపద్ధతి ద్వారా కనిన సంతానమే ధర్మకర్మల నాచరించును. అట్లాచరించి ననే పితరులకు సద్గతులు లభించును. కావుననే సత్సంతతికై తపములనుసైతమాచరించినారు పెద్దలు. గుణవంతుడైన పుత్రుని గూర్చి భారతీయ వాఙ్మయమునందెల్లెడల ప్రశంసావాక్యములు గాన్పించును. అట్టి పుత్రుడే పుత్రుడు. సత్పుత్రుని లక్షణ మిట్లు చెప్పబడినది—

"జీవతోర్వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరిభోజనాత్
గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా".

జీవించినంతకాలము తల్లిదండ్రుల మాట వినుట, మరణించినపిదప శ్రాద్ధాదుల నాచరించుట, గయాపిండము పెట్టుట సత్పుత్ర లక్షణములు.

## స్త్రీమహిమ

పతివ్రతాలక్షణములెన్నో చెప్పబడియున్నవి. సంగ్రహముగా పతివ్రతా లక్షణము నిట్లు భావింపవచ్చును.

"అనుకూలా న వాగ్దుష్టా దక్షా సాధ్వీ ప్రియం వదా
ఆత్మగుప్తా స్వామిభక్తా దేవతా సా న మానుషీ"
(దక్ష సంహిత)

అనుకూల, పరుషముగా మాట్లాడక ప్రియముగా భాషించుచు గృహ కార్యముల సమర్థురాలు, సాధ్వి, స్వరక్షణ, పతిభక్తిగల స్త్రీ దేవతయే.

# 21. అనేకమార్గాలు - స్త్రీపురుషులు

**సమీక్ష :**

భారతీయ సంస్కృతిలో శైవవైష్ణవాద్యనేకభేదములున్నను అవియన్నిం భగవంతుని చేర్చెడు మార్గములే కాని వేఱుగాదు. 'నదీనాం సాగరోగతిః' అ నట్లు నదులన్నియు సముద్రమునందే గదా కలియును. అట్లే ఏ మార్గము నా యించి పయనించినను భగవంతునే చేరవచ్చును. భిన్నభిన్న మన స్తత్త్వము మానవులకు అనేక మార్గములుండుట శ్రేయోదాయకమేగదా. ఈ విషయ కాశీకేదారఖండమునందిట్లు ప్రతిపాదించబడినది.

"త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితిచ
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషాం
నృణామేకోగమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ"

శరీరమందేగాక మనస్సునందును స్త్రీపురుషులయందెంతయో భేదము గల స్త్రీ పురుషుల పరస్పరభేదమును గూర్చి పాశ్చాత్య మేధావియైన Ernest Haek గారేమనుచున్నారో వినుడు—

"Man and Woman are evolved on divergent lines fro the original impregnated ovum, differing in their metabol ratio as more katabolic and more anabolic respectively. The metabolic impressions can be studied in the anatomica Physiological and even Psychological differences of the ma and female. The coastal prominence of man and the pelv superiority of woman, the greater muscular activity of ma and the less of it in woman, and the grander masculir cerebrations in the one and the deeper retentivity and appl ation to details in the other are respectively among tl mous illustrations of the three sets of sexual demorphism

(ef, Ernest Haekal's Evolution of man and Haveloc llis Man and Woman)

———

# 22. తారాశశాంకకథ-రహస్యము

గురుగ్రహమువద్ద దానిని చుట్టివచ్చు ఒక చంద్రమండలము గలదు. చంద్రుడు విద్యకై గురువుచుట్టు తిరిగెనని కథ చెప్పబడినది. ఆ గురుగ్రహకాంతి తార. అది చంద్రునిపై ప్రసరించినది. అందువలన చంద్రునకు కలిగిన అధిక కాంతియే బుధుడు. ఇట్లు ఖగోళరహస్యము తారాశశాంకగాథయందు గలదు. తార యనగా నక్షత్రము. చంద్రుడు నక్షత్రనాథుడగుటచే తారాపతియగుచున్నాడు. బృహస్పతి, చంద్రుడు ఇద్దరు తారను పొందిరి. గురుశిష్యులిద్దరు తపశ్శక్తిని పొందిరని భావము. గురుగ్రహమును చుట్టివచ్చు చంద్రమండల కక్ష్యలో నక్షత్రములు చేరునరికి ఘర్షణయేర్పడి అన్ని నక్షత్రములతో గొప్ప సంఘర్షణాత్మకమైన మార్పు కలుగును. దీనినే తారాశశాంకగాథ చివర ఏర్పడిన దేవాసురసమరమని పురాణములు వర్ణించినవి.

యమనక్షత్రములు, దేవనక్షత్రములని నక్షత్రములు రెండు విధములు. ఇవి నాల్గు దిక్కులయందుండును. ఇవిగాక ఆగ్నేయ దిక్కున విసర్పి, నిరృతిదిక్కున అవిసర్పి, ఈశాన్యమున విషాది, వాయవ్యమున అవిషాది నరకములు గలవు. ఇవియు నక్షత్రమండలములే. చంద్రునకు జ్ఞానము కలుగుటచే ఆతనియందలి యజ్ఞానము కళంకరూపమున బయటకువచ్చినది. ఇదియే చంద్రునియందలి మచ్చ.

బ్రహ్మసరస్వతుల గాథయందును రహస్యమున్నది. సర్వవిద్యారాశియే గాయత్రి. దాని అధిపతియే బ్రహ్మ. బ్రహ్మవేదము. జ్ఞానము సరస్వతి. కావున బ్రహ్మకు సరస్వతి పుట్టినట్లు వర్ణింపబడినది. సూర్యుని విడచి కాంతియుండనట్లు బ్రహ్మను విడచి సరస్వతి యుండజాలదు. స్వర్గలోకమున పుణ్యమూర్తులే యుందు రని దేవతలు పాపములు లేనివారని గలదు. వేదశబ్దముల వలన జగము సృష్టింప బడినది. భూయను పదమునుండి వెలువడిన పరమాణువులు భూమండలమైనవి. భువః అను పదము నుండి వచ్చిన పరమాణువులు భువర్లోకముగా మారినవి. ఇట్లే సువర్లోకము, పితృలోకము.

ఆత్మయందే మనస్సు ఉండవలెనని ప్రాపంచిక విషయములయందుండరాదని జ్ఞానుల సిద్ధాంతము. మనస్సు అనే బ్రహ్మ వాక్కు అనే కూతురిని పొందెనను

రహస్యార్థమును సైతము పురాణమే సూచించినది. ఈ గాథ వేదమందు నై
గలదు.

మహాజ్ఞాని అయినవానికి దేహాభావము, శాస్త్రవిధులు, చిత్తవ
ఏవియు నుండవు. బ్రహ్మ మనస్తత్త్వమై శబ్దజ్ఞానమైనసరస్వతిని పొంది
చేయదలచి తన శరీరమును విడువగా అది మంచువలె వ్యాపించినది.
సమాధిస్థితినిపొందగా దేహమునుండి శక్తులుద్భవించినవని అర్థము. శరీర
సృష్టించి అందు దేవతలు ప్రవేశించిరి. చంద్రుడు మనస్సునందు, సూర్యుడు
లోను, ఇంద్రుడు బలమందు, దేహమున చతుర్ముఖబ్రహ్మయు ప్రవే
చంద్రరూపమైన మనస్సు గురుసేవచేసి అతని తారకమంత్రశక్తిని పొ
జ్ఞానులలో జరుగును. శ్రీరామగాథ వేదమందును గలదు. నియమములే త
దానినతిక్రమించినచో అధోగతి, అల్పాయువు కలుగును. సృష్ట్యాదియంద
బ్రాహ్మణులై యుండిరి. వారే గుణములందు మార్పునొందినవారై క్షత్రియు
క్రమముగా వైశ్యశూద్రులుగను మారిరి. రోగములకు జలచికిత్స, మట్టితో చి
వాయుచికిత్స, కిరణచికిత్స, ఆకాశచికిత్స అని ఐదు చికిత్సలు గలవు. ఇవని
హిందూమతమందు చెప్పబడినవి.

హిందూదేశమున క్షత్రియులందరు నశించినపిదప సహోద్దీన
మహ్మదీయ రాజు ఢిల్లీ నగరమునకు వచ్చి హిందూదేవాలయములను ధ
మొనర్చెను. ఆనాటి నుండి నూఱు సంవత్సరములు, అల్పాయుష్కులు జన్మి
మొగలు వంశస్థుడైన తిమిరలింగుడు (తైమూర్ లింగ్) విగ్రహములను పూ
రాదని సాలగ్రామాదులను తన సింహాసనమునకు సోపానములుగా కట్టించుకొ
భవిష్యపురాణమందు గలదు.[1] పిమ్మట సేవాజయుడు (శివాజీ) ఉద్భవించి
ష్కుల నుండి హిందూదేశము నుద్ధరించునని భవిష్యపురాణమున గలదు. హి
మతౌన్నత్యమును గుర్తించుటకు హిందువులందరు కృషి చేయవలయును.

1. "సాలగ్రామశిలానాంచ స్వాసనారోహణం కృతమ్" —భవి

# 23. శ్రీరామావతార రహస్యము

కలియుగమునందు శ్రీహరియొక్క షోడశనామములను జపించుటచే కలి దోషము తొలగును. బ్రహ్మదేవుని యొక రోజు మనకు ఒక ప్రపంచకాలము అగును. ఈలెక్కన బ్రహ్మకు 50 సంవత్సరములు గడచినవి. దినమున కొక ప్రపంచము చొప్పున $50 \times 360 = 18000$ ప్రపంచములీనాటికి గతించినవి. గత ప్రపంచము నందు ఏయే జీవులకు ఏయే కర్మలు, లక్షణములు సృష్టింపబడినవో ఈ ప్రపంచము నందు ఆయా జీవులకు అయా లక్షణములు సృష్టింపబడును. ఇంతవరకు పార్థివ కల్పము, కూర్మకల్పము, వరాహకల్పము గతించినవి. ప్రస్తుతము శ్వేతవరాహ కల్పము. ఇకముందు అఘోరకల్పము, రుద్రకల్పము, పద్మకల్పము, బ్రహ్మ కల్పము, ఏర్పడును. పద్మకల్పమున జరిగిన రామకథ శ్వేతవరాహకల్పమందు జరిగిన కథతో కొంచెము భేదించును. ప్రతి కల్పమునందు పురాణగాథలు ఏర్పడు చుండును వనవాసమునకు వలదని వాదించుచున్న రాముని చూచి సీత అనేక రామాయణములు జరిగినవి ఏ రామాయణమునందును సీతనువిడచి రాముడరణ్య మును పెడలలే దనును.

ఇట్లే అహల్య నదిగా ప్రవహించుచున్నదని రాముడు విశ్వామిత్రునితో నదీతీరమున విహరించినపుడు ఆప్రవాహము స్త్రీరూపము దాల్చెనని ఆనంద రామాయణమందు గలదు. ఇదీ ఒక కల్పమందలిగాథ. పూర్వప్రపంచమునందలి ఋషులనామములే ఈ ప్రపంచమందు ఋషులకు వర్తించును. దేవతలుసైతము గతకల్పమందలి నామములతో వ్యవహరించుదురు. కావున అనేక గాథలు జరిగిన వని తెలియవలయును. భుశుండుడను ఋషి పదునొకండు రాములు గడచిరని, పండ్రెండవ పర్యాయము రామగాథను సముద్రబంధనమును చూచుచున్నానని పలికెను. ప్రతి రామావతారమందు వాల్మీకి వచ్చుచుండునని కలదు. రామగాథ వేదమంత్రమందు గలదు. భరద్వాజ రామాయణము, అగస్త్య రామాయణము, విశ్వామిత్ర రామాయణము మొదలగు ఇరువదినాల్గు రామాయణములు గలవు. రామగాథ పరమపవిత్రమైనది. కావుననే రామతాపినీయుపనిషత్తునందు వర్ణింపబడి నది. వేదమున దైవకాంతులు శతకోటికలవని వర్ణింపబడినది. రుద్రాభిషేక మంత్రములయందు మూడు పర్యాయములు సహస్రశబ్దము వాడబడినది. వెయ్యని

వెయ్యిచే గుణింపగా నాలు కోట్లు వచ్చును. దేవునకు శతకోటిశక్తులు గలవని అర్థము. అన్ని పురాణముల యందలి శ్లోకములు నాలుకోట్లే. వాల్మీకి మహర్షి బ్రహ్మగానున్నపుడు నాలుకోట్ల శ్లోకములతో రామాయణమును రచించెను కావుననే రామాయణము శతకోటిశ్లోకములు. వాల్మీకి బ్రహ్మగా నుండియు శపింపబడి బ్రాహ్మణుడై జన్మించి శూద్రాచారపరుడై సప్తర్షుల బోధనల వలన జ్ఞానము పొంది 24000 శ్లోకములతో రామాయణమును రచించెను. వాల్మీకి దీనినిగూడ శతకోటి విస్తరమనియే అనును.

శతకోటి యనగా 24 అర్థము. ఒకట్లు, పదులు, వందలు అని వరుసగా వ్రాసినపుడు వందలు మూడవస్థానమందు కోట్లు 8వ స్థానమందువచ్చును. మూడును 8చే గుణించగా 24 అగును. అనగా శతకోటి యనగా 24,000 అని అర్థము. శతకోటియనగా 24 కావున సహస్రపాదములతో సహస్రాక్షులతో రాజించు దేవుడు 24 సహస్రములతో రాజించువాడని తెలుపుటకే వాల్మీకి 24000 శ్లోకములతో రామాయణమును రచించెను. ఆనందరామాయణమునందు శతకోటి సంఖ్యగల రామాయణము గలదని సూచింపబడినది. అట్టి శతకోటి మిత రామాయణము బ్రహ్మవిష్ణు శివలోకములయందు గలదని ఈశ్వరుడే తెలిపెను.

పురాణములను వ్యాసుడు రచింపలేదు. పురాణములనంతములని వేదముల యందు గలదు. వేదములు, పురాణములు దేవునినుండి కలిగినవని గలదు. అవతారమనగా పైనుండి క్రిందికి దిగుటయని యర్థము. కావున రామావతారము, కృష్ణావతారమనగా వారు దివ్యదేహములతో క్రిందికి దిగిరని అర్థము. అంతేగాని జన్మించిరనిగాదు అధర్మము నశికట్టుటకై తాను అరణ్యవాసమునకు వచ్చితినని రాముడు స్వయముగా తెలిపెను.

శ్రీరాముడు గురుకులవాసముచేయుట, పౌరుషముచే సీతను వివాహమాడుట ధర్మములు. కామము జయించినవారు మాత్రమే సత్సంతానమును బడయుదురని ధనుర్భంగమూలమున తెలిపెను. భార్యను రక్షించుకొనవలెనని పరశురామవిజయ మూలమున సూచించెను. పితృవాక్యపాలనము, భర్తను అనుసరించెడి పతివ్రతా ధర్మము, సోదరమైత్రి మొ॥ అనేక సామాజికాదర్శములు రామాయణమున సూచింపబడినవి.

దేహములు యోనిజములు, అయోనిజములు అని రెండు విధములు. శరీరము నుండి జన్మించిన వారందరు యోనిజులు, శరీరసంబంధములేక జన్మించినవారు

అయోనిజులు. అయోనిజులు సాంకల్పిక, సాంసిద్ధిక, స్వేదజ, ఉద్భిజములు అని నాల్గు విధములు. మనువుచే సంకల్పముచే సృష్టింపబడిన వారు సాంకల్పికులు. సిద్ధులు సంకల్పముచే మరొక రూపమును పొందెదరు వారు సాంసిద్ధికులు. చెమట నుండి పుట్టినవి స్వేదజములు. మొలకెత్తు వృక్షాదులు ఉద్భిజములు. అయోనిజదేహములు విడివిడిగా పంచభూతముల నుండి జన్మించును. వశిష్ఠుడు, నృసింహుడు మొదలగు వారందరు అయోనిజులే. యోనిజములు జరాయుజములు, అండజములని రెండు విధములు. నరులు, పశువులు జరాయుజములు. వీరి జన్మము నకు ముందు మావి లేక మాయు బయటకువచ్చును. పక్షులు, సర్పములు అండజ ములు. ఇవి గ్రుడ్డునుండి జన్మించునుగాన అండజము అనిపించుకొనుచున్నవి.

నరసింహుడు స్తంభము నుండి జన్మించెను. అనగా స్తంభము చైతన్యమును పొంది దేవుడాయెను. క్రైస్తవమున లోదు భార్య హఠాత్తుగా స్తంభమాయెను. ఇది పరస్పరభేదము. శ్రీరాముని జన్మమును వర్ణించుచు ఆవిరాసీత్ అని ప్రయో గించియుండుటచే స్వయముగా జన్మించెనని తెలియుచున్నది. నృసింహమూర్తి ఆవిర్భవించెనని చెప్పబడినది.

శ్రీరాముడే జలమున మునిగి దివ్యదేహముతో వైకుంఠమున కరిగెను. ఏఏజనుడు రామునితోబాటు నదిలో మునిగెనో ఆయాజనుడు మానవదేహమును విడచి విమానమునెక్కి దివ్యదేహముతో స్వర్గమును చేరెను. శ్రీరాముడు 11,000 యేండ్లు రాజ్యపాలనముగావించెను. షేతు 912 యేండ్లు జీవించెనని గలదు. అతి ప్రాచీనకాలమందలి జనులందరు దీర్ఘాయుర్దాయము గలవారని గుర్తింపవలెను. ఆదాము కాలము 6000 యేండ్లు. శ్రీరాముడు కోటి సంవత్సరముల క్రిందటివాడు. అనగా 1666 రెట్లు వెనుకటివాడు. కావున శ్రీరాముడు 11000 సం॥లు రాజ్యము చేసెననుట పరమ సత్యము ఆయుగమందలి వారు లక్ష సంవత్సరములు జీవించి యుండిరి.

రామరాజ్యమందు నాస్తికుడుగాని, అవిద్వాంసుడుగాని లేకుండెను. శ్రీరాముడు ప్రతిదినము సంధ్యావందనాదులను శివపూజనుచేసి పురాణశ్రవణము చేయుచుండెడివాడు. సామాన్యగాథలను తెలుపుచూ, ప్రజలను మెప్పించి ధనమును సంపాదించువారి వలన పురాణములు దుర్వినియోగమగును. రహస్యములను చెప్ప లేనివారు, శాస్త్రజ్ఞానములేనివారు పురాణములను చెప్పరాదు. 108 మంది రాజులు తమ కన్యలను సేవార్థమై శ్రీరామునకొసంగిరి. వారిని శ్రీరామచంద్రుడు భావించి

వారికి మోక్షము నొసంగెను. సీతను మాత్రమే ధర్మపత్నిగ స్వీకరించి ఏకపత్నీ వ్రతమును లోకమునకు చాటినాడు.

శ్రీరాముని పట్టాభిషేకదినమునకు ముందు రోజు నారదుడు విచ్చేసి పట్టాభిషేకము రాక్షససంహారమునకాటంకముగదా యనియడుగ, రావణవధార్థమై 14సం॥ దండకారణ్యమందుండగలనని, రేపు వెళ్ళగలనని తెలిపెను. కావున రాముడు సర్వజ్ఞుడు. మనుష్యునివలె రాముడున్నాడని, కాని అతడు భగవంతుడని, ఆతడు జన్మించునని తెలిసియే పౌరోహిత్యము నింద్యమైనను తాను పురోహితునిగ నుంటినని వశిష్ఠుడు తెలిపియున్నాడు. సీతను అగ్నినుంచి అగ్నిప్రవేశవ్యాజమున తిరిగి సీతను గ్రహింతునని శ్రీరాముడు తెలిపియుండుటచే ఆతడు సర్వజ్ఞుడు. శ్రీరాముడు జన్మించిన వెంటనే కౌసల్యకు శంఖచక్రగదాధారియైన శ్రీమహావిష్ణువు గోచరించినాడు. కావున ఆతడయోనిజుడని, భగవంతుడని తెలియుచున్నది.

శ్రీమద్రామాయణమునకంతయు శరీరజీవపరముగా రహస్యార్థముగలదు. మానవ దేహమే అయోధ్యానగరము. ఆత్మయే శ్రీరాముడు. పరిశుద్ధమైన మనస్సే సీతాదేవి. పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు కలసి పదికంఠములు గల రావణుడగును. ఈ ఇంద్రియాత్మకుడైన రావణుడు పరిశుద్ధమనస్సు అను సీతను ఆత్మయను రాముని నుండి విడదీసి లంకయను ప్రపంచమునకు తీసికొని వెళ్ళెను. హనుమంతుడు వాయునందనుడు. అనగా హనుమంతుడు ప్రాణావయవమునకు సంకేతము. హనుమంతుడు సీతజాడ కనుగొనినట్లే ప్రాణాయామము మనస్సు జాడ తెలిసికొనును. ఇంద్రియముల వ్యాపారములు నశించుటయే రావణసంహారము. శ్రీరామచంద్రుడు పరమాత్మకాగా సీతయే జీవుడు. జీవుడు దేహమందు ప్రవేశించుటయే సీత లంకాప్రవేశము చేయుట. అహంకారములే రావణకుంభకర్ణులు. మాయామృగముపై నాశపెట్టుకొనిన సీత యెట్లు కష్టములపాలయినదో అట్లే (బంగారము) ధనము నాశించువారును ఇక్కట్లుపడెదరు. అంతపరమాత్మ హనుమంతునివలె దూతను పంపి (మనస్సు) జీవుని ఓదార్చును. సుందరకాండయందలి రహస్యమిదియే.

నిదానముగా సంచరించు ఉచ్ఛ్వాస నిశ్వాసముల గమనించిన యోగికి దైవదర్శనము వలన కలిగెడు ఆనందము కొంచెము కలుగును. అట్లే హనుమంతుని చూచిన సీతకానందము కలిగినది.

---

# భారతీయ ధర్మ దర్పణము

## (స్వతంత్ర వ్యాసములు)

## రెండవభాగము



రచయిత

నిష్ఠల సుబ్రహ్మణ్యం

# * గురుస్సాక్షాత్పరంబ్రహ్మ

ఆర్షసిద్ధాంతంలో గురువును మించిన దైవంలేదు. గురుకృపవల్ల సర్వ కామనలు సిద్ధిస్తాయి. విద్యావిధానంలో గురువుకు ఉన్న ప్రాముఖ్యం వర్ణనాతీతం. ఈ విషయంలో మనప్రాచీనులు చాలా చెప్పారు. ఒక విద్యార్థి మహాపండితుడు కావాలంటే గురువుయొక్క అనుగ్రహం చాలాఅవసరం. "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః" అనే శ్లోకంలో గురుస్థానం గుర్తించాలి. గురువు త్రిమూర్తులతో సమానమని పైశ్లోకానికి భావం. నైష్ఠికులు పూజా విధానం ముగిశాక ఈ క్రింది పంక్తుల్ని దేవుని వద్ద చదువుతారు."

"నగురోరధికం నగురోరధికం శివశాసనతః శివశాసనతః" ఈ శ్వరశాసనా న్ననుసరించి గురువు కంటే ఎక్కువ అయినది ఏదీ లేదని భావము.

మహాభారతంలో గురుప్రాధాన్యాన్ని వివరించేకథలు ఆదిపర్వంలో ఉన్నాయి. పూర్వం ఆరుణి అనేవిద్యార్థి ఉండేవాడు. ఈతడు ధౌమ్యుడనే గురువువద్ద శాస్త్రా ధ్యయనం చేయసాగాడు. ఒకరోజు వర్షంప్రారంభమైనది. లోకంఅంతా జలమయంలా ఉన్నది. ఈ వర్షానికి పొలంగట్టు తెగి ఉంటుందని ధౌమ్యుడు శంకించాడు. వెంటనే ఆరుణిని పంపించాడు. రాత్రల్లా వర్షం కురుస్తూనే ఉన్నది. తెల్లవారాక ధౌమ్యుడు ఆరుణిని వెదకుతూ పొలానికివచ్చి ఆరుణినిచూచి సంతోషించాడు. పొలంగట్టుకి పడ్డ రంధ్రాన్ని చేతితో మూయడానికి సాధ్యంకాక తనశరీరాన్నే రాత్రల్లా అడ్డంగా ఉంచాడు ఆరుణి. ఈ దృశ్యంచూచి ధౌమ్యుడు ముగ్ధుడై ఆశీర్వదించాడు. గురువు యొక్క అనుగ్రహంవల్ల ఆరుణి సర్వవిద్యాధికుడయ్యాడు. ఇట్లే గురువుయొక్క అనుగ్రహం పొందిన మరొక ఋషి వేదపారంగతుడయ్యాడు.

గురు శాపంవల్ల కర్ణుడికి విద్యలు స్ఫురించలేదు. ఏకలవ్యుడిని ద్రోణుడు తిరస్కరించాడు. ఇలాతిరస్కరింపబడ్డా ఏకలవ్యుడు నిరుత్సాహపడలేదు. మృణ్మయ మైన ద్రోణమూర్తిని స్థాపించి విలువిద్య ఆరంభించి అచిరకాలంలోనే ధనుర్విద్యా నిపుణుడు అయ్యాడు. పరబ్రహ్మరూపులైన రామకృష్ణాదులు కూడా గురువువద్ద విద్యను అభ్యసించారు.

* సప్తగిరి, జులై-1982 ప్రకటితము.

గురువుచేనివిద్య పరిపక్వంకాదు. అన్నిశాస్త్రాల్లోనూ గురుధ్యానం ప్రస్తావ ఉన్నది. మంత్రశాస్త్ర వేదాంతశాస్త్రాలలో గురుధ్యానం చాలా అవసరం. వేదాం లకు గురువును మించిన పరబ్రహ్మలేదు. "దేవేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే కశ్చన" అనేది వేదాంత శాస్త్రాలలో ప్రసిద్ధమైనవాక్యం. అంటే భగవదాగ్రహా గురైన వాడిని గురువు రక్షించగలడు. కాని గుర్వాగ్రహానికి గురైనవాడిని దేవు ఉపేక్షిస్తాడు. గురువు తర్వాతే తనని ధ్యానించమంటాడు భగవానుడు.

జగద్గురువులైన శ్రీ శంకరులకు గోవిందభగవత్పాదులనే గురువున్నారు గురుద్రోహం చెయ్యరాదు, ఇదిభగవద్ద్రోహం కంటే పాపదాయకము. ఈవిషయంలో శ్రీ శంకరాచార్యులవారి గురుస్తోత్రం వినండి.

"ముఖే శాస్త్రవిద్యా కరే శస్త్రవిద్యా
కవిత్వాదిగద్యం సుపద్యం కరోతి.
గురోరంఘ్రిపద్మే మనో వైన లగ్నం
**తతః కిం ? తతః కిం ? తతః కిం ? తతః కిం?"**

అనగా శాస్త్రపండితుడైనా, శస్త్రవిద్యానిపుణుడైనా, కవితా రచనలో సిద్ధ హస్తుడైనా, మనస్సు గురుపాదాలపై లగ్నంకాకపోతే వాడెందుకూ కొఱగాడు. వాడి జ్ఞానం బూడిదలోపోసిన పన్నీరే అనిభావం. ఇట్లే గురుమహిమను వర్ణిస్తూ చాలా శ్లోకాలు చెప్పారు. మహావైయాకరణులైన శ్రీ భట్టోజీ దీక్షితులువారుకూడా "స్మారం స్మారం గురోర్వచః" అని గురువాక్యాన్ని స్మరించినట్లు సవినయంగా పలికారు. "ఇత్యస్మద్గురవః" అంటూ శాస్త్రకర్తలుకూడా గురుసిద్ధాంతాల్ని సవినయంగా శాస్త్ర గ్రంథాలలో పొందుపరచారు.

"యస్య దేవే పరాభక్తిః యథాదేవే తథాగురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥ "

అనేది భారతీయ సంస్కృతికేకాక విశ్వసంస్కృతికే మూలసిద్ధాంతము. భగ వత్సమానుడిగా గురువును ఎవడు ధ్యానిస్తాడో వాడికి శాస్త్రార్థాలు స్ఫురిస్తాయని దీనిభావము.

# * కాళిదాసు-భారతీయ దృక్పథము

భారతీయుల సంస్కృతిని ప్రతిబింబించు కవిత నల్లగల కవులలో కాళిదాసు గొప్పవాడు. సర్వకాలములయందు అజాఖ్యమై వెలుగొందు ఆర్ష సంస్కృతి, భారతీయుల జీవనము, దానిలక్ష్యము ఈతని కావ్యములయందు గోచరించుచున్నవి. భారతీయుల జీవనమునకుగల ప్రధాన లక్ష్యము మోక్షప్రాప్తి. దానిని సాధింపవలె నన్న చక్కని నడవడి, సత్కార్యాచరణము అవసరములు. కాళిదాసు రఘువంశ రాజుల వర్ణించెడు మిషతో భారతీయుల జీవనమెట్లుండునో సూచించినాడు. అట్టి జీవనవిధానమే మనము అభిలషించుట యుక్తము. ఈతని కావ్యములలోని భారతీయ జీవన లక్ష్యమును రఘువంశకావ్యాధారమున సంక్షిప్తముగ వివరించుటయే ప్రస్తుత వ్యాసముయొక్క ఉద్దేశ్యము.

రఘువంశమున "సోఽహమా జన్మశుద్ధానామ్" అని ప్రారంభించి కొన్ని శ్లోకము లో రఘువంశ రాజులందరియందు సామాన్యముగానుండు సద్గుణములను ప్రస్తావించినాడు. వారందరూ మాతృగర్భమున పడిననాటినుండియూ తల్లిదండ్రులచే పుంసవనాది సత్వసంస్కారములను పొందియుండిరట. ఇట్టి సంస్కారములన్నింటినీ యథావిధిగా పొందుటవలన చక్కనిమానసిక సంస్కారమేర్పడును. ఈనాటివారలకు మానసికబలము లేకుండుటకు కారణము ఇట్టిసంస్కారములు లోపించుటనియే చెప్ప వచ్చును. ఆ రాజులు కార్యము నెఱవేఱువరకును ప్రయత్నించుచునే యుందురు. వారిప్రయత్నమెన్నడునూ నిష్ఫలము కానేరదు. ఇది సత్పురుషుల లక్షణమే. "నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు" అనిగదా పెద్దలనానుడి. ఇట్టికార్య శూరత్వము వారియందు కలదని తాత్పర్యము.

వారందరూ శాస్త్రమందు చెప్పబడిన విధముగా ఆహితాగ్నులుగ ఉండెడివారు. అగ్నిని ఆరాధించుచూ గృహస్థ ధర్మములను చక్కగా నెరవేర్చు చుండెడివారు. అతిథులు వచ్చిన యెడల వారిని ఫలపుష్పాదులచే సత్కరించుటయేకాక వారికోరికలను తీర్చివంపెడి స్వభావము కలవారు.

అపరాధము చేసినవారిని వారి అపరాధమును విచారించి, అట్టి అపరాధమునకు తగిన విధముగా శాస్త్రపరిశీలనము చేసి శిక్షలను విధించెడివారు. ధర్మశాస్త్రములను

---

* పాపయారాధ్య, 15-8-1987 ప్రకటితము

కూలంకషముగా చదవనిచో ధర్మసూక్ష్మములు తెలియవు. అధ్యయనము చేయుటయే కాక, పరమధార్మికునిగా జీవించును. ధర్మమును ఉపాసించినవారికే ధర్మసూక్ష్మములు తెలియును. ఆ రాజులందరూ పరమధార్మికులుగ ఉండెడివారు. ఏయే కాలముల యందు ఏ యే పనులను చేయుటధర్మమో, ఆయాపనులను చేయుటయందు ఎట్టి ఆలస్యమును పొందక జాగ్రత్తగా ఉండెడివారు. ఆలస్యమే మానవులకు ప్రథమ శత్రువు అనదగి యున్నది. ఆలస్యమును జయించుటయే శ్రేయోదాయకము

ధనసంపాదన ముఖ్యముకాకున్ననూ దోషముకాదు. వారు ధనమును సంపాదించెడివారట. ఎందులకో తెలియునా ? త్యాగము చేయుటకే ధనమును సంపాదించి దానిని అర్హులకు దానముచేయుటయన్న ధనమును సద్వినియోగము చేయుటయే అగును. నేడు ధనమును అధర్మముగా నార్జించుచున్నారు. అంతేకాక దానిని అనేక విధములుగా దుర్వినియోగము చేయుచున్నారు. ఇంకనూ ఆ రాజులు మితముగానే మాట్లాడెడివారట. వారికి సంభాషణా చాతుర్యములేకకాదు. అ సత్యమును పలుక వలసివచ్చునేమోయని వారట్లు మితసంభాషణము చేసెడివారు. సత్యమును పాలించుటయే వారి ముఖ్యోద్దేశ్యము. వారు రాజులను జయించుటకు వెళ్ళెడివారు. రాజులను జయించినచో కీర్తిలభించుననెడి సదుద్దేశమే కాని రాజ్యమును ఆక్రమింప వలెనను పరుద్దేశము మాత్రము వారికిలేదు. బ్రహ్మచర్యాశ్రమమును పాటించి, గృహస్థాశ్రమమును స్వీకరించెడివారు. కేవలము కామమును తీర్చుకొనుటకే వారట్లు చేసెడివారు కాదు. వివాహము చేసికొనుట వలన మంచి గుణవంతుడైన పుత్రుని పొందవచ్చును. గుణవంతుడైన పుత్రునివలన పితృదేవతలకు తృప్తికలుగును. సత్సంతానము వలన అనేక ప్రయోజనములు ఉన్నవి. నేడు అనేకమంది కేవలము కామము అకే వివాహమని భావించుచున్నారు. సత్పుత్రుండుండుట వలన ధర్మాచరణము సంపూర్ణమగును.

బాల్యముననే వారు కఠినమైన పరిశ్రమచేసి ఏకాగ్రతతో విద్యలను అభ్యసించెడివారు. బాల్యమున విద్యను నేర్వక యౌవనమున విద్యను అభిలషించుట అవివేకము. పరిశ్రమ, ఏకాగ్రతలేక బాల్యమున విద్యను అభ్యసింపకయే విద్యా

వంతులమనుకొనుచు కొందరు సంతృప్తి పడుచున్నారు. అట్టి దుర్దశ సమాజమునకు రాకూడదనియే కవి వాంఛించుచున్నాడు. ధర్మ సుఖముల అనుభవించుట దోషము కాదని కవి సమాజమునకు హెచ్చరించుచున్నాడు. పై లక్షణమును పరిశీలింపక ఎట్లయినను సుఖముల అనుభవింప వలెనని ఆరాటపడుచున్న నేటి సమాజమునకు ఈతని కవిత్వము మిక్కిలి అవసరము.

వార్ధక్యము వచ్చిన పిమ్మట సుఖములను విడిచి ఇంద్రియ నిగ్రహముతో మునులవలె జీవించెడివారు. వృద్ధులయిననూ సంసార సుఖములను విడువక ఇంద్రియ చాంచల్యముతో ప్రవర్తించుట కూడదనిపని అనియూ చెప్పుచున్నారు. ఇక సామాన్యులన్నచో భగవంతుని స్మరింపరు. మృత్యుసమయమున కూడా స్మరించెడి శక్తి వీరికి ఉండదు. లేకున్నపోనిండు వీరి శరీరముకూడా అనారోగ్యములతో పీడింపబడును. ఆ రాజులు నియమవంతులగుట వలన ఎట్టి అనారోగ్యము లుండెడివి కావు. వారు తమ యోగశక్తితో శరీరమును విడిచెడివారు.

ప్రజల క్షేమము కొఱకే పన్నులను వసూలు చేయుటవారిపని. వా రాధనము నంతయూ ప్రజోపయోగమునకే చేసెడివారు. పాలకులన్నచో నిట్లుండ వలయును గదా ! శాస్త్రములలో చెప్పిన విధముగానే వారు ప్రతిపనిని చేయుచుండెడివారు. ప్రతి పనిని శాస్త్రముతో ఆలోచించి చేయవలనుగాని స్వతంత్రముతో చేయరాదు. ఆశ లేకయే ధనమును సంపాదించుట సామాన్య విషయముకాదు. అనాసక్తులై సుఖములను అనుభవించుట వారి బుద్ధి వైభవమునకు తార్కాణము.

జ్ఞానము, మౌనము, ఓర్పు, సామర్థ్యము, త్యాగము, ఆత్మప్రశంస లేకుండుట ఇట్టి సద్గుణములన్నియూ వారియందు కలవు. ఇట్టిగుణములచేతనే వారు మహోత్కృష్టులైరి. ప్రజలు తప్పు చేసినచో శిక్షించి వారికి మంచినినేర్పి దీర్చి దిద్దెడివారా నాటిరాజులు. అవసరమున్నచో ఆశ్రితుల భయము పోగొట్టి రక్షించెడివారు. ప్రజల రక్షణభారమును వహించుచూ ప్రజలచేత తండ్రివంటివారని కీర్తింపబడుట ఆనాటి పాలకుల లక్షణము.

నగరమున దొంగతనము లుండెడివికావు. దొంగతనము చేయవలసిన దీన స్థితియే ఎవరికీ లేకుండుటచే అట్టిపనియే లేకుండా పోయినది. అట్టిమంచి స్థితినివారు కల్పించిరి. తమకు శత్రువు అయిననూ, ఆతడు ఉత్తముడైనచో తప్పక గౌరవించెడివారు. మందు చేదుగా ఉన్ననూ శరీరమునకు మేలుచేయునుగాన బుద్ధిమంతుడు స్వీకరించును. తమకు బంధువు అయిననూ, ఆశ్రితుడైననూ, దుష్టుడైనచో వానిని వెంటనే పరిత్యజించుచుండిరి. ఒకవ్రేలు దుష్టవ్యాధిగ్రస్తమైనదనుకొందము అదిశరీరములోని భాగమైనను దానిని ఖండించుటయే యుక్తముగదా !

ఇట్లు వర్ణించుచూ కాళిదాసు ప్రాచీన "భారతీయుల జీవన విధానము-దాని లక్ష్యమును" సూచించి నేటి భారతీయులు అట్లుండవలెనని బోధించుచున్నాడు. ఇతరులు మనలను పరిహసింపక ముందే కోల్పోయిన "మన జీవన విధానమును" పునరుద్ధరించుకొని ఐహికాముష్మిక సుఖములను పొందుదముగాక.

# * మంత్రశాస్త్రము

మంత్రశాస్త్రమును గూర్చి ఎంత వ్రాసినను వ్రాయవచ్చును. కొంతవరకు ఇందు పరిచయము చేయబడినది. ఇందు వివరించి చెప్పవలసిన విషయములు చాలా కనబడినవి. కాని "14"చోట్ల మాత్రమే వివరించితిని. ఇక సమయమును వినియోగించలేక విడచితిని. ఇందు దృష్టిని గురించి, అగ్రభాగమును గురించి, కాలమును గురించిన వివరణ ప్రత్యక్ష ప్రమాణములతో ఉదాహరింపబడుట విశేషం. పాఠకులీ వ్యాసమును చదివి కొంతవరకు తృప్తిని పొందగలరు.

—సంపాదక (ఆరాధన)

అనేకవిధ విజ్ఞానములకు నిలయమైన ఈ భారత పుణ్యభూమిలో విజ్ఞాన దృష్టిగల అనేక మేధావులు ఉద్భవించియుండిరి. వారు వివిధ విజ్ఞానములనిచ్చు శాస్త్రములను నిర్మించిరి. అట్టి శాస్త్రములలో మంత్రశాస్త్రము ప్రధానమైన గుప్త విద్య. మంత్రమనగా నేమి ? మననము చేయుటచే మననము చేయువానిని రక్షించునది మంత్రము. మననమనగా అనేకపర్యాయములు జపించుటయే. మంత్రము అను పదమునందు "మత్రి ఆలోచనే"అను క్రియ గలదు. "మత్రి"యను సంస్కృత క్రియకు ఆలోచించుట అని అర్థము. "నాస్తిమంత్రో మహీభృతామ్" అని మాఘ మహాకవి ప్రయోగించియుండెను. అచ్చట మంత్ర మనగా రాజనీతి అని అర్థము. ఆ అర్థములలో కూడా ఆలోచించుటయే అని అర్థముకలదు. ఆలోచించుట అనగా మననము చేయుటయే. తంత్రశాస్త్రముకూడా మంత్ర శాస్త్రములోనే చేరును తంత్రమనగా నేమి అను ప్రశ్న వచ్చును. "తంత్రం ప్రధానే సిద్ధాంతే" అని నిఘంటువు చెప్పుచున్నది. తంత్రమనగా ప్రధానమైనదని అర్థము. మంత్ర శాస్త్రము ప్రధానమైనదే కావున తంత్రశాస్త్రముకూడా మంత్రశాస్త్రములోనే చేరుతుంది.

మంత్రములను జపించుటచేత శారీరక బాధలు, మానసిక బాధలు తొలగును. దేవతలచేత, మునులచేత, సజ్జనులచేత శపింపబడిన మనుష్యులు మానసిక బాధలచేత పీడింపబడుదురు. అట్టి బాధలు అనేకములు. తనయందు తనకు అస

* ఆరాధన, డిశంబరు, 1984 ప్రకటితము

హ్యము, తక్కువభావముంచుట. దీనినే "ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు" అందు
గర్వము తనపై తనకు విపరీతముగా గొప్ప అభిప్రాయముండును. దీనిని మాన
శాస్త్రవేత్తలు "సుపీరియారిటీ కాంప్లెక్సు" అందురు. మిక్కిలి మిక్కుటమైన వ
ప్రతీకారవాంఛయుండును. ఇది దర్మవిరుద్ధముగా ఉన్నచో దోషము. దీ
"రిటలియేషన్ కాంప్లెక్స్" అందురు. ఇతరులను మాటిమాటికి హింసించుచూ
హింసతో తాము తృప్తిపడుట ఇది "సాడిజమ్" అనబడును. దీర్ఘవిచారమున
దోషమే. ఆధునిక మానసిక శాస్త్రవేత్తలుకూడా ఇట్టి మానసిక బాధలు కల
మనస్సులకు సంఘటనలచే ఘర్షణలను కల్పించి పోగొట్టుచుందురు. మంత్రముల
జపించుటచే మనస్సులో సంఘర్షణ కలుగును. ఇట్టి సంఘర్షణ వలన తనయం
నిగూఢముగానున్న గుణములు బయటకు వచ్చును. లేదా వానియందు లేని మ
గుణములు కలుగును. అటుపిమ్మట ఇట్టి బాధలు కలవారి బాధలనుండి విము
లగుదురు. కావున మంత్ర శాస్త్రము వ్యర్థమనరాదు.

మానసిక బాధలు అనేకములు. అట్టి బాధలను పోగొట్టు ఘర్షణలు అ
ములు. కావుననే మంత్రశాస్త్రమునందు అనేక దేవతలు వర్ణింపబడిరి. మనస్సున
కలుగు ఘర్షణమే శక్తి అనబడును. ఇట్టిఘర్షణ దైవానుగ్రహము లేనిదే కలుగ
మనస్సు సాధనమగుటచే ఇట్టి సాధనమును పొందు జ్ఞానమగు ఆత్మకర్తయ
తెలియుచున్నది. సంకల్పము లన్నియూ భగవంతుని వలననే కలుగును. కావ
ఇట్టి సంఘర్షణముకూడా భగవంతుడే కలిగించును. భగవదనుగ్రహము లేకుండుట
ఆధునాతన మానసిక శాస్త్రవేత్తలు కల్గించు కొన్ని ప్రక్రియలు వ్యర్థమగుచున్న
దైవానుగ్రహము వలన ప్రారబ్ధము తగ్గితే మానసిక శాస్త్రజ్ఞులుచేయు కార్యక్రమ
సఫలమగును ఇందువలననే మంత్ర శాస్త్రమునందు అనేక దేవతలు వర్ణింపబడి

పూర్వము భాస్కరరాయలనే మహాపండితుడు లలితాసహస్రనామముల
భాష్యమును వ్రాసెను. లలితాసహస్రమున, "చతుష్షష్టికోటియోగినీ గణసేవిత
అనునామము కలదు.

అరువదినాలుగు కోట్ల యోగినీ గణములచే లలితా త్రిపురసుందరి సేవి
బడుచున్నదని ఆనామమున కర్థము. ఇట్లే భాస్కరరాయలవారు వ్యాఖ్యాన
చేయగా కొందరు విద్వాంసులు అంతమంది దేవతలు ఉండుట అతిశయోక్తియేగా
సత్యముకాదని వాదించిరి. అప్పుడు భాస్కరరాయలవారు మంత్రజలమునే వ

కన్నులను తడవగా వారు అరువదినాలుగుకోట్ల యోగినీ గణములను చూచి ఆశ్చర్యమును పొందిరి. కావున అనేక దేవతలు ఉండుట సమంజసమే. ఈ శక్తులే తార, కర్ణపిశాచిని, మధుమతి, ప్రత్యంగిర, శారద మొ॥ పేర్లచే వ్యవహరింపబడుచున్నారు.

నిరంతరము జపించుటచేత మంత్రముసిద్ధించును. శాస్త్రమునందలి విషయములను చక్కగా పాటించుచూ, గుణవంతుడు, నిర్మలుడైన, వానికి మాత్రమే మంత్రము సఫలమగును. సాధకుడు సద్గుణవంతుడు కానిచో మంత్రము సిద్ధింపదు. ఈరీతిగా మంత్రమును సాధించుకొన్న సాధకుడు ఆత్మయందున్న శక్తిని బయటకు ప్రసరింపచేయును. ఇట్లు శక్తిని బయటకు తెప్పించుటకు "కేశముల కొనలు గోళ్ళ-చివరలు-చూపు" ఉపయోగపడును. అగ్రభాగములయందు ఆకర్షించు శక్తి యుండునని "మెస్మర్" అను మహానుభావుడు చెప్పెను. కావుననే భూతములను వదల్చునప్పుడు సాధకులు వేపాకు చివరలను ఉపయోగింతురు. ఇందుకే ఋషులు కేశములను వణములను త్రుంచరు. ఈ శక్తిని చూపుద్వారా ప్రసరింపచేయుదురు. చూపుద్వారా శక్తి ప్రసరించుటను విషయమున కొంత చెప్పవలసియున్నది.

చూపుద్వారానే మనుష్యుడు వస్తువుల యథార్థ జ్ఞానమును గ్రహించును. ఇతరుల భావములు కూడా చూపు ద్వారానే మనస్సును చేరును. భగవానుడగు శంకరుడు కూడా మన్మథుని చూపుద్వారా దహింప చేసెను. చూపు భావమును తెలియచేయుననుటలో సందేహమేలేదు. చూపుతోడనే కౌశికమునికూడా కాకిని దహింపచేసెను. జంతువుల చూపులు అనేక భావములను తెలియచేయును. గ్రద్ద చూపులో తీవ్రత్వము, పిల్లి చూపులో అసూయ, కోతిచూపులో చాంచల్యము, పాము చూపులో ఉగ్రత్వము, గుడ్లగూబ చూపులో వస్తువును చూచుటయందలి శక్తి కలదు.

కుక్క చూపులో విశ్వాసము కలదు. ఇట్లు ఒక్కొక్క జంతువు చూపులో ఒక్కొక్క భావం అధికముగా కలదు. ఒక్కొక్కసారి ఆ భావం అనుకూలమగును. ఒక్కొక్కసారి ఆ భావము ప్రతికూలముగ ఉండును. అనుకూలభావమును గ్రహింపవలయును ప్రతికూల భావమును గ్రహింపరాదు. వ్యక్తియందు ప్రతికూలముగనున్న భావమే అనుకూలముగా మార్చబడినచో ఆవ్యక్తి దోషరహితుడై గొప్పవాడగును. కోతియందున్న చాంచల్యముపోయి అది ఏకాగ్రతగా

మారినచో హనుమంతుడగును. ఆంజనేయుడు స్థిరుడే. సర్పమందలి ఆగ్రహ పోయి శాంతము కలిగినచో భగవంతుడగు సుబ్రహ్మణ్యుడగును. గ్రద్దయందల తీవ్రత ధర్మబద్ధమైనచో గరుత్మంతుడగును.

మంత్రశాస్త్రము హేతుబద్ధమైనది. ప్రయోజనము స్పష్టముగా కనిపించును పూర్వము అన్నిగుణములుండియూ ఒకానొక దోషముచే బాధపడుచున్న వాని చూచి యోగులు మంత్రమును ఉపదేశించెడివారు. పిమ్మట మంత్రమును జపింపగ వానియందలి దోషముపోయి వాడు గొప్పవాడగుచున్నాడు. ఇట్లు ప్రయోజనము స్పష్టమే.

అట్లయినచో మంత్ర శాస్త్రంలో కాలనియమందేనికి? అనే ప్రశ్న వస్తుంది కాలము అవసరము. కాలమే మనస్సును నియమిస్తుంది. ప్రకృతిలో భాగాలైన చెట్లుకూడా కాలాన్నిబట్టే చిగిర్చడం, పుష్పించడం జరుగుతూంది. అమావాస్యా పూర్ణిమలయందే కొందరి బుద్ధి ప్రకాశవంతమగును. కొందరి మనస్సు మందకొడి తనమును పొందును. ఈరోజులయందే ఉన్మాదులకున్మాదము హెచ్చగుచుండును. సముద్రముకూడా ఈదినములయందే ఆటుపోటులకు గురిఅగును.

ఓషధులు ఈ దినములయందే ఫలించును. ఈ దినములయందే పాములు కూడా బుద్ధిమాంద్యమును పొంది మత్తుగా ఉండును. కావున బుద్ధిపై ఆధారపడి జీవించెడివారలకు బుద్ధియందలి ఘర్షణ ఈ రోజులయందే కలుగునని స్పష్టముగా తెలియుచున్నది.

చంద్రునకు మనస్సుకు సంబంధమున్నదను విషయము శాస్త్రములయందు కలదు. 'చంద్రమామనసోజాతః' అనెడి వేదముప్రమాణము. కావుననే చంద్రుడు మనస్సునకు కర్మయై మనస్సును నడిపించును. లఘుజాతకగ్రంథమందుకూడా "చంద్రమాశ్చిత్తమ్" అని చంద్రుడే మనస్సని చెప్పబడినది. చంద్రునివృద్ధి క్షయముల ఆధారముగా గొనియే స్త్రీల బుద్ధియందునూ పరిణామము కలుగును. బుద్ధియందలి మార్పువలననే స్త్రీలకు రజోదర్శనమగును. చంద్రునకు రజస్సునకు సంబంధములేదని భావింపరాదు. "చంద్రారాక్తవసృగస్థిని" అని చంద్రుడు రక్తమునకు అధిపతియని జ్యోతిశ్శాస్త్ర గ్రంథములయందు కలదు. చంద్రునకు, రజస్సునకు, సంబంధమున్ననూ బుద్ధియందు మార్పువచ్చుననుటలో ప్రమాణములేదని భావింపరాదు,

రజోదర్శన కాలమునందు స్త్రీల బుద్ధిలో మార్పువచ్చుననెడి విషయమును పాశ్చాత్యులు సైతము అంగీకరించినారు. కావున కాలము బుద్ధియందలి మార్పులను తెచ్చునను విషయము సిద్ధించుచున్నది. బుద్ధియందలి బలమైన మార్పువలననే మంత్రజపము సిద్ధించును. కావున మంత్రములకు కాలవిశేష నిర్ణయము అవసరము.

జపము చేసిననూ ఫలము సిద్ధించుటలేదుకదా అనినచో సమాధానము కలదు. సంపూర్ణముగా జపహోమాదులు ఆచరించిన గుణవంతునకు మాత్రమే మంత్రములు సిద్ధించును. మంత్రముల వలన దేవతలను స్మరించుటయేకదా జరుగును. మంత్రములు లేకుండగనే దేవతలను స్మరించుకొందము అని భావింపరాదు. మీమాంసా శాస్త్రమునందలి నియమవిధి మంత్రములచేతనే దేవతలను స్మరింప వలయునని చెప్పుచున్నది.

ఆహారమును విడిచి సమాధులయందున్న నరులు సిద్ధిని పొందెదరు. సమాధియందున్నవారి శరీరంలో రసాయనిక చర్యలు జరుగునని నిర్ణయింపబడినవి. జపహోమతర్పణ భోజనములును నిర్వహించిన మనుజుడే మంత్రములను ప్రయోగించుటయందు సమర్థుడగును. సంఖ్యకంటె ఎక్కువగా మంత్రమును జపించినచో దేవతలు కోపగించెదరు. దేవతలు ప్రకాశించు స్వభావము కలవారగుటచే కన్నులకు గోచరించరు. ఏకాగ్రత సిద్ధించుటకే దేవతలకు రూపములు వర్ణింపబడినవి. మంత్రజపము చేసియున్న వ్యక్తికి బుద్ధియందు దైవానుగ్రహము వలన శక్తులు ఉద్భవించును. శక్తులు మనోరూపములగుటయే ఇందుకు కారణము.

ఈశాస్త్రమునందే గురువే దేవునికంటెను గొప్పవాడు. ఈ మంత్రశాస్త్రము నందు, ప్రమాణములైన గ్రంథములు అనేకము కలవు. మహీధరుడు వ్రాసిన శ్రీమన్మంత్రరత్నాకరము గొప్పది. భగవదంశ గల మహీధరుడు సర్వదేవతల మంత్ర ధ్యాన మంత్రజపాది వ్యవహారములను చాలా పరిశ్రమచేసి నిరూపించెను. త్రివిక్రమభట్టు మంత్రరత్నమంజూషను రచించెను. మంత్రరత్నాకర మంజూషలో దీక్షాదిపటములయందు విషయమంతయూ సవిస్తరముగా నిరూపింపబడినది.

మంత్రదీక్షను గ్రహించు సమయమున సాధకులు నామమందలి అక్షర సంఖ్యను లెక్కింపవలయును. మంత్రాక్షరములతో పొందికను చూడవలయును. మంత్రములయందు బాలవృద్ధభేదములు, స్త్రీపురుషభేదములును కలవు. ఇవి పరిశీ

లింపబడవలయును. మంత్రాలకు నక్షత్రాది భేదాలు కూడా గలవు. మంత్రములను జపించిన వ్యక్తి కొన్ని సమయములందు విరుద్ధఫలములను కూడా పొందును. నిత్యాతంత్రంలో సాధకుని అక్షరాలతో సిద్ధారిశోధన చక్రపరిశీలన చెయ్యాలని చెప్పబడింది. ఆశోధన ప్రకారం బాగుంటేనే ఆమంత్రదీక్ష స్వీకరించాలి. మంత్రాలు సిద్ధములు, సాధ్యములు, సుసిద్ధములు, అరులు అని నాలుగు రకాలుగా ఉంటాయి. సిద్ధారిశోధన చక్రపరిశీలన చేసి గురువు ఏమాత్రం స్వీకరించాలంటే దానినే స్వీకరించాలి. ఈ చక్రము ద్వారా పరిశీలింపకయే శత్రురూపములైన మంత్రాలను జపిస్తే సాధకుడే నశిస్తాడు.

మంత్రం జపించాక ఎదురయ్యే సంఘటనలను నిశ్చలుడై సాధకుడు ఎదుర్కోవాలి. ఆ సంఘటనను ఎదిరించి నిలబడగలిగితే సాధకుని బుద్ధిలోని దోషం పోవడం వలన సిద్ధి జరుగుతుంది. ఇంద్రియాలను సక్రమంగా నియమించి ఎదుర్కొనలేకపోతే మతిభ్రమణం కలుగవచ్చు. ఇది ప్రత్యక్షముగనే తెలియుచున్నది. నిత్యాతంత్రంలో కలియుగంలో కొన్ని మంత్రాలే సిద్ధిస్తాయని చెప్పబడింది. అవిగాక ఇతర మంత్రాలు జపిస్తే ఫలితం ఉండదు.

మంత్రం జపించి నివేదన చేసి తినవలసిన పదార్థంకూడా ఉపయోగడేదే. వంధ్యాత్వం పోవడానికి శ్రీకృష్ణ మంత్రం జపించి నవనీతం నివేదనచేసి తినాలని చెప్పబడింది. నవనీతం వంధ్యాదోషం పోగొడుతుందని నవీనులైన ఈ నాటి వైద్యులుకూడా అంగీకరిస్తున్నారు. తంత్రశాస్త్రంలో బదనికలు కూడా వర్ణింపబడ్డాయి. దీన్నే సంస్కృతంలో "వందాకమ్" అంటారు. దయామయుడు శంకరుడు తంత్రశాస్త్రములను పార్వతికి ఉపదేశించెను. ఇట్టి తంత్రశాస్త్ర గ్రంథాలలో కులార్ణవ తంత్రము, జ్ఞానార్ణవ తంత్రము, క్రియోద్దేశము మొదలైనవి ముఖ్యమైనవి. తంత్రశాస్త్రము సృష్టి ప్రారంభము నుండి యుండుటచే ఇతరశాస్త్రముల కంటె ప్రాచీనమైనది.

ఈశ్వరుడు చెప్పిన క్రియోద్దేశంలో ఓషధులను తినవలెనని కూడా చెప్పబడింది. నాగేశ్వరీ వేరును మంత్రించి తినుటచే ఉదరరోగం తగ్గుతుందని చెప్పబడింది. ఈ మూలికల వలన ఈ రోగములు తగ్గునని వైద్యులు అంగీకరించియే యుండిరి. కావున మంత్రశాస్త్రము సహేతుకమే. ప్రయోజనము కూడా కన్పడుచున్నది. శ్రీకృష్ణ విద్యావాగీశ భట్టాచార్యుడు షట్కర్మ దీపికను రచించెను. శాంతి,

వశ్య, స్తంభన, విద్వేషోచ్చాటన, మారణములు, షట్కర్మలని ప్రతిపాదింపబడినవి.

సిద్ధనాగార్జునుడు కక్షపుటతంత్రమును రచించెను. యోగులకిది మిక్కిలి ఉపయోగకరము.

''యశ్శాంతః పరమాలయః పరశివః కంకాల కాలాంతకః
ధ్యానాతీత అనాది నిత్యనిచయః సంకల్ప సంకోచకః।
ఆభాసాంతర భాసకః సమరసః సర్వాత్మనాబోధకః
సోఽయం శర్మదదాతు నిత్యజగతాం విద్యాది సిధ్యష్టకమ్॥

అనునది కక్షపుట తంత్రమందలి ప్రారంభశ్లోకము. ఈతడు బౌద్ధుడనియూ శ్రీపర్వతము వద్ద నివసించెనని చారిత్రకుల తలంపు ఈతడు రసాయనకశాస్త్రంనందు గొప్ప పరిశ్రమ చేసెను. ఇంద్రజాల తంత్రము, దత్తాత్రేయ తంత్రము, మొ॥నవి శంకరుని నోటినుండియే వెలువడినవి.

త్ర్యక్షర మృత్యుంజయ విధానమను పేరుగల గ్రంథమొకటి గలదు. ఇది మృత్యుంజయుడైన శంకరుని గూర్చి తెలుపును. అపమృత్యుదోషములను పోగొట్టుటకు ఉపయోగపడును. కవులు, మేధావులు, ప్రాచీనకాలమున మంత్రబలము వలననే వారి వారి వ్యాపారములయందు రాణించి కీర్తిని పొందిరి.

ఈరీతిగా మంత్రశాస్త్రము ఉపయోగకరమైనదే, సహేతుకము, అన్ని శాస్త్రములకంటె ముఖ్యమైనదని తెలియుచున్నది. సహృదయులీశాస్త్రమును గుర్తించెదరుగాక.

(ఆకాశవాణి-విజయవాడ వారి సౌజన్యముతో)

# * పితృదేవో భవ

భారతీయ సంస్కృతిలో తండ్రికున్న స్థానం మహోన్నతమైనది. "పితృ దేవోభవ" అనే తైత్తిరీయోపనిషద్వాక్యం పితృపాలనాన్ని తనయులకు విధిస్తుంది. పితా దేవః యస్యసః తథాస్యాః అని అర్థం. అంటే తండ్రినే దైవముగా భావించుమని అర్థము. వేదాలు ప్రపంచ సంస్కృతికే మూలస్తంభాలని చెప్పవచ్చు. ఇవిమానవులకు నిత్యనైమిత్తిక కర్మలను విధిస్తున్నాయి. పితృదేవతలను ప్రత్యక్షంగా సేవించడమే కాక వారు స్వర్గాన్ని చేరిననాటినుండి తర్పణాలు, శ్రాద్ధాలవలన వారిని తృప్తికలిగించాలనికూడా శాస్త్రాలు చెప్పుచున్నాయి. ఈవిషయంలో వేదాలు శాసిస్తున్నాయి కూడా.

వివాహం చేసుకొని గృహస్థు అయిన ప్రతివ్యక్తి ప్రతిరోజు పంచమహా యజ్ఞాలను చేయాలి. వీటిలో పితృ తర్పణంకూడా ఉన్నది. ఈ విషయంలో మను ధర్మశాస్త్రంలోని ఈ శ్లోకం ప్రమాణంగా నిలుస్తుంది.

"అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్।
హోమోదైవో బలిర్భౌమో నృయజ్ఞోఽతిథి తర్పణమ్" ॥

వేదాలను బోధించటం, తర్పణాలతో తండ్రిని తృప్తిపరచడం, దేవతాహోమము, బలి, అతిథులను పూజించడం అనేవి ఈ పంచమహాయజ్ఞాలు. ఇట్లు గృహస్థులు ఆచరించే పంచయజ్ఞాలలో పితృతర్పణాన్ని కూడాచేర్చి పితరులకు ఉన్నతస్థానాన్ని సూచించారు మన ప్రాచీనులు.

శ్రీమద్రామాయణం ఆదికావ్యమనే విషయం అందరికీ తెలిసినదేకదా. శ్రీరామచంద్రుని పితృభక్తిని అనేక విధాలుగా నిరూపించాడు వాల్మీకి. వేదాలలో చెప్పిన "పితృదేవో భవ"అనే వాక్యాన్ని బాగా వివరించి నిరూపించింది శ్రీమద్రామాయణం. అందుకే వాల్మీకి రామాయణము సాహితీ పరంగానేకాక ఆధ్యాత్మికంగాకూడా మహోన్నతమైన స్థానాన్ని పొందింది. శ్రీరాముని పితృభక్తి, పితృవాక్యపాలనం

*పాపయారాధ్య, 29-8-1987 ప్రకటితము

అనన్య సామాన్యాలు. తండ్రిమాటను జవదాటక రాజ్యాన్ని వదలి వనాలకు వెళ్లడం మహోన్నతమైన కార్యం.

పితృమాహాత్మ్యాన్ని గూర్చి శ్రీరాముడు ఇలా అంటాడు :-

"న హ్యతో ధర్మచరణం కించిదస్తి మహత్తరమ్।
యథా పితరి శుశ్రూషా తస్య వా వచనక్రియా ॥

తండ్రిని సేవించడం, అతనిమాటను పాటించడం వీటికంటే గొప్పదేదీ ఈలోకంలో లేదు. ఇదే మహత్తరమైన ధర్మం అని ఈ శ్లోక భావం.

విద్యా ప్రాధాన్యాన్ని వివరిస్తూ భర్తృహరి "పితేవ హితే నియుంక్తే" అంటాడు. అంటే విద్య తండ్రిలాగ హితాన్ని తెలుపుతుందని భావం. పైసందర్భం వలన హితాన్ని చెప్పడం తండ్రి లక్షణం అని తెలుస్తుంది. కాళిదాసు రఘువంశంలో దిలీపుని వర్ణించే సందర్భంలో,

"ప్రజానాం వినయాధానా ద్రక్షణాద్భరణాదపి ॥
సపితా పితరస్తాసాం కేవలం జన్మహేతవః ॥

అని అంటాడు. ఈ సందర్భం వలన కూడా వినయాన్ని నేర్పడం, రక్షించడం, పితృలక్షణాలని తెలుస్తూంది.

పరశురాముడు మాతృ శిరశ్ఛేదనం చేసిన విషయం మీకందరికీ తెలిసినదే కదా ! అందుకు తండ్రి ఆజ్ఞయే కారణము. పితృసేవకు మెచ్చిన జమదగ్నిముని పరశురాముడిని వరం వేడుకొమ్మన్నాడు. పరశురాముడు మాతృజీవనాన్ని వరంగా వేడి తల్లిని తిరిగి బ్రతికించాడు. ఈ విషయంకూడా మనం గుర్తుంచుకోవాలి. ఈ రకంగా పితృవాక్య పరిపాలన చేసిన పరశురాముడుకూడా మహనీయుడేకదా ! ఇంకా పితృ ప్రాముఖ్యాన్ని సూచిస్తూ మనువు ఇట్లు అంటాడు.

"యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణామ్।
న తస్య నిష్కృతిశ్శక్యా కర్తుం వర్షశతైరపి ॥

ఎవని జీవనం, ప్రవర్తనల వలన తండ్రి క్లేశాన్ని పొందుతాడో వానిపాపం నూరు జన్మలకైనా పోదు. ఇంకా ఏమన్నాడో చూడండి :-

"తయోర్నిత్యం హితం కుర్యాత్ ఆచార్యస్య చ సర్వదా।
తేష్వేవ త్రిషు తుష్టేషు తపస్సర్వం సమాప్యతే ॥

తండ్రి మొదలైన వారికి ఎల్లప్పుడూ మేలుచేయాలి. వారు సంతోషిస్తే తపస్సు పూర్తవుతుందని భావం. ఇదేభావాన్ని 'యః ప్రీణయేత్ సుచరితైః పితరం సపుత్రః' అనికూడా చెప్పారు పెద్దలు. పెద్దలమాట పెరుగన్నంమూట అనికదా లోకోక్తి.

పూర్వం యయాతి అనే మహారాజుండేవాడు. వృద్ధుడైనా ఇంకా భోగాలు అనుభవించాలనే కోరిక ఉండేది అతనికి. తన ముసలితనాన్ని తీసుకొని, వారి యౌవనాన్ని ఇవ్వమని తన కుమారులను పిలిచి అడిగాడు యయాతి. ఇందుకెవ్వరూ అంగీకరించలేదు. చివరకు పూరువు అనే కుమారుడు మాత్రం ఇందుకు ఆనందంగా ఒప్పుకున్నాడు. అలాగేనని తన యౌవనాన్ని ఇచ్చి తండ్రి ముసలితనాన్ని తీసుకున్నాడు. ఈ కథ అంతా మహాభారతంలోని ఆదిపర్వంలో ఉన్నది. ఈ ఘట్టంలో యయాతి పురువునుద్దేశించి సభాసదులతో ఏమనిచెప్పాడో నన్నయ భాషలో వినండి.

కం॥ "తనయుండు తల్లిదండ్రులు
పనిచినపని సేయఁ డేనిఁ బలుకెడలోఁ జే
కొన డేని వాఁడు తనయుం
డనఁబడునే పితృధనమున కర్హుం డగునే"

ఆది. ప. 3 ఆ 199 ప

ఇంకా "అర్చితే శ్రేయసి చైవమ్" అనే సూత్రవ్యాఖ్యానంలో అనుబంధ స్మృతులలో తండ్రిని పేరుతో పిలువరాదని నిర్దేశింప బడినది. మరణించిన తండ్రిని ఉద్దేశించి శ్రాద్ధం పెట్టడం విధి. మహాలయ పక్షంలో శ్రాద్ధంకోసం పితృదేవతలు ఎదురు చూస్తారు. వశిష్ఠ మహర్షికూడా ఆచార్యుని కంటే వందరెట్లు తండ్రి గొప్పవాడని చెప్పుచున్నాడు.

"జీవతోర్వాక్య కరణా" అనే ప్రమాణం కూడా తండ్రిమాట పాటించాలని, శ్రాద్ధాదులు చేయాలని చెప్పుచున్నది. భృత్యశ్శిష్యః అనే పెద్దలు పుత్రులు ఐదు రకాలని నిర్వచించారు. వారు ఎవరంటే 1. సేవకుడు 2. శిష్యుడు 3. పోష్యుడు 4. కన్నకుమారుడు 5. రక్షణకై ఆశ్రయించినవాడు. ఇంకా కొంతమంది తండ్రులను కూడా విభజించారు. తండ్రులు పదకొండుమంది. 1. ఉపాధ్యాయుడు 2. కన్నతండ్రి 3. పెద్దన్నగారు 4. రాజు 5. మేనమామ 6. మామగారు 7. రక్షించినవాడు 8. తాత (తల్లితండ్రి) 9. తాత (తండ్రి తండ్రి) 10. బంధువులలో పెద్ద 11. బాబాయి.

ఈ విధంగా పితృకర్మలను ఆచరించి, భారతీయ సంస్కృతిలో తండ్రికున్న స్థానం ఎంత విలువైనదో తెలిసికొని మనమందరము ఆచరించుట మనకర్తవ్యము.



# * సంభాషణలో చిన్నచిన్న పొరపాట్లు

"నాపశబ్దాన్ ప్రయుంజీత" అని సాధువులైన శబ్దాలనే వాడాలనీ, అపశ ఒను వాడరాదని వైయాకరణుల నిర్ణయము. వ్యాకరణ మహాభాష్యకర్త అయి పతంజలి సాధుశబ్దోచ్చారణ వలన పుణ్యం, అపశబ్దోచ్చారణ వలన పాపం వస్తు దనీ చెప్పుచున్నాడు. "ఏకశ్శబ్దః సుప్రయుక్తః సమ్యక్ జ్ఞాతః స్వర్గేలోకే కామధు భవతి" అనే న్యాయం సుశబ్దోచ్చారణం వలన స్వర్గం లభిస్తుందని చెబుతుంద ప్రాచీన వైయాకరణులు "గౌర్గౌః కామదఘా" అని చెప్పారు. అనగా చక్క వాక్కు కామధేనువువంటిదని భావం. ఏదిఏమైనా మనం మాట్లాడే భాష సంవ రింపబడినదీ, లలితము, సద్భావయుతమై వీనులవిందొనరించాలి. మన సంభాష వలన మన సంస్కారము తెలియుచున్నది. "శుకవద్భాషణం కుర్యాత్" అ న్యాయం చిలుకపలుకులలాగ ఆకర్షణీయంగా మృదుమధురంగా ఉండాల సూచిస్తుంది.

మన ఆంధ్రభాష సంస్కృతము, ప్రాకృతము మొదలైన ఇతర భాష సంబంధంచేత సుసంపన్నమూ, సమృద్ధమై అలరారుతుంది. నిత్యవ్యవహారాలలో అనంతమైన భాష ప్రయోగింపబడుతూంది. మన సంభాషణలోనూ, పత్రికలలోనూ తెలిసీతెలియని కొన్ని అపశబ్దాలు దొర్లుతుంటాయి. వీటిని చాలామంది విద్యావేత్తల కూడా ఎక్కువగా పట్టించుకోరు. ఈ పదాలు వాటి సాధుత్వం గూర్చి స్థాలీపులా న్యాయంగా ముచ్చటించడం ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశ్యము. దోషైక దృష్టి విడచి నిష్పాక్షికంగా సాధుత్వ నిర్ణయం చేయాలి.

చాలామంది "ఈ ఉద్యోగాలకు వయోపరిమితి" అని అంటూ ఉంటారు పత్రికలలోకూడా ఇలాగే ఉంటుంది. ఇది సరైన రూపంకాదు. సంస్కృత వ్యాక రణానుసారం "హశచ" అనే ఉత్వం ఇక్కడరాదు. "కుప్వోఃక ప పౌచ" అ ఉపధ్మానీయం వచ్చి "వయః పరిమితి" అనే అవుతుంది. "మన క్రీడాకారుల అధిక్యతతో గెలుపొందారు" "నీ అధిక్యత ఏమిటి?" అని అంటూ ఉంటారు ప్రాధాన్యత, ప్రాముఖ్యత అనే పదాలు అసాధువులే. భావార్థంలో ష్యఞ్ చేరాక

* భారతి. నవంబరు 1983 ప్రకటితము.

మరల భావార్థంలోనే తల్ ప్రత్యయాన్ని చెయ్యడం అనవసరం. ఇట్లు రెండుసార్లు భావార్థక ప్రత్యయాన్ని చెయ్యడం శాస్త్రీయంకాదు. కనుక ఆధిక్యం, ప్రాధాన్యం, ప్రాముఖ్యం లేదా అధికత్వం, ప్రధానత్వం, ప్రముఖత్వం, లేదా అధికత, ప్రధానత, ప్రముఖత అనేవి ష్యఞ్, త్వ, తల్ ప్రత్యయంతాలై సాధువు లవుతున్నాయి. ఇట్లే వివక్షత అనే పదం వివక్ష అంటే చెప్పాలనే కోరిక అని అర్థము. ఇదే భావాన్ని సూచించే పదం కనుక తిరిగి భావార్థక ప్రత్యయం చేర్చడం ఉచితంకాదు. వివక్షేగాని వివక్షతకాదు. ధర్మిని చేసి దానికి భావప్రత్యయాన్ని చేర్చవచ్చు. "పిపాసుతాశాంతిముపైతి వారి జానజాతు దుగ్ధాన్మధునోఽధికాదపి" అని నైషధప్రయోగం. ఇట్లే దిదృక్షత అంటున్నారు. దిదృక్ష సరైన రూపం. చూడాలనే కోరిక అర్థం.

ఇంకా మనకి హోటల్ బోర్డులపైనా తదితర స్థలాలోనూ శాఖాహారం అని కనిపిస్తుంది. శాఖాహారం అంటే కొమ్మలతో చేయబడిన ఆహారం అని అర్థం. ఈ అర్థం అసమంజసం కనుక శాకాహారం అనేది సరైనపదం. కూర మొ॥న ఆహారం అనే అర్థంలో వెజిటబుల్ ఫుడ్ అనే పదానికి శాకాహారం సరైన పదం. వీథుల్లో ఫలహారశాల అని కూడా కనిపిస్తూ ఉంటుంది. ఫలహారశాల అనేది తప్పు. ఫలాహారం అనేది సరైన పదం. పండ్లు మొదలైన అల్పాహారాలు ఉంటాయని అర్థం. ఆహారంగాని హారం కాదు. అట్లే "శీతాకాలం వచ్చింది". 'శీతాకాలంలో జాగ్రత్తలు' అని అంటున్నారు. పైపదంలో సవర్ణదీర్ఘానికి ప్రసక్తిలేదు. శీతకాలం అనే అనాలి.

ప్రస్తుతం సౌదామిని అనే పదం గూర్చి చర్చిద్దాం. ఈ పదంలో సౌదామిని అనే మకారానికి ఇకారాన్ని చేర్చడం పొరబాటు. హరిప్రబోధం అనే సంస్కృత కావ్యంలో ఈ శ్లోకాన్ని చూడండి.

"ఖేఽభ్రం జగామ కాంచనసరసమ
సౌదామనీలతా ధామాస్తమ్ ।
కువలయ మివహిసర జసం సరసమ
సౌదామనీలతాధామాస్తమ్॥

ఇక్కడ యమకం కుదరాలంటే సౌదామనీ అనే ఉండాలి. ఇదే సరైన రూపం.

ఇట్టే భానూజీ దీక్షిత వ్యాఖ్యలో గూడ కనిపిస్తుంది. "తేనై కదిక్" అనే సూత్రం చేత సుదామన్ ప్రాతిపదికకంటె అణ్ ప్రత్యయం పిమ్మట జీప్వచ్చి సౌదామిని అవుతుంది. సౌదామిని అంటే మెఱుపుతీగ అని అర్థం. ఇత్వ ప్రసక్తి దోషజుష్టం.

ప్రస్తుతకాలంలో చాలామంది స్త్రీలు కిరణ్మయి అనే పేరు పెట్టుకుంటారు. సంస్కృతంలో హిరణ్మయి అనే పదం ఉన్నది. హిరణ్మయి అంటే బంగారు బొమ్మ అని అర్థము. ఈ పదంతో సామ్యం ఉండటం వలన కిరణ్మయి అంటున్నారు. హిరణ్మయి శబ్దం "దాడింనాయన"..........అనే సూత్రంలో నిపతింపబడినది కనుక కుదురుతుంది. కనుక కిరణమయి అని ఉండాలి. ఇట్లే "సృజనాత్మక శక్తిని పెంపొందించాలి" సాహిత్యంలో సృజనాత్మక రచనలు రావాలి. అనే ప్రయోగాలు కనిపిస్తున్నాయి. సృజనంకాదు సర్జనం, సృజనాత్మకశక్తి అనడం ఉచితము. కాని ఈ ప్రయోగభాషలో బాగుగా నాటుకుపోయింది. ఇట్లు రూఢమైన పదం వ్యావహారిక భాషలో దోషంకాదేమో. కాలం నిర్ణయించాలి. సృజన్ అనేది హిందీలో కుదురుతుంది. సర్జనమని గుణయుతరూపం సాధువు.

"ఆహ్వానితులైన రసజ్ఞుల సమక్షంలో" అని చెబుతూ ఉంటారు. ఆహ్వానితులు అనేదాన్ని ఇతజన్తంగా సమర్థించుకోవచ్చు. ఆహ్వానితులు అనేది తప్పు కాదుగాని ఆహూతులు అంటే బాగుండును. "భక్తి రసప్రధానమైన సినిమా" అని సాధారణంగా మనం అనేమాట. భక్తిని రసం అనడంకంటే భావం అనడం ఉచితము. అయితే భక్తిని రసంగా పరిగణించిన ఆలంకారికులు చాలామంది ఉన్నారు. కానీ ఎక్కువ మంది భక్తిని భావంగా పరిగణించారు. కనుక భక్తిరసం అన్నా, భక్తిభావం అన్నా దోషం లేదు. "సుస్వాగతం" అనే పదం పరిశీలన్నార్హం. మంచిరాక అనే అర్థంలో సు+ఆగతం అని సంబోధిస్తే స్వాగతం అవుతుందికాని సుస్వాగతం కాదు. పోనీ నిస్, నిర్, దుస్, అన్నట్లు సుస్ అనేది ఉపసర్గేమో అనుకుంటే అట్టి ఉపసర్గ దృగ్గోచరం గావడంలేదు. సు, సు, అని ఒకే ఉపసర్గను రెండుమార్లు పదానికి చేర్చడం తప్పు. కనుక స్వాగతం అనే అనాలి, "బంధు

మిత్రసపరివార సమేతంగా" అనే వాటిలో ఏదో ఒకటి చాలు. రెండూ అవసరం లేదు.

ఉద్యోగం అనే పదం వృత్తి అనే అర్థంలో లోకంలో బాగా నాటుకుంది. న్యాయంగా ఉద్యోగమనే సంస్కృతపదానికి ప్రయత్నం అని అర్థం. సంధి ప్రయత్నాలు సాగాయి. కనుక భారతంలో పర్వానికి ఉద్యోగపర్వం అని పేరు. "ఉద్యోగః పురుషలక్షణమ్" అనే చోటా ఉద్యోగినం పురుష సింహముపైతిలక్ష్మీః అనే చోటా ఉద్యోగపదానికి ప్రయత్నమనే అర్థం. కాని అనంత భాషాప్రవాహంలో వృత్తి అనే అర్థం ఉద్యోగపదానికి రూఢమైంది. రూఢమైంది కనుక ఉద్యోగం అనేది వృత్తి అనే అర్థంలో తప్పుకాదేమో. కాని సంస్కృతంలో మాత్రం ఇప్పటికీ ఉద్యోగం అంటే ప్రయత్నమే.

కొందరికి ఉషస్విని అనే పేరు ఉంటుంది. "మనస్విని అన్నట్లే ఉషస్విని" అనేది కూడా సాధువే అని కొందరి అభిప్రాయము. మనస్విని అంటే ప్రశస్తమైన మనస్సు కలిగినది అని అర్థం. ఉషస్విని అంటే ప్రభాతకాలం కలిగినది అనే అర్థమా ? అనే సందేహం కలుగుతుంది. అంటే రాత్రి అనుకుందాం అంటే రాత్రికి ఆపేరు ఎక్కడాలేదు. అసలు మనస్విని అన్నచోట వచ్చిన విన్ ప్రత్యయం ఇక్కడ రాదు. "సమిష్టిగా మనం కృషిచెయ్యాలి" అని చాలామంది చెప్పుచూ ఉంటారు. సమిష్టి అంటే మంచి యజ్ఞం అనే అర్థమే వస్తుంది. కాని కలసికట్టు అనే అర్థం రాదు. వి+అష్టి=వ్యష్టి అయినట్లుగా సమ్+అష్టి= సమష్టి అవుతుంది. వ్యష్టి, సమష్టి అన్న రెండుచోట్లా అష్టి అన్నపదమే కాని ఇష్టికాదు. కనుక సమష్టి సరైన రూపం. "ఇది మన సాంప్రదాయం" అంటారు. కాని సంప్రదాయం అనే అనాలి కాని సాంప్రదాయం అనకూడదు. సంప్రదాయం అంటే పద్ధతి అని అర్థము." నిదానస్థులు అనేది సంస్కృతపదం. నిదానం అంటే మెల్లగా అని చాలామంది భావిస్తున్నారు. కాని "నిదానం త్వాదికారణం" అనే అమరాన్నిబట్టి నిదానం అంటే మూలకారణము అని అర్థం. వాడుకభాషలో ఇట్లే "ఆయన చాలా శుబ్బరస్థులు" అని అంటున్నారు. ఇది తెలుగు సంస్కృతాలవల్ల ఏర్పడ్డ అపభ్రంశ రూపం. ఇది పూర్తిగా తప్పే. "అంతరాష్ట్రీయ పద్ధతి" అనికూడా వాడుకభాషలో ప్రయోగం ఉంది. దేశంలో దాగియున్న పద్ధతులు అనే అర్థంలో అంతా రాష్ట్రీయ అనడం ఉచితం. కాని రేఫక్రింద రేఫప్రయోగం ఉచితం కాదు. మనోశక్తి అనేది

తప్పు. మనశ్శక్తి అనేది సాధుప్రయోగము."ఆయన దేవునిలో ఐక్యతచెందారు" మనలో ఐక్యత చాలా అవసరం." అనే సందర్భాలలో ఐక్యం అనడం యుక్తము. పత్రికలలో కూడా ఐక్యత అని కనిపిస్తుంది. "అందుకు అనుగుణ్యంగా" అని గానీ అనాలి. "ఆయన దేశంలో ఏకైక కవి" అనడం తప్పు. ఏకైక అంటే ఒక్కొక్క అని అర్థము వస్తుంది గానీ ఒకే ఒక్క అని అర్థం రాదు. "ఏకైక పుత్రుడు" అనేవి అపరూపాలు.

సఖ్యత అని మనం సాధారణంగా అనాలోచితంగా అంటూ ఉంటాము. సఖ్యం అనేది సరైనపదం. సఖ్యతకాదు. "ఈమె బ్రహ్మచారిణిగా ఉండిపోయింది" అనే చోట వాడబడిన బ్రహ్మచారిణి అనేపదం సరైన అర్థాన్నివ్వదు. స్త్రీని బ్రహ్మచారిణి అనడం కంటె కన్య అనడమే సముచితం. స్త్రీలకు బ్రహ్మచర్యం లేదు కదా! అయితే బ్రహ్మపదార్థ భావనతో సంచరించే స్త్రీ అనే అర్థంలో మాత్రం సమంజసమే. అవివాహిత అనే అర్థంలో గాదు.

కొందరు "ఈమె మాగుర్విణి" అని గురువు అనే అర్థంలో స్త్రీలనుగురించి ప్రయోగించడం కూడ కలదు. గుర్విణి అనేది సరైన రూపంగాదు. గుర్విణి అంటే గర్భవతి అని ప్రసిద్ధమైన అర్థం కనుక గుర్వి లేక గురువు అనాలి. "వోతో గుణవచనాత్" అని జీష్ వికల్పంగా వస్తుంది. "ఆయనకేం ఆయన కవిసామ్రాట్" నటసామ్రాట్" అంటారు. సమ్రాట్ అనాలిగానీ సామ్రాట్ అనరాదు. అందుకే విశ్వనాథ సత్యనారాయణగారికి కవిసమ్రాట్ అనే పేరుంది.

"వారిరువురూ సమకాలీకులు" అనడం శాస్త్రవిరుద్ధం. ఇందుకు వ్యాకరణం అంగీకరించదు. సమకాలికులు అనాలని వ్యాకరణం చెబుతుంది. భానోదయం అనడం తప్పని మనందరికీ తెలిసినదే. సవర్ణదీర్ఘం చేస్తే భానూదయ అనే అవుతుంది. ఇంకా 'అరిషడ్వర్గము' అనేది కొంచెం క్లిష్టమైన రూపం. "షణ్ణాంవర్గః అరీణాం షడ్వర్గః అరిషడ్వర్గః"అని చెప్పాలి. శివభాగవతరూపం వలె ఇది అసమర్థ సమాసమే. ఇది కవులచే ఆదృతమై ప్రయుక్తమైంది. "కృతారిషడ్వర్గజయేన మానవీమ్" అని భారవి ప్రయోగము. "నాజన్మ పునీతం అవుతుంది" అనడం పరిపాటి. పునీతం అనేది ప్రామాదికమే పవిత్రమైంది అనే అర్థంలో పూతం అవుతుందిగాని పునీతం గాదు. పవిత్రం చేయబడింది అనే అర్థంలో పావితం అవుతుంది. పునీతః అని క్రియారూపం సంస్కృతంలో ఉంది. దాన్ని క్రాంతమని

భ్రాంతిపడి ఉంటారు కొందరు. ఆ శబ్దభ్రాంతితో వచ్చినపదమే పునీతం అనేది. కానీ పునీతం అనేది వాడుకభాషలో బాగా వ్యాపించింది. ఇట్లే తెలివి అనే అర్థంలో మేధస్సు అనడం కూడా కొంచెం ఇబ్బందిని కలిగిస్తుంది. మంచిమేధ అనడం ఉచితం. మేధస్సుగాదు. సమాసంలో మేధా శబ్దం "నిత్యమసిచ్ ప్రజామేధయో" అనేసూత్రం వలన సాంతం అవుతుందిగాని విడిగా మేధాశబ్దం ఆకారాంతమే. "ఉపాధ్యాయినులు కావలెను." అనడం చాలా సందర్భాలలో కానవస్తుంది. ఇది పొరపాటు.ఉపాధ్యాయి లేక ఉపాధ్యాయ అనాలికాని, ఉపాధ్యాయిగాదు. మల్లిఖార్జున పదంలో క కారమేగాని ఖ కారంగాదు.

పై పదాలు శాస్త్రవిరుద్ధాలు. కాని అనంతమైన కాలగమనం పొంగేనదిలా దినదినాభివృద్ధిచెందే ఆంధ్రవాఙ్మయం పై పదాలకు సాధుత్వాన్ని కలిగిస్తాయేమో ? కాని సంస్కృత భాషలో పై పదాలు నాటికి నేటికి అపశబ్దాలే. చక్కనిభాష, లలితమైన భావాలు, వీనుల విందొనరించే లలితపద విన్యాసం, సంభాషణా చాతురికి, ఆకర్షణకు, సభ్యతకు, సంస్కారానికి మూలకారణాలనడంలో సందేహంలేదు. "వాణ్యేకా సమలంకరోతి" అన్నట్లు చక్కని వాక్కే మనిషికి పెట్టని అలంకారం. సుశబ్దశోభితమైన భాషను ఉపయోగించడానికి మనం అందరం ప్రయత్నిద్దాము.

# * భక్తియోగం

సుఖదుఃఖ పూరితమైన ప్రపంచములోని శ్రేయస్స్వరూపమైన నిర్మలానందం మోక్షంవల్ల మాత్రమే సిద్ధిస్తుంది. ఇట్టి మోక్షానికి అందరూ అర్హులే. "నృణామేకో గమ్యస్త్వమసి పయసా మర్ణవఇవ" అని మహిమ్నస్తవంలో చెప్పినట్లు జీవులందరూ చివరకు భగవంతునిలో లీనమవుతారు. మోక్షానికి మానవుల చిత్తవృత్తి భేదాల ననుసరించి అనేకమార్గాలు చెప్పబడ్డాయి. ఈ విషయం "రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానాపథజుషాం" అనే పంక్తి ద్వారా మహిమ్నస్తవంలో చెప్పబడింది. ద్వైత విశిష్టాద్వైతాద్వైతాలేగాక సాంఖ్యయోగాలు న్యాయ మీమాంసాది శాస్త్రాలు, జైన బౌద్ధాద్యనేక మతాలు మార్గాలుగా ప్రతిపాదింపబడ్డాయి. ఎవరు ఏమార్గాన్ని అనుసరించినా పరంధాముడినే చేరుతారు. అయితే భక్తియోగం ద్వారా భగవత్సాన్నిధ్యాన్ని పొందడం సర్వులకు సులభసాధ్యం. అందుకే త్రిమతాలవారు ఇతరులూ తమ తమ సిద్ధాంత మార్గాలనేకాక భక్తియోగాన్ని కూడా ప్రచారం చేసారు. "భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున" అని గీతాచార్యుడు భక్తియోగానికి ప్రాముఖ్యాన్నిచ్చాడు.

భక్తి అంటే ఏమిటో చర్చించే భక్తియోగ ప్రాముఖ్యాన్ని గుర్తించడం అవసరం. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని ఆదిశంకరులు వివేకచూడామణిలో స్పష్టంగా ప్రతిపాదించారు. అంటే మోక్షానికి అనేక మార్గాలున్నా అందులో భక్తే గొప్పదని భావం. వేదోపబృంహణ పరమైన పురాణాలను, భారతాన్ని రచించిన వ్యాసుడు సులభోపాయంగా సర్వజన గ్రాహ్యంగా భక్తిప్రధానమైన శ్రీమద్భాగవతాన్ని రచించాడు. శుక నారద వ్యాసాంబరీషాదులు భక్తులై తరించారు. నిర్గుణ ధ్యానం లేదా శుద్ధాద్వైతం చాలాకష్టం అనంత కాలంలో ఒకనొకడు తప్ప ఈ యోగాన్ని పాటించలేడు. భగవంతునితో స్నేహం చేసే అవకాశం భక్తియోగంలో మాత్రమే ఉన్నది.

భక్తి అనేది "భజ సేవాయాం" అనేధాతువుకు క్తిన్నంతరూపం. భక్తి అంటే సేవించడం అని అర్థం. మనోవాక్కాయ కర్మలచే భగవత్సేవనమే భక్తి. "సేవా శ్వవృత్తిరాఖ్యాతా" అనే మనువుమాట దుర్జనుని సేవించరాదనే అర్థంలో ప్రయోగింపబడింది. సర్వగుణాభి రాముడైన దేవుని సేవించడం ఉచితం. "సా తస్మిన్నిరతిశయ ప్రేమరూపా" అని నారదభక్తి సూత్రగ్రంథం చెప్పుచున్నది. భగవంతుని

రామకృష్ణప్రభ, మే, 1984 ప్రకటితము

యందు ఫలవాంఛలేని అనురాగమే భక్తియని భావం. భగవాధుడు నావాడుఅనే తపన చాలా అవసరం. "స్వాత్మతత్త్వాను సంధానాం భక్తిరిత్యభి ధీయతే" అనే వివేక చూడామణి చెప్పుచున్నది. పరమాత్మరూపుడైన దేవునిలో జీవుడవైన నిమ్నలయం చేసుకోవడం భక్తిఅని దీనిభావం. జీవత్వాన్ని వదలి ప్రజ్ఞాన ఘనము ఏకరూపము నైన దేవత్వంలో చేరడం భక్తి."తైలధారావదవిచ్ఛిన్న స్మృతి సంతానరూపాపన్నం జ్ఞానం భక్తిః" అని శ్రీ రామానుజాచార్యులవారి నిర్వచనం. బిందువును బిందువు అనుసరిస్తూ తెగకుండా ఎలాధార సాగుతుందో అలాగే అవిచ్ఛిన్నమైన భగవత్సం బద్ధాలోచనా స్రవంతియే భక్తి అనిఅర్థము. భగవంతుని గుణాలను మననం చేస్తూ విఘ్నం లేక జీవించడం భక్తి అని ఆచార్యుని భావము.

గీతాచార్యుని మతంలో భక్తియోగం ఇట్లు వివరించ బడినది. మనస్సును భగవంతునిపై నిలిపి నిత్యయుక్తులై సన్యస్తసర్వకర్ములై చరించెడివారు సద్భక్తులు. భగవదాదేశం ఇట్లు ఉన్నది. "మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ. నివసిష్యసి మయ్యేవ అథ ఊర్ధ్వం న సంశయః॥" అంటే మనోబుద్ధులను దేవునిపై నిలిపితే జీవుడు భగవంతుని యందే నివసిస్తాడని భావము. మనస్థాపనకు అభ్యాసం చెయ్యాలి. లేదా భగవదనుగ్రహప్రదమైన కర్మచేయాలి. కర్మఫల త్యాగం చేసినా చెయ్యవచ్చు. అభ్యాసంకంటే జ్ఞానం, జ్ఞానం కంటె ధ్యానం, ధ్యానంకంటె ఫలత్యాగం దానికంటే శాంతి క్రమంగా గొప్పవి.

నారద భక్తిసూత్రాలలో భక్తియోగ ప్రక్రియలు వివరింప బడ్డాయి. భక్తి కోరికలతో కూడినది కాదనే విషయం "సానకామ యమానా నిరోధ రూపత్వాత్" అనేసూత్రంలో ఉన్నది.

నిరోధమనగా లౌకిక వైదిక కర్మ పరిత్యాగం. దేవప్రియ కర్మలను ఆచరిం చడం, తద్విరుద్ధ కర్మలను విడువడం చెయ్యాలి. దృఢభక్తి సిద్ధించే వరకు శాస్త్ర కర్మపరిత్యాగం చెయ్యరాదనే విషయం గమనార్హం.

పూజాదులందు అనురాగమే భక్తియని వ్యాసుడు, కథాశ్రవణమే భక్తిఅని గర్గమహర్షి, ఆత్మరత్యవిరోధంతోనని శాండిల్యుడూ చెప్పుచున్నారు. సర్వకర్మలను భగవదర్పణంగా చెయ్యడం, భగవద్విస్మరణవలన కలతపాటు నొందుట భక్తియని, గోపికలు మహాభక్తులని నారదమహర్షి సిద్ధాంతము, ఇట్టి మహత్తరమైన భక్తియోగం జ్ఞానయోగంకంటే ఎక్కువ.

భక్తునవసానికి సంగత్యాగం, నిరంతర భజన పెద్దల యనుగ్రహాదులు అవసరం. భక్తిలక్షణాలు ధర్మముఖంగా ప్రతిపాదింపబడినట్లే ధర్మిముఖంగాకూడా ప్రతిపాదింపబడ్డాయి. భక్తునిలక్షణాలు క్రమంగాఇవి. 1. ఏ జీవిని ద్వేషింపకుండుట 2. మైత్రినికలిగి యుండడం 3. కరుణ 4. మమతలేకుండుట 5. అహంకారరాహిత్యం 6. సుఖదుఃఖాలతో సమతాబుద్ధి 7. ఓర్పు 8. నిరంతరం సంతుష్టుడగుట 9. సంశయ రహితుడై దృఢనిశ్చయుడగుట 10. భగవంతునిపై మనోబుద్ధులు అర్పించుట 11. లోకానికి ఉద్వేగాన్ని కలిగింపకుండుట 12. లోకంవలన ఉద్వేగ్నత్వను పొందకుండుట 13. సుఖకోప భయాదులవలన విముక్తుడగుట 14. ఏవిషయంలోనూ ఎవరివలన అపేక్షలేకుండుట 15. శారీరక మానసిక పారిశుద్ధ్యం 16. ఔదాసీన్యం 17. సర్వకర్మారంభ పరిత్యాగం 18. శుభాశుభాలనువిడిచి హర్షద్వేష దుఃఖకాంక్షలనుండి విముక్తుడగుట 19. శత్రుమిత్రాదులయందు, మానావమానాలలో శీతోష్ణాలలో, సుఖదుఃఖాలలో సమబుద్ధినొందుట, 20. నిందాస్తుతులలో సముడగుట 21. మౌనం 22 ఉన్నదానితో తృప్తినొందుట 23 స్థిరనివాసంలేక సంచరించుట.

వీటిలో కొన్ని పాతంజల యోగసూత్ర ప్రోక్తమైన యమనియమాలను సాధించేయోగ లక్షణాలుకూడా అవుతాయి. మైత్రి, ముదిత, తితిక్ష కరుణ అనేవి యోగిలక్షణాలు. ఇవే మహాభక్తుని లక్షణాలుగా చెప్పబడ్డాయి.

ఇట్లే ధర్మముఖంగా నారదుడుకూడా చెప్పుచున్నాడు. సజ్జనసంగం, దుర్జనులను, పరిత్యజించడం, నిస్సంగత, నిర్మముడగుట, నిర్జనస్థానాలలో సంచరించడం, లోకబంధాలను త్రెంచుకోవడం, సత్వరజస్తమోగుణ రహితుడగుట, తనయోగక్షేమాలను విచారింపక భగవంతునిపై అవిచ్ఛిన్నానురాగాన్ని ప్రదర్శించడము, లోకహానిగురించి ఆలోచింపకుండుట. లక్షణాలు, స్త్రీలు, ధనం, నాస్తికులు, శత్రువులు, వీరిగురించి స్మరింపకుండుట. అభిమాన దంభాలను విడవడంకూడా భక్తుని లక్షణాలే. భక్తుడు వాదోపవాదాలు చేయరాదు. ఒక్కక్షణంకూడా విడువకుండా భక్తిశాస్త్రాలు వినాలి. అహింస, సత్యం, శౌచం, దయ, ఆస్తిక్యం మొదలైన గుణాలను సంపాదించడం భక్తుని లక్షణము.

సరైనభక్తి సిద్ధించేవరకు సత్కర్మలను పరిత్యజించరాదు. ఇది కర్మసన్యాస నియమానికి అపవాదశాస్త్రము. ప్రేమ అనిర్వచనీయము. ఇదిమూగవాని ఆస్వాదనలాగా ఉంటుంది. భక్తినిర్గుణము, కోరికలులేనిది, ప్రతిక్షణంపెరిగేది, అవిచ్ఛిన్నము సూక్ష్మతరము, అనుభవరూపము అని గ్రహించాలి. భక్తివలన జ్ఞానం కలుగుతుంది,

జ్ఞానంవవలన మోక్షం సిద్ధిస్తుందనేది అద్వైతసిద్ధాంతము. శ్రీ రామానుజులు "భక్తిశ్చ జ్ఞాన విశేషఏవ" అని వేదార్థ సంగ్రహంలో చెప్పుచున్నారు. జ్ఞానంలోని ఒకానొక విశేషమే భక్తియని భావం. "భక్త్యాత్వనన్యయా శక్య అహమేవ విధో ఽర్జున" అని శ్రీ కృష్ణభగవానుడు చెప్పాడు. "జ్ఞానా దేవతు కైవల్యం" అనే ప్రమాణం వలన భక్తిజ్ఞానాలు అవిరుద్ధాలని తెలియుచున్నది.

భక్తిప్రధానమైన శ్రీ మద్భాగవతంలో "ప్రోజ్ఝితకైతవో ఽత్ర" అని చెప్పబడింది. కాపట్యంలేని ధర్మాచరణమే భక్తి అని తెలియుచున్నది. నవీనాలం కారికులు భక్తికి రసత్వాన్నిచ్చారు. భరతమహర్షి భక్తికిరసత్వాన్నివ్వక భావత్వాన్నే ఇచ్చాడు. నిర్వేదాదిత్రయస్త్రింశత్సంచారి భావాలలో చేర్చబడినా భక్తివిలక్షణ మైనదని అంగీకరింపక తప్పదు. భక్తికి రసత్వాన్నిచ్చినవారు అనేకులున్నారు. ఇది అంగీకారంగా వర్ణింపబడటం వలన అన్యభావ విలక్షణం అని తెలియుచున్నది.

భగవానుడు అనేకులను రక్షించటం జరిగింది. ఇతడు సర్వశక్తి సమన్వితుడు. కనుక నిశ్చయముగా మనలను రక్షిస్తాడనే ధృఢవిశ్వాసం ఉండాలి. ఈ విషయం "రక్షిష్యత్యను కూలాన్నః" అనే పంక్తి ద్వారా చెప్పబడినది.

ఇప్పుడు మహాభక్తుల ప్రయోజనాన్ని విచారిద్దాం. వీరు సర్వసద్గుణ పూర్ణులవటం వలన సంఘోపయోగ కర్మలను చేయగలరు. భగవద్గుణాలను మననం చెయ్యడం వలన కొంతకాలానికి వీరూ గుణవంతులే అవుతారు. ఈ విషయంలో క్రిమికీటక న్యాయం శాస్త్రంలో చెప్పబడింది. గొంగళిపురుగు సీతాకోక చిలుక లా కావాలని దాని గుణాలను నిరంతరం స్మరిస్తూ గూడుకట్టుకొని ఉంటుంది. ఆ ధ్యాన ప్రభావంవలన సీతాకోకచిలుకలా మారడాన్ని గమనిస్తున్నాం. అలాగే జీవుడుకూడా మహాభక్తుడిగామారి గుణపూర్ణుడవుతాడనడంలో సందేహంలేదు. వీరు కులాన్ని, భూమినీ పవిత్రంచేస్తారు. వీరు తీర్థాలను, కర్మలను, శాస్త్రాలనుకూడా పావనం చేస్తారు. పితృదేవతలు, దేవతలు సంతసిస్తారు. భూమికి వీరు అలంకారాలు.

భక్తుడివిధులు, భగవంతుని ప్రవర్తననుసరించి మార్జాలకిశోర, మర్కటకిశోర న్యాయాలుగా చెప్పబడ్డాయి. భక్తులు మర్కటకిశోరన్యాయాన్ని అనుసరించాలి. కోతులు చెట్లు కొలడలపైనా సంచరించేటప్పుడు పిల్లలేకోతులను పట్టుకొంటాయి. పెద్దకోతులు పిల్లల విషయంలో ఎట్టిబాధ్యతాలేక ఎగురుతుంటాయి. అట్లే భగవంతుడు మనలను పట్టించుకోకపోయినా మనమే భగవంతుని ధ్యానిస్తూనే వెంటపడాలి. భక్తులకు మానసిక పరిపక్వత కలిగిన పిమ్మట దేవుడు మార్జాలకిశోరన్యాయాన్ని

ఆశ్రయించి మార్జాలంలా ప్రవర్తిస్తాడు. పిల్లి పిల్లలతో తిరిగేటప్పుడు పెద్దపిల్లే పిల్లలను కరచుకొని తీసుకు వెళుతుంది. పిల్లలు శ్రమబాధ్యతను మరచి హాయిగా ఉంటాయి. అట్లే దేవుడు భక్తుల సర్వబాధ్యతలను స్వీకరించి రక్షిస్తాడు.

ప్రస్తుతం మహాభక్తుల మానసిక భావాలను పరిశీలిద్దాం. ఒకభక్తుడు భగవత్సేవ నాన్ని విడచి అన్యవిషయాలను సేవించానికి నామనస్సు అంగీకరించదనీ, తేనెతో నిండిన పువ్వును విడిచి తుమ్మెద చెఱకును ఆశ్రయింపదుగదా అని అంటున్నాడు.

"తవామృతస్యంది పాదపంకజే, నివేశితాత్మా కథమన్యదిచ్ఛతి ?।
స్థితేఽరవిందే మకరంద నిర్భరే, మధువ్రతో నేక్షురసం సమీక్షతే"

అనగా "మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు పోవునే మదన ములకు" అని ప్రహ్లాదుని నోటనుండి చెప్పించినాడు పోతన.

భక్తులను తన్మయావస్థలో స్తంభించుట, ఇంద్రియములు పట్టుదప్పుట, గగుర్పాటు, చెమట, పాలిపోవుట. కంపము, కన్నీరు, గొంతుమారుట అనేసాత్విక భావాలు కలుగుతాయి" తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్" అని మహాభక్తులగూర్చి శ్రీ కృష్ణుడు ప్రతిజ్ఞ చేసాడు. ఉత్తమ భక్తులను జన్మజరా మృత్యు వులనుండి రక్షిస్తాడు భగవంతుడు. "సకీర్త్యమానః శీఘ్రమేవావిర్భవతి అనుభావ యతి చ భక్తాన్" అని ప్రమాణం ఉన్నది. భగవంతుడు భక్తులకు దృగ్గోచరుడై స్వానుభావాన్నిస్తాడు.

"నాహం వసామి వైకుంఠే, యోగినాం హృదయే న చ॥
మద్భక్తా యత్ర గాయన్తి, తత్ర తిష్ఠామి నారద" ॥

అని పాండవగీతలో భగవంతుడుచెప్పాడు. భగవంతుడు వైకుంఠంలోగాని, యోగులహృదయాలలోకానీ, ఉండడు. భక్తుల సమక్షంలోనే ఉంటాడు. భక్తితోనే దేవుడుతృప్తి నొందునుకాని గుణాలచేకాదు. మాధవుడు భక్తప్రియుడు,

"భక్త్యాతుష్యతి కేవలం న చ గుణైః భక్తిప్రియో మాధవః" అనేది ఇందుకు ప్రమాణం.

భాగవతంలో భక్తిలక్షణం ఇట్లుఉన్నది. "సర్వభూతేషు యః పశ్యేత్ భగవ ద్భావమాత్మనః" "భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః" అన్నిజీవుల యందు భగవంతుని దర్శిస్తూ, భగవంతునియందు అన్నిజీవులను చూసినవాడే భాగవతోత్త ముడు.

మానవత్వం లేక కేవలం డంభాచారంతో భక్తుల్లాగా నటించే భక్తబ్రువులు చాలామంది ఉన్నారు. వీరిని మిథ్యాచార్యులు అంటారు. మానవతా విరుద్ధంగా ప్రయత్నిస్తూ "ద్రోహాలన్నీ చేస్తూ" బయటకు చిహ్నాలు ధరించి పూజలు చేసేవారు చాలామంది కనిపిస్తారు.

సత్యాహింసాది మానవతా ధర్మాలులేక ఎన్ని పూజలు చేసినా భగవంతునికి తృప్తికలుగదు. వీరిని రాక్షసాంశాలతో పుట్టిస్తూ, శిక్షిస్తూ ఉంటానని "క్షిపామ్య జస్రమ శుభమాసురీష్వేవ యోనిషు" అని శ్రీ కృష్ణుడు చెప్పియున్నాడు.

సమస్త జీవరాసులలో కొద్దిమంది మాత్రమే సత్యాహింసాదులు కలిగి యుంటారని గమనించాలి. శ్రీ రామకృష్ణపరమహంస జీవితం పరిశీలిస్తే మహాభక్తుని లక్షణాలు ఓతప్రోతంగా వారిలో ఉన్నాయని తెలియుచున్నది మట్టిగడ్డలను బంగారు నాణాలను, సమానంగా విసిరివేయడం, క్రీస్తును, శంకరుడిని, బుద్ధుడిని, సమదృష్టితో సంభావించడం వంటి గుణాలు రామకృష్ణునికే చెందుతాయి. లక్షలమందిలో రామ కృష్ణుల వంటి ఒకరు ఇద్దరు మాత్రమే మహాపురుషులు, భక్తాగ్రేసులని గుర్తించాలి.

శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం, అని భక్తి నవవిధాలు. ఏ మార్గంతోనయినా దైవాన్ని పొందవచ్చు. పరీక్షిత్తు భగవద్గుణ శ్రవణంచేత, శుకుడు కీర్తించడంచేత, ప్రహ్లాదుడు స్మరించడంచేత, లక్ష్మీదేవి పాదసేవనంచేత, పృధుచక్రవర్తి పూజించడంచేత, అక్రూరుడు అభివాదనంచేత, హనుమంతుడు దాస్యంచేత, అర్జునుడు స్నేహంచేత, బలిచక్రవర్తి ఆత్మనివేదనంచేత, మోక్షాన్ని పొందారు. అహంకారాన్ని విడిచి 'నధర్మ నిష్ఠోఽస్మి న చాత్మవేదీ' అని భగవంతుడిని చేరాలి.

భక్తులు ఉపవాసంకూడా చేస్తారు. ఉపవాసం చెయ్యడంవలన భగవద్ధ్యానాను కూలమైన మనోధైర్యం ఏర్పడుతుంది. ఆహారాన్ని మానివేస్తే ఉపవాసం అవుతుం దని చాలామంది భావిస్తారు. ఇదిసరికాదు. అసలు ఉపవాసం అనే పదం ఉపఅనే ఉపసర్గకంటే పరమైన ధాతువునకు ఘఞ్ ప్రత్యయం. ఉపవాసం అంటే భగవంతుడిని సమీపించి నివసించడం అని అర్థం. అయితే భగవంతుడిని ఎలా సమీపించాలి ? అనే ప్రశ్న ఉదయిస్తుంది.

జాగరణంకూడా ధ్యానానికి చాలా అవసరం. జాగరణం అంటే వృథా కాల క్షేపాలతో పొద్దుపుచ్చడం అని అర్థంకాదు.

నిద్రపోకుండా ఉండడం, తెలివిగా ఉండడమే జాగృతికాదు. నిద్రఅంటే అజ్ఞానం. ప్రాపంచిక విషయాలే నిద్ర. భగవత్పరమైన భావాలతో ఉండడమే జాగరణం. ఇలా పుణ్యదినాలయందు జాగృతి చెయ్యాలి. అందుకే గీతాచార్యుడు "యానిశా సర్వ భూతానాం" అనే శ్లోకంలో జగద్భావన, అనే అర్థాలతో నిశాజాగరణాలను ప్రయోగించాడు. భగవత్‌సన్నిధిని దీపాన్ని వెలిగించాలి. రజస్తమో గుణాలను తీసివేసి సాత్త్వికమైన మనస్సును దేవుని ముందుంచడం అంతరార్థం.

భగవంతుడిని పువ్వులతో పూజించడం భక్తుల లక్షణము. వాడిన పువ్వును మ్లానం అంటారు. సువాసనలేని పువ్వును నిర్గంధం అంటారు భూమిపైపడిన దానిని భూపతితం అని, ఒకరు వాసనచూసిన పువ్వును ఆఘ్రాతంఅని, పరులువాడిన పువ్వును ఉపభుక్తంఅని అంటారు. విశ్వాకంత్రం అనే గ్రంథం ఈ విషయంలో ప్రమాణం అగుచున్నది. దానిలో ఇట్లుఉన్నది. కోసిచాలా సేపయిన పువ్వును పర్యుషితం అనీ దళాలు విరిగిన పువ్వును ఛిద్రం అని అంటారు. క్రిములతో కూడినది అపపన్నం. ఎక్కువవాసన ఉంటే ఉగ్రగంధం అవుతుంది. మొగ్గను స్వవికాసితం అంటారు. దుర్జనునిచే తాకబడిన దానినితుచ్ఛపం స్పృష్టం అంటారు. మలినపాత్రలో తెచ్చినదాన్ని అశుద్ధ భాజనానీతం అనిపిలుస్తారు. యాచించితెస్తే అది యాచితం అవుతుంది. ఇటువంటి పువ్వులతో దేవుని పూజింపరాదు.

సాత్త్వికమైన భక్తులు తెల్లని పువ్వులతోనూ, రాజసులు ఎఱ్ఱనిపూలతోనూ, తామసులు నల్లని లేదా నిర్గంధమైన పూలతో పూజిస్తారు. ప్రత్యేకంగా విష్ణువుకు తులసీదళాలు, మల్లెపూలు ఇష్టం. శివునకు జిల్లేడు, ఉమ్మెత్తపూవులు, మారేడుదళాలు, తుమ్మిపూలు ఇష్టం. పరాశక్తికి బంతి, చేమంతి, గోరింటపూలు, ఇష్టమైనవి. అయితే ఇక్కడ గమనించవలసినది ఉన్నది. వాసనలేకున్నా మందారం, మోదుగ, జపాపుష్పం, మంకెన పువ్వులతో పూజింపవచ్చు, మోదుగ, సంపెంగ, బొగడ, గన్నేరు జిల్లేడు, విరిగిపువ్వులతో పూజింపవచ్చు.

విష్ణువును జిల్లేడు, ఉమ్మెత్త, అక్షతలతో పూజింపరాదు. మంకెన, మొగలి, మల్లె, గోరింట, మాలతి, కొండమల్లెలను శివునకు అర్పింపరాదు. గరిక, జిల్లేడులతో దేవునిపూజింపరాదు. తులసీదళం వినాయకునకు ప్రీతికరం కాదు. అయితే మహాభక్తులు భక్తితో ఏ పువ్వులతోనైనా పూజింపవచ్చు.

ఇట్లు భక్తియోగాన్ని ఆచరించి సర్వపాప నిర్ముక్తులమై భగవత్సాన్నిధ్యాన్ని చేరడానికి ప్రయత్నించడం మనకర్తవ్యము.

# * హరిహరాద్వైతం

విశ్వసంస్కృతి మతం వల్ల పెల్లి విరుస్తుందని ఆర్షసిద్ధాంతము. వేదాలు, పురాణాలు ప్రాచీనవాఙ్మయంలోని అతి ముఖ్యమైన ప్రామాణిక గ్రంథాలు. విశ్వసంస్కృతిని ప్రతిపాదించటానికి బద్ధకంకణులయ్యారు ఆనాటి ఋషులు. ఏవో కొన్ని కారణాల వల్ల సర్వదేవతా సమన్వయం జరగకపోవడం, హరిహరాద్వైతాన్ని మరవటం జరిగింది. మత వైషమ్యాలను రూపుమాపడానికి హరిహరులకు గల అభేదాన్ని గుర్తించాలి. ఇందుకు ప్రాతిపదికగా ఆ తత్త్వం గురించి ఆలోచిద్దాం.

ప్రపంచకర్త ఈశ్వరుడే కాని మానవుడుకాడు. ఈశ్వరుడు లేకుండా ప్రపంచం దానంతటదే వచ్చిందనటంలో సామంజస్యం లేదు. అందుకే తార్కికులు ఇలా చెప్పారు. "జగతాం యదినోకర్తాకులాలేన వినాఘటః చిత్రకారం వినాచిత్రం స్వత ఏవ భవేత్తదా". అంటే చిత్రకారుడు లేకుండా చిత్రం, కులాలుడు లేకుండా ఘటం రానట్లే ఈశ్వరుడు లేకుండా ప్రపంచం రాదని భావం. అపోలో చంద్రమండల యాత్రను దిగ్విజయంగా నడిపిన ప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు కూడా సృష్టికర్త ఉనికిని అంగీకరించారు. విశ్వం అనంతం అని ప్రాచీనులకు తెలుసు. మనకు కనిపించే సర్వనక్షత్రాలు భూమండలం అంతా కలిసి గెలాక్సీ అనే పేరుతో పిలువబడతాయి. ఇలాంటివి ఈ అనంత విశ్వంలో అసంఖ్యాకంగా ఉన్నాయని శాస్త్రజ్ఞులు అంగీకరించారు. ఈ విషయం లలితా సహస్రంలో "అనంతకోటి బ్రహ్మాండజననీ" అనే నామంలో వ్యక్తీకరించబడింది. అనంతకోటి బ్రహ్మాండాలను సృష్టించినట్లు చెప్పడంవల్ల అనంత ప్రపంచాల స్థితి విశదమవుతూంది. ఈ విషయాలు భగవంతుడు ఉన్నాడని నిరూపిస్తాయి.

జన్మజరావిపత్తిమరణాన్వితమైన ఈ సంసారం నుండి అమృతరూపమైన మోక్షాన్ని పొందటం మానవుని కర్తవ్యం. ఇందుకు మార్గాన్ని న్యాయశాస్త్ర కర్త అయిన గౌతమమహర్షి ఇలా వచించాడు. "దుఃఖజన్మప్రవృత్తి దోష మిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనన్తరాపాయాదపవర్గః" మిథ్యాజ్ఞానం వల్ల దోషం పుడుతుంది. దోషం వల్ల ప్రవృత్తి కలుగుతుంది. ప్రవృత్తి వల్ల జన్మ, జన్మవల్ల

★ సప్తగిరి జనవరి 1984 ప్రకటితము.

దుఃఖం వస్తున్నాయి. క్రమంగా వీనిని నశింపచేసుకుంటే మోక్షం కలుగుతుంది అని దీని భావం. జీవి శరీరాన్ని విడవటం గూర్చి పెద్దలు ఇలా నిర్వచించారు. "ప్రయాణస్యకిమాశ్చర్యం చిత్రం తత్ర స్థితేర్మహత్." ప్రాణవాయువు పోవడంలో ఏమీ విశేషం లేదు కాని అది రంధ్రాన్వితమైన శరీరంలో ఉండటం ఆశ్చర్యం. అయితే శాస్త్రాలు, పురాణాలు అనంతంగా ఉన్నాయి కదా! ఇవన్నీ చదివితేకాని మోక్షం రాదు. ఇవన్నీ చదవటం జరిగేపని కాదు అని సంశయం కలుగుతుంది. ఈ సంశయాన్ని ఈ క్రింది శ్లోకం పోగొడుతుంది. "అనంత శాస్త్రం బహువేదితవ్యం, స్వల్పశ్చకాలః బహవశ్చవిఘ్నాః యత్సారభూతం తద్వేదితవ్యం, హంసో యథాక్షీరమివాంబురాశేః" శాస్త్రాలు ఎక్కువ. కాలం తక్కువ. కనుక హంసపాలను గ్రహించి నీటిని విడిచినట్లే సారాన్ని గ్రహించి, నిస్సారాన్ని విడిచి పెట్టాలి అని దీని భావం. జీవియొక్క స్థితి ఇలా వివరించబడింది.

"ధనానిభూమౌపశవశ్చగోష్ఠే నారీ గృహ ద్వారి జనాః శ్మశానే।
దేహశ్చితాయాం పరలోకమార్గే కర్మానుగోగచ్ఛతి జీవఏకః॥"

అనగా ధనం, పశువులు, భార్య, బంధువులు ఇక్కడే ఉంటారు. కర్మబద్ధుడైన జీవి మాత్రం పరలోకం వెళతాడు.

శక్తి ప్రపంచానికే మూలాధారం. శక్తి గురించి లలితా సహస్రంలో ఇలా ఉంది. "చిచ్ఛక్తిశ్చేతనారూపాజడశక్తిర్జడాత్మికా" చిచ్ఛక్తి, చేతనశక్తి, జడశక్తి అన్నీ శక్తియే ఈ శక్తి గురించి సప్తశతిలో ఇలా ఉన్నది. "త్వం హ్రీస్త్వం, బుద్ధిర్బోధలక్షణా" శక్తి బుద్ధి రూపంలోనూ, సిగ్గు రూపంలోనూ, జ్ఞానరూపంలోనూ ఉంటుంది. ఇదే భావాన్ని ఈ క్రింది శ్లోకం వివరిస్తుంది.

"యాదేవీ సర్వభూతేషు లజ్జా రూపేణ సంస్థితా।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః॥

శక్తిని గురించి అధర్వశీర్షంలో ఇలా ఉంది. "అహం బ్రహ్మ రూపిణీ, మత్తః పకృతి పురుషాత్మకం సర్వం జగత్" "శూన్యం చ అశూన్యంచ" అంటే శక్తి పరబ్రహ్మ స్వరూపం. ఈ శక్తి నుండే ప్రకృతి పురుషరూపమైన జగత్తు ఆవిర్భవించింది. శూన్యము, అశూన్యము రెండు శక్తినుండే వచ్చాయి. "తామగ్నివర్ణాం తపసాజ్వలన్తీం, వైరోచనీం కర్మఫలేషు జుష్టాం, దుర్గాందేవీం .." ఈశక్తి

తపోమయమై అగ్నికాంతితో ప్రకాశిస్తుంది. ఈశక్తే కర్మఫలాలకు కారణం. "సైషాసత్త్వరజస్తమాంసి" అని ఇంకో చోట గలదు. ఈశక్తే సత్త్వరజస్తమో గుణాలుగా మారుతుంది.

ఈశక్తి సూర్యమండలంలో ఉంటుందని ఈ క్రింది వాక్యం సూచిస్తుంది. "సూర్యమండల మధ్యస్థాం, దేవీం త్రిపురసుందరీం" ఇలాగే ఈ శక్తికి బ్రహ్మ విష్ణు రుద్రులు, మంచంకోళ్లుగా మారారనీ భావం గల ఈ శ్లోక పాదాన్ని గమనించండి. "గతాస్తే మంచత్వం ద్రుహిణ హరిరుద్రేశ్వరభృతః" "లోకస్య ద్వారమర్చి మత్పవిత్రమ్" అనే వాక్యం శక్తియొక్క లోకద్వారం కాంతిమంతంగా ఉంటుందని తెలుపుతుంది. శక్తియొక్క మాహాత్మ్యాన్ని ఇలా వివరించారు శ్రీ శంకర భగవత్పాదులు.

"శివశ్శక్త్యాయుక్తః యదిభవతిశక్తః ప్రభవితుమ్
నచే దేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి
అతస్త్వామారాధ్యం హరిహర విరించాదిభిరపి
ప్రణన్తుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి"
"తనీయాంసం పాంసుం తవచరణ పంకేరుహ భవమ్
విరించి స్సంచిన్వన్ విరచయతి లోకా నవికలమ్
వహత్యేనం శౌరిః కథ మపి సహస్రేణ శిరసాం
హరస్సంక్షు ద్యైనం భజతి భసితోద్ధూలన విధిమ్"

అనగా ఈశ్వరుడు శక్తితో కూడితేనే సమర్థుడు. లేనిచో ఏందుకు కొఱగాడు. శక్తి పాదరజాన్ని స్వీకరించి బ్రహ్మ విష్ణు రుద్రులు సృష్టి స్థితిలయాల్ని చేస్తున్నారు. ఈశక్తి సర్వకాంక్షల్ని నెరవేరుస్తుంది. అందుకే సప్తశతిలో ఇట్లు ఉన్నది. "రూపం దేహి యశో బలం దేహి ద్విషోజహి". ఇందులో రూప యశోబలాన్ని ఇవ్వమని, శత్రు సంహారం చెయ్యమని ఉన్నది. అయితే ఇట్లు నిరూపింపబడ్డ శక్తికీ ఈశ్వరునకు భేదం లేదు. శక్తి లేని ఈశ్వరుడు కాని, ఈశ్వరుడు లేని శక్తికాని ఉండదు. తత్త్వజ్ఞులు "చంద్రచంద్రికయోరివ" అని వీరి సంబంధాన్ని వివరించారు. అంటే చంద్రునికీ, వెన్నెలకు గల సంబంధము వంటిది వీరి సంబంధము. బ్రహ్మ, విష్ణు, శివులు వాణీ, లక్ష్మీపార్వతులను జిహ్వావక్షశ్శరీరాలలో ధరించారు. అంటే శక్తులు లేని ఈశ్వరులుబేరని భావము. భావం లేని మనిషి కొఱగానట్లే శక్తులు లేని

దేవులు కొలిచారు. వైష్ణవులు విష్ణ్వాధిక్యాన్ని, శైవులు శివాధిక్యాన్ని చెప్పినా వాస్తవంగా వీరిద్దరికీ భేదం లేదు. ఒకే మనిషి ముగ్గురుగా మారినట్లు కాళిదాసు "ఏకైవమూర్తిః బిభిదే త్రిధాసా" అనే శ్లోకంలో వివరించారు. హరిహరాద్వైతం వల్లనే మతవైషమ్యాలు తొలగి తత్త్వజ్ఞానం కలుగుతుంది. ఈ భావం మనుషులకు సమంజసమైనదేనన్నట్లు తిక్కన సోమయాజి యొక్క ఈ క్రింది శ్లోకం గమనించండి.

"కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవస్వాదు వద ప్రభో మే"

అనగా హరిహరనాథదేవా! నీవు కపాల మాలా కౌస్తుభాలలో దేనిని అలంకరించుకోవాలనుకొంటున్నావు? నీకు కాలకూట యశోదా స్తన్యాలలో ఏది ఇష్టమైంది? అని దీని భావం. మనం పంచాయతనంలో కూడా హరిహరాద్వైతాన్ని ఎలా భావిస్తున్నామో చూడండి.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః"

అనగా శివుడు విష్ణువునకు, విష్ణువు శివునకు హృదయం అని దీని భావము. రుద్రాభిషేకం చదివేటప్పుడు చదివే నమకచమకాలలో ఇట్లు ఉన్నది. "నమో రుద్రాయ విష్ణవే" ఈ మంత్ర భాగం రుద్రుడైన విష్ణువుకు నమస్కారాన్ని చెబుతుంది. పైగా శివుడు విష్ణువు అనే భేదాన్ని చూస్తే నరకం ప్రాప్తిస్తుందని పురాణాలు చెబుతున్నాయి. దీన్ని అందరూ అంగీకరించారు. పురాణాల్లో శివుడిని విష్ణువు, విష్ణువుని శివుడు స్తుతించుకున్నారు. శ్రీ శంకర భగవత్పాదులవారు శ్రీ వాణీ గిరిజలకు అభేదాన్ని కనకధారా స్తవంలో ఇట్లు చెప్పారు.

"గీర్దేవతేతి గరుడధ్వజ సుందరీతి
శాకంభరీతి శశిశేఖర వల్లభేతి
సృష్టి స్థితి ప్రళయకేళిషు సంస్థితాయై
తస్యై నమస్త్రిభువనైక గురోః తరుణ్యై ॥

ఇందువల్ల లక్ష్మీవాణీపార్వతులు ఒకటేనని తెలియుచున్నది. వారు ఒకటే అగుటచేత బ్రహ్మ, విష్ణు, రుద్రులు కూడా ఒకేమూర్తి అని తెలియుచున్నది. హరిహరాద్వైత భావంతో అచ్యుతాశ్రముడనే కవి ఈ విధంగా అంటున్నాడు.

"భీమాకృతిం వా రుచిరాకృతిం వా
త్రిలోచనం వా సమలోచనం వా
ఉమాపతింవాథ రమాపతిం వా
హరిం హరం వా మునయో భజన్తే"

అనగా భీషణాకారం గల శివుడైనా, సుందరుడైనా విష్ణువు అయినా ఒకటే. ముక్కంటి అయినా ద్వినేత్రుడయినా ఒకటే. ఉమాపతి అయినా రమాపతి అయినా ఒకటే అని దీని భావం. శ్రీశంకరాచార్యులవారు తనతల్లి అవసానకాలంలో మొదట శివుణ్ణి తరువాత విష్ణువునూ ధ్యానించారు. అంటే హరిహరులు ఒకటే అని ఆయన దృఢాభిప్రాయం. కనుక హరిహరాద్వైతాన్ని పాటించి మనమంతా విశ్వశ్రేయస్సును సాధిద్దాం. సౌమనస్యాన్ని పొందుదాం.

# * కర్మసిద్ధాంతము-రోగహేతుపరిశీలన

వీరసింహావలోకం అనే గ్రంథంలో కర్మలు వాని ఫలాలు విపులంగా చర్చించ బడ్డాయి. పురాణాలలో రోగకారణాలను వ్యాసమహర్షి చర్చించారు. ముందుగా జ్వరాలనుగూర్చి ఆలోచిద్దాం. ఎవరైతే గతజన్మలో లోభులై, క్రూరులై పరులను బాధిస్తారో వారీజన్మలో జ్వరపీడితులవుతారు. మంచి పనులకై వెనుకాడే వానికి ఉష్ణ జ్వరాలు వస్తాయి. అగ్నిప్రమాదాలకు కారణ భూతులైనవారికి కూడా జ్వరాలువస్తాయి.

"యే పునః క్రూరకర్మాణః
పాపాః పిశున చేతసః ॥
తేభవేయు స్సదాశీత
జ్వరవన్తశ్చ తత్పరాః" ॥

అనే పురాణ శ్లోకం ప్రమాణము.

"అతిసారీచ భవతి యస్త్రేతాగ్ని వినాశకః" అనే ప్రమాణం వలన త్రేతాగ్ను లను ఆర్పితే అతిసారరోగం వస్తుందని తెలియుచున్నది. చెరువులను పడగొట్టినా ఆ రోగం రావచ్చును. పతివ్రత అయినభార్యను పరిత్యజించినవానికి గ్రహణీరోగం వచ్చును.

"సాధ్వీం భార్యాం చ యో మర్త్యః పరిత్యజతి కామతః
గ్రహణీ రోగసంయుక్తః సదా భవతి మానవః ॥

అనేశ్లోకంలో పైభావం ఇమిడియున్నది. ధనం తీసుకొని విద్యను బోధించడం జప-హోమాదులను చేయడం అర్శరోగానికి (పైల్స్) కారణము. దీనికి గోవధ మరొక కారణం. అజీర్ణరోగానికి శాస్త్రాలలో ఈ క్రింది కారణములు ఉన్నాయి. 1. అన్నమును అపహరించడం 2. నియమరహితుడు, పాపిష్ఠియైనవానినుండి ఆహారం గ్రహించడం 3. గోమాంసాన్ని తినడం 4. విషాహారం ద్వారా ప్రమాదాన్ని కలిగించడం 5. త్రేతాగ్నులను నశింప చేయడం.

ఆవులను, ఏనుగులను, గుఱ్ఱాలను హింసించడం వలనక్రిమిరోగాలు వస్తాయి. పూజ్యులు, గుణవంతులు, దేవతలద్రవ్యాన్ని అపహరించడంవలన రక్తహీనత కలుగును.

* సప్తగిరి, జూన్ 1984 ప్రకటితము

ఆహారాన్ని అపహరించడం వలన కామిలారోగం వస్తుంది. ఈ విషయం "కామలీ భక్త-చోరస్స్యాత్" అనే ప్రమాణంలో ఉన్నది. వైద్యశాస్త్రం చదివి గర్వంతో మందులను విరుద్ధంగా ప్రయోగించుటవలన రక్తపిత్త రోగం వస్తుంది. వైద్యవిషయంలో ఏ విధమైన దుర్భావం వల్లనైనా ఈ రోగం రావచ్చును.

క్షయరోగానికి పురాణాలలో ఈ క్రింది కారణాలు చెప్పబడ్డాయి. 1. హత్య చేయడం 2. ఇతరుల వస్తువులను అపహరించడం 3. ఇతరులభాగ్యానికి అసూయ పడడం 4. పొలాలను అపహరించడం 5. గర్వంతో శాస్త్రంచదవకుండగనే ప్రాయశ్చిత్తాలను తెలుపుట. వీటివలన క్షయ మాత్రమేకాక రొమ్ములోనొప్పి, స్వరభేదం కూడారావచ్చు. వీటిలో నాలుగవకారణం "క్షయీస్యాత్ క్షేత్రహరణాత్" అని పద్మ పురాణంలో చెప్పబడింది. ఐదవకారణానికి ప్రమాణం బ్రహ్మాండ పురాణంలో ఇట్లు ఉన్నది.

"ధర్మశాస్త్రి నభిజ్ఞోయః ప్రాయశ్చిత్తం దదాతివై
రాజయక్ష్మ భవేత్తస్య రోగపీడాతి దారుణా" ॥

అనగా ప్రత్యుపకారం చెయ్యక పోవడం, అపకారం చేయడంవలన కాస రోగం కఫ, శ్వాస, వాత, పైత్య జ్వరాలు వస్తాయి.

"కృతఘ్నో జాయతేమర్త్యః కఫవాన్ శ్వాసకాసవాన్ ॥
ఉష్ణజ్వరీ చ నిత్యం హి పిత్తరోగ సమన్వితః ॥

అనే శ్లోకంలో పై భావాన్ని తెలియచేస్తుంది. కురుక్షేత్రాది పుణ్యస్థలాలలో గ్రహణకాలంలో అపాత్రులనుండి దానాలు గ్రహించేవాడు అపాత్రుడై పై రోగాలను పొందుతాడని శాస్త్రంలో ఉన్నది. గురువుతో వాదించడంవలన కంఠం బొంగురు పోతుంది అని వాయుపురాణం చెపుతుంది.

హోమం చెయ్యడానికి సంకల్పించి స్నానంచేసి హోమం చెయ్యకపోవడం, హోమం చెయ్యకనే భుజించుటం వలన ఎక్కిళ్లు వస్తాయి. అశ్రద్ధ, అహంకారాలతో దానం చెయ్యడం వలన రుచి లేకపోవుట, కడుపునొప్పి వస్తాయి. కేశాలు, పురుగులతో కూడిన అన్నంపెట్టడం, జంతువులు తాకిన ఆహారం ఇవ్వడంవలన, విశ్వాస ఘాతుకత్వం వలన, ఛర్దిరోగం వస్తుందని శాస్త్రాలలో ఉన్నది.

"పాంథమధ్వపరిశ్రాంతం బ్రాహ్మణం గామథాపివా ॥
నపాయయేజ్జలం యస్తు సతృష్ణా మూర్ఛితో భవేత్" ॥

అనగా దప్పికగొన్న గోవుకు, మానవులకు నీరివ్వక పోవడం వలన దప్పిక వ్యాధులు కలుగుతాయని చెబుతోంది.

ఉన్మాదానికి కారణాలుఇవి 1. దొంగతనం 2. నిషిద్ధవస్తువులను అనుభవించడం 3. ఇతరులనువంచించి వృద్ధులను గురువులను పరిహాసించడం 4. శాస్త్రంతెలిసీ తెలియదనడం 5. మంత్రాలను ఎగతాళిచేయడం. అగ్నిలో ఉమ్మివేయడంవలన శరీర తాపము, మంటలూ కలుగుతాయి. ప్రభువులను సంహరించడం, హింసించడం వలనే అపస్మారం కలుగుతుంది.

వాతం శరీరంలో చేరడంవలన వాతసంబంధ రోగాలువస్తాయి. ఈ రోగాలకు అనేకకారణాలు ఉన్నాయి. 1 గురువుకు శత్రువుగామారడం 2. దేవతల, బ్రాహ్మణుల ధనాన్ని అపహరించడం 3. స్వామిద్రోహం 4. విషప్రయోగం చెయ్యడం, అనురాగంలేని స్త్రీని అనుభవించడం వలన ధనుర్వాతం వస్తుంది. బోధాయన మహర్షి సిద్ధాంతం ప్రకారం చోరత్వమే వాతవ్యాధికి కారణము. పరస్త్రీ గమనంవలన వాత రక్తం శరీరంలో చేరి బాధిస్తుంది.

హోమానతరం అగ్నులను ఆర్పడంవలన ఆమవాతం లేక ఊరుస్తంభంగాని వచ్చును. వేదపాఠకు, వేదాధ్యయనంచేసినవాడు అయిన ఉత్తముడిని ఆహ్వానించి తిరస్కరించినవానికి కడుపునొప్పి వస్తుంది. సంధ్యావందనాది కర్మలు మానినవారికూడ ఈ రోగం వస్తుంది. తల్లిదండ్రుల సరస భాషణం విన్నవారికి కర్ణశూల, చెవుడువస్తాయి. హింసాప్రవృత్తి కలవానికి శూలరోగం వస్తుందనడంలో "శూలేన భవతి మనుష్యాణాం చ హింసకః" అనేది ప్రమాణము. ఉదావర్త రోగానికి, పాదాలమంటకు దేవాలయాలు కొలాలు, చెరువులు, బావులను పడగొట్టటమే కారణము.

గురువుతో శత్రుత్వాన్ని సాధించడం వలన వాతగుల్మ రోగం వస్తుంది.

అగమ్యాగమనం వలనకూడా పైరోగం వస్తుందని పద్మపురాణం చెప్పుతున్నది ఇతరుల మనస్సును బాధించేవానికి హృద్రోగం వస్తుంది. గురువుపై అసూయచెందే వానికి,పగలు స్త్రీ సౌఖ్యం పొందేవానికి మూత్ర కృచ్ఛ్రం వస్తుంది. "సురాపో మూత్ర కృచ్ఛ్రీస్యాత్" అనే బోధాయన సిద్ధాంతం ప్రకారం మద్యపానం పైరోగానికి కారణం అని చెప్పవచ్చు.

పరస్త్రీని పరాభవింపడం అశ్మరీబాధకు హేతువు. కన్యాగమనంవలన వాతం చేరి ప్రమేహరోగం వస్తుందని శాస్త్రవచనం. సోదరీజన సమాగమనం వలన మధుమేహం వస్తుంది. "దధి చౌర్యేణ పురుషో జాయతే మేద సాయుతః" అనే ప్రమాణం పరిశీలిస్తే పెరుగును దొంగిలించటమే మేదోరోగానికి కారణం. ఉదర రోగం రావటానికిగల కారణాలు ఇవి.

1. త్రిమూర్తులలో భేదాన్ని చూడడం. 2. న్యాయనిర్ణేతగాఉండి ప్రభువు నుండి ధనంపొంది దుర్వ్యయం చెయ్యడం. 3. గురుతుల్య స్త్రీని అనుభవించడం. "ఉదర వ్యాధియుక్తస్స, భవేద్గుర్వంగ నాగమే" అనే ప్రమాణం పైదానికి వర్తిస్తుంది.

మార్గమధ్యం, ఇసుకనేల, పర్వతము, వెలగచెట్టునీడలలో మలవిసర్జన చేయడంవలన శ్వమధురోగం (ఉబ్బుట) వస్తుందనటంలో సందేహంలేదు. అంగాలకు చెందిన అన్నిరోగాలకు కారణాలుఇవి. 1. సోదరీ పుత్రికాతుల్య జనులను మోహించడం 2. తప్పులేకుండగనే స్నేహితుల హస్తపాదాదులను ఛేదించడం 3. యజ్ఞంలో విఘ్నాన్ని కలిగించడంవలన అస్త్రవృద్ధి వస్తుంది. గురుద్వేషం, హింస గండమాలక కారణాలు, ఇదిమను సిద్ధాంతము. అభక్ష్యభక్షణంకూడా కారణమే.

విధవాగమనంవల్ల రక్తార్బుదరోగం కలుగుతుంది. స్వగోత్రకాంతాభి గమనం వలన శ్లీపదరోగం వస్తుంది. "విద్రధీఫల హర్తాస్యాత్" అనేప్రమాణం పరిశీలించడంవలన ఫలాపహరణం విద్రధికి హేతువు. గర్వక్రోధ స్నేహభయాలవలన ధర్మాన్ని మార్చి చెప్పడంవలన వ్రణాలు కలుగుతాయి.

"అతిమానాదతి క్రోధాదతి స్నేహాత్ భయాదపి ।
యోధర్మ నిశ్చయం జానన్ అన్యథా కురు తేతు యః
స పూయ శోణితవహ వ్రణీ భవతి మానవః"

అనేది పైదానికి ప్రమాణము. ధర్మనిర్ణయం చెయ్యడానికి ప్రభువు నుండి ధనాన్ని పొంది, అధర్మం చెప్పేవానికి భగందర వ్యాధి వస్తుందని శాస్త్రవచనము

"యోగహీత్వా ద్విజో మోహాత్ నియుక్తో ధర్మనిశ్చయే ॥
భగందరో భవేత్తస్య హ్యధర్మం వదతో ముఖాత్" ॥

అనేది భగందరానికి మూలమైన శ్లోకం. మాతృతుల్య స్త్రీ పరాభవంవల్ల జంతువులు కాటువేస్తాయి జంతువులను చంపడంవలన కుష్ఠురోగం వస్తుంది. ఈ విషయంలో "యోనరోహన్తి జంతూన్ కుష్ఠరోగీ భవేత్తు సః "అనే ప్రమాణం ఉన్నది. "కుష్ఠిస్తేయీ నరోభవేత్" అనే వాయుపురాణవచనం వలన దొంగతనం కూడా కుష్ఠురోగానికి కారణము అని చెప్పవచ్చు. ఇతరుల సుఖాలపై అసూయపడడం దురదలకుకారణము. స్వర్ణచౌర్యం దద్రువులకు కారణము. గడ్డిమోపులను తగుల పెట్టడంవలన తామరవస్తుంది.

"సర్వైస్తుయః ఖాదమతి స విసర్పీ భవేన్నరః" అనే దానివలన, సర్పాలచే కరిపించడం గజ్జికికారణమని తెలుస్తుంది. వ్రతదీక్షను చెడగొట్టడంవలన చర్మరోగాలు వస్తాయి. అనారోగ్యంతో ఉన్న గోవుపాలు త్రాగటంవలన స్ఫోటకం వస్తుంది. కాకి, గాడిదల మాంసాలు తినడంవలన ప్రక్కలలో స్ఫోటకం వస్తుంది. దేవునికై నిర్ణయింపబడిన వస్త్రాలను అమ్మి ధనం పొందేవానికి వల్మీకరోగం (కాళ్లపై పుట్ట ఆకారంలో కురుపులు రావడం కలుగుతుంది. ఇతరుల నియమాలను చెడగొట్టేవానికి రహస్య ప్రాంతాలలో పుండ్లు వస్తాయి.

మలవిసర్జనానంతరం ప్రక్షాళన లేకుండా భుజించేవానికి మలాశయరోగం వస్తుంది. విషం, ఉరి మొ॥ ప్రయత్నాలవలన ఆత్మహత్య చేసికొన్నవానికి పై జన్మలో తెలియబడని వ్యాధివస్తుంది.

ధర్మం స్వీకరించి వదిలివేయడం, లేనిదోషాలను చెప్పడంవలన ముఖంనుండి దుర్గంధం వస్తుంది. ఇతరుల మాటను క్రూరంగా ఖండించడంవలన ముఖరోగం వస్తుంది. అసత్యభాషణం, పరజిహ్వచ్ఛేదం, కారణం లేకుండా పక్షపాతాన్ని చూపడం వలన ముఖంలో కురుపు వస్తుంది. అసత్యసాక్ష్యం వలనకూడా ముఖరోగం వస్తుంది.

తల్లిదండ్రుల శృంగార వచనాలను వినడం వలన చెవుడు, క్రమంగా తలలో నాదు కలుగుతాయి. దేవతలు, పూజ్యులు, గురువుల గూర్చి నిందలను వినడం వలన చెవిపోటు, చీము కలుగుతాయి. మంచి అలవాట్లు లేకపోవడంవలన చెవిలో పురుగులు రావచ్చు. ఇతరులలోఉన్న దోషాలను, ప్రచారం చెయ్యడంవలన, ముక్కుకుగల రోగాలు వస్తాయి. ముక్కునుండి దుర్గధం వస్తుంది. సత్కర్మలు ఆచరించే సమయంలో కోళ్లు, గాడిదలను, లోలుపత్వంతో చూసేవానికి ముక్కు పై

వ్రణాలువచ్చును. ఇతరులకు అంధత్వం కలిగంచడం, వైద్యుడై రోగాలు పెంచడం పరస్త్రీలను కామంతో చూడడంవలన నేత్రరోగాలువస్తాయి. దంపతుల శృంగార చేష్టలను చూడడం మధ్యాహ్నకాలంలో సూర్యుని, నక్షత్రాలను చూడడంవలన కంటి చూపు తగ్గును.

దేవాలయాలలో దీపాలను ఆర్పడంవలన కంటిలో పొరలు, రేచీకటి వస్తాయి ఈ విషయంలో "దీపకం భంజయి త్వాతు తిమిర వ్యాధిమాన్ భవేత్'' అనే ప్రమాణం ఉన్నది. గురువులను అడ్డగించడంవలన తలపోటు వస్తుంది. వ్రతాన్ని మధ్యలో విడవడం వలనకూడా పైరోగం వస్తుంది. "బ్రహ్మచారీ యదాశ్నీయాత్ భిన్నపాత్రే విశేషతః'' ఏకదేశ శిరోరోగీ భవతీత్యాహః నారదః'' అనే నారదుని వాక్యం ఇక్కడ ప్రమాణం. బ్రహ్మచర్యం పాటిస్తూ పగిలిన కంచుపాత్రలో భోజనం చెయ్యడం వలన పార్శ్వపు తలనొప్పి వస్తుందని నారదమహర్షి స్ఫుటంగా చెప్పుచున్నారు.

బాలుని హింసించడం వలన ప్రదరరోగం వస్తుంది. గురువులు, మాతర, పితరులతో కలహించడం కూడా ఇందుకు కారణమే. బ్రహ్మచర్యం లేకపోవడంవల్ల స్త్రీల రోగాలు వస్తాయి.

పరపురుష చింతనవల్ల స్తనరోగాలు వస్తాయి. శ్రాద్ధాలను చెడగొట్టడం, చౌర్యం వలన మృతశిశు జననాలు కలుగుతాయి. చేయరాని పనులను చెయ్యడంవలన చిన్నతనంలో అనారోగ్యం కలుగుతుంది విషప్రయోగం, సర్పాలచే బాధ కలిగించడం వలన విషబాధ కలుగుతుందని శాస్త్రంనొక్కి వక్కాణిస్తుంది.

చేసిన మంచి పనులను చెప్పుకోవడం వలన జుట్టుత్వరగా తెల్లబడును. స్త్రీలనుఅమ్మి జీవించడం, కన్యలను దూషించడం, అధములతో కలసి వ్రతభంగాన్ని పొందడం, మొ॥ గు కర్మలవలన నపుంసకత్వం ప్రాప్తిస్తుంది.

ఈ విధముగా ప్రాచీన గ్రంథాలలో హేతుహేతు మద్భావాలతో సర్వ రోగాలకు కారణాలను ప్రాచీనులు స్పష్టంగా నిర్ణయించారు. రోగకారణాలను ఋషులవలన తెలిసికొని సత్కర్మాచరణం వలన రోగహతులం, జితేంద్రియులం శతాయుష్కులం కావడానికి ప్రయత్నించడం మన కర్తవ్యము.

# శ్రీవర్ధమాన మహావీరస్య జీవనమ్ ఉపదేశశ్చ*

ఋషభమహాదేవుడు ఇరువదినాలుగు తీర్థంకరులలో మొదటివాడు. చివరివాడు వర్ధమాన మహావీరుడు. ఇతడు బుద్ధుని కంటె పూర్వుడు. ఇతని తల్లిదండ్రులు దేవానంద ఋషభదత్తులు. సౌధర్మేంద్రుడు పంపిన దేవదూత దేవానంద గర్భంలో ఉన్న మహావీరుడిని సిద్ధార్థమహారాజు భార్య అయిన త్రిశలాదేవి గర్భంలో ఉంచాడు. గర్భంలో ఉన్నప్పుడే వర్ధమానుడు బాధలేకుండాచేసి తన మాతృభక్తిని వెల్లడించుకున్నాడు. చైత్ర శుద్ధ త్రయోదశినాడు అర్ధరాత్రి సమయంలో గ్రహాలన్నీ ఉచ్చస్థానాల్లో ఉండగా మకరలగ్నంలో జన్మించాడు మహావీరుడు.

వర్ధమానుడు బాలురతో ఆడుకునే సమయములో ఒక సర్పం వచ్చింది. కాని వర్ధమానుడు నిర్భయంగా సర్పాన్నిపట్టుకొని దూరంగా విసరివేసాడు. ఇతడిని పరీక్షించడానికి సర్పరూపంలో వచ్చిన దేవతకూడా చాలా ఆశ్చర్యపడింది. దేవతలందరూ మహావీరుడిని ప్రశంసించారు. ఆనాటి నుండి వర్ధమానుడు మహావీరుడయ్యాడు.

ఉపాధ్యాయుడు మహావీరునకు పాఠాలు బోధించే సమయంలో ఒక పండితుడు వచ్చి వ్యాకరణప్రశ్నలకు సమాధానం చెప్పమని ఉపాధ్యాయుడిని అడిగాడు. ఉపాధ్యాయుడు మౌనం వహించగా అతని అనుమతిపై వర్ధమానుడు సమాధానాలు చెప్పి ఆశ్చర్యంలో ముంచెత్తాడు. ఆ విషయాలు తరువాత స్వతంత్ర వ్యాకరణంగా రూపొందాయి. ఆపండితుడు ఎవరోకాదు ఇంద్రుడు. ఆ తరువాత కాలంలో దయామయుడైన మహావీరుడు ఎన్నో పశుదీక్షలను మాన్పించాడు.

యౌవనంలోనే తపస్సు చేయాలని సంకల్పించాడు వర్ధమానుడు. అయినా తల్లి కోరికను అనుసరించి సమరవీర మహారాజుకూమార్తె అయిన యశోదను వివాహమాడాడు. త్యాగమే జీవిత పరమోద్దేశం అని భావించిన మహావీరుడు ఒక సంవత్సరంపాటు ఎన్నో దానధర్మాలు చేసాడు. చివరకు మార్గశీర్షశుద్ధదశమినాడు

* ఆల్ ఇండియా రేడియో, విజయవాడ ద్వారా ప్రసారితము 16-4-1989

సర్వాన్ని పరిత్యజించి వస్త్రాన్నికూడా పరిత్యజించాడు. అప్పుడు ఇంద్రుడే వచ్చి దేవతావస్త్రాన్ని ఇచ్చాడు. ఆ దేవతావస్త్రాన్ని సోమశర్మ అనే పండితునకు దానం చేసాడు మహావీరుడు. ఆకాలంలోనే జనులను బాధిస్తూ సంచరించుచున్న శూలపాణి అనే యక్షదేవతను తన దివ్యశక్తితో శాంతిదేవతగా మార్చాడు మహావీరుడు.

ఆయన తపస్సు చేసే సమయంలో చండకౌశకమనే మహాసర్పం కాటు వేసింది. అయినా కోపించక దాన్ని సాధువుగా మార్చాడు. ఇట్లే ఒకసారి నౌకలోని ప్రయాణికులందరినీ తుపాను నుండి కాపాడాడు. తన తపఃప్రభావంచే అగ్నినికూడా శాంతింపచేసాడు. సంగమదేవుడు ఎన్నో విఘ్నాలు కలిగించినా తన తపోదీక్షను విడువలేదు.

జృంభక గ్రామసమీపంలోని ఋజువాలుకా నదీతీరంలో మహావీరునికి జ్ఞానం కలిగినది. "అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహాలవల్ల మోక్షం" పొందవచ్చు అని మహావీరుడు బోధించాడు. నేటి ప్రపంచానికి మహావీరుని బోధలెంతో ఆవశ్యకాలు.

# సుముహూర్త బలాబలపరిశీలనము

## శ్రీత్రిపురాన్తకేశ్వరాలయం - జీర్ణోద్ధరణ

శ్రీ గురుదేవులైన శ్రీ శ్రీ శ్రీ త్రిపురానంద నాథుల వారు ది 19-3-94 సాయంకాలము ఫోను చేసి ఆలయోద్ధరణకు ది 25-4-94 ఉదయం గం 9-57 ని లకు జగన్మాత సుముహూర్తమును నిర్ణయించినదనియు శాస్త్రదృష్టితో దాని బలాబలములను పరిశీలించుమనియు నన్నాదేశించినారు.

శ్రీభావనామ సంవత్సర చైత్ర శుద్ధ పూర్ణిమ సోమవారము అనగా ది 25-4-94 ఉదయం గం 9 57 ని లకు చిత్రానక్షత్ర యుక్త మిథునలగ్నమందు. సుముహూర్తము నిశ్చితము. పరిశీలింపగా అది కుంభనవాంశ. పుష్కరాంశకాదు. పుష్కరాంశము గం. 10.31 నుండి గం. 10.34 మధ్య ఏర్పడును. ఈ ముహూర్తమునకు పంచక రహితమైనది. శుభము. వర్జ్యము రాత్రి గం. 10 42 నుండి ప్రారంభమగును. కావున వర్జ్యఘడియలు లేవు. శుభమే. ఆరోజు దమనోత్సవము. కర్తరిలో వాస్తు గృహకర్మలు చేయరాదు. కర్తరి ది. 4-5-94 నుండి 28-5-94 వరకు గలదు. కావున ముహూర్తకాలమునకు కర్తరి దోషములేదు. ఆ రోజు రాహుకాలము గం. 7.30 నుండి గం. 9.00 వరకు మాత్రమే. గుళిక కాలము మధ్యాహ్నము గం. 1.30 నుండి గం 3.00 వరకు గలదు. కావున పై దోషములు ముహూర్తమునకులేవు. పంచాగములయందు గం. 10.32, గం. 10.34 ని. లకు ముహూర్తములు నిర్ణయించబడినవి. ఇది మానవదృష్టి పరిశీలింపగా ఆరోజు ది. 10.30 నుండి యమగండము ప్రారంభమగుచున్నది. ఇది ఎక్కువగా తమిళదేశీయులకే వర్తించునందురు ఆ దినము వజ్రయోగము. శుభకర్మలకు నిషిద్ధము. కానీ ఆయోగము నందు మొదటి రెండు ఘడియలు మాత్రమే దోషయుక్తములు. ముహూర్తమునకు అవి ఎప్పుడో దాటిపోయినవి. అదిరవిహోరయగుచు. దుర్ముహూర్తము గం. 12-21ని.ల నుండి ప్రారంభమగును. కావున దుర్ముహూర్త దోషము లేదు.

1995, జులై "భవిష్యవాణి" లో ప్రచురితము

ఉత్తరాయణమున ప్రతిష్ఠగానీ, ఉద్ధరణగానీ మంచిది. "శ్రేష్ఠోత్తరే ప్రతిష్ఠాస్యాదయనే ముక్తి మిచ్ఛతామ్" అనిశైవ సిద్ధాంత శేఖరము చెప్పుచున్నది.

ముక్తికామునకు ఉత్తరాయణము మంచిది. సోమవారము క్షేమకరము. ముఖ్యంగా శివాలయమునకు సోమవారము మిక్కిలి మంచిది. లగ్నమునకు అష్టమశుద్ధిగలదు. కుంభనవాంశ దోషము గదా యనినచో అట్లుగాదు. కుంభము ఆధ్యాత్మికత్వమునకు ప్రతీకమని జ్యోతిష గ్రంథములన్నియు అంగీకరించెను. అదియుగాక, స్థిర, ద్విస్వభావనవాంశతే శుభకరములని శాస్త్రము. కుంభనవాంశ స్థిరనవాంశ "లగ్నే స్థిరద్విస్వభావనవాంశా: శుభవహాః" అని ప్రమాణము.

మిథున లగ్నము శివ సంబంధకర్మములకు ఉత్తమమని శాస్త్రము చెప్పుచున్నది. "మిథునే మహేశః" అని శ్రీపతి "త్రయోదశీ పంచదశీ తిథయస్స్యుః శుభావహాః" అని శాస్త్రము. పూర్ణిమ జీర్ణ శివాలయోద్ధరణకు శుభము. చైత్రమాసము ప్రతిష్ఠాదులకు శుభకరమే.

"చైత్రేవా ఫాల్గునే వాపి జ్యేష్ఠేవా మాధవేఽపివా
మాఘే వా సర్వదేవానాం ప్రతిష్ఠా శుభదా భవేత్"

అని మత్స్యపురాణం చైత్రము శుభకరమని చెప్పుచున్నది. చిత్రానక్షత్రము మంచిది. 'హస్తాత్రయమ్' అని శాస్త్రవచనము.

లగ్నమునకు కుజ వీక్షణ సమంజసమా ? అను ప్రశ్న కలుగును. ముహూర్త నక్షత్రాధిపతి కుజుడగుటవలన కుజదోషము గాదు. బృహస్పతి శుభవీక్షణ లగ్నమునకు సంపూర్ణముగా గలదు.

ముహూర్త లగ్నమునకు రవి ఏకాదశస్థానమునందుండి సర్వదోషములనూ పోగొట్టుచున్నాడు. దేవతాప్రతిష్ఠలకు నిర్ణయింపబడినవే సాధారణంగా జీర్ణాలయోద్ధరణకు కూడా పనికి వస్తుంది ముహూర్త విషయంలో కాలామృతం ఇలా చెప్తుంది.

"వారేష్వేవ కవిజ్ఞ జీవ శశినాం శ్రాణత్రయే చోత్తరా
మైత్రాదిత్య కర ద్వయాంత్య శశభృద్ధస్తే ప్రజే శోడుషు
భద్రా పూర్ణ జయాసు చోదగయనే శుక్రేజ్యయోర్వ్యక్తయోః
కుర్యాత్కామదినం విహాయ చకుహనాందేవ ప్రతిష్ఠాం శుభామ్
కాలామృతే-7-1.

సోమవారం, ఏకాదశి పనికిరాదు. కానీ పూర్ణిమ శుభకరమే. యమకంటక యోగం కాని శూన్యతిథులుగాని కావు.

"అశ్వనీ,రోహిణి చైత్రే శూన్యభే పరికీర్తితే"- అని వశిష్ఠుని వచనము. ఇది శూన్య నక్షత్రం కాదు. చైత్రంలో కుంభం శూన్యమని ఉన్నా అది స్థిరం కనుక ఆధ్యాత్మిక శక్తికి పనికి వస్తుంది. ఇంతకూ రాశి శూన్యంగాని అంశకాదు. కనుక దోషంలేదు. పై వారనక్షత్రాలలో ద్వితీయ కలిస్తే దోషం. అదీలేదు. యోగ దోషంకూడా "హూణ వంగ కశేభ్యో ఒ న్య- దేశేష్వేశుభప్రదాః" అనే నారద వచనానుసారం లేనట్లే.

ఇంకా స్వల్పాతిస్వల్ప దోషం ఉన్నా గుణాధికం గ్రాహ్యమని ప్రమాణం చూడండి-

"గుణాధికతరే లగ్నే దోషేస్వల్ప తరేషుచ
సురాణాం స్థాపనం త కర్తురిష్టార్థసాధనమ్"

సుముహూర్త చక్రము

స్వస్తి శ్రీ చాంద్రమాన భావనామ సంవత్సర చైత్రపూర్ణిమ సోమవారము చిత్రానక్షత్రయుక్త మిథునలగ్నము.

తేది : **25-4-1994.**

సమయము ఉ.గం. **9.57** ని

ఈ రీతిగా శ్రీ గురుదేవుల వారి శాస్త్రీయము. మంగళకరమని తెలియనగును.

—+—